# ప్రపంచ చరిత్ర

## ( రెండవ భాగము )

జవహర్‌లాల్ నెహ్రూ

రచన

చింతా దీక్షితులు

అనువాదము

[illegible]తి ప్రచురణ

# ప్రపంచ చరిత్ర

Prapanja charithra.

## (రెండవ భాగము)

ఆంగ్లమూలము :

జవహార్‌లాల్ నెహ్రూ

Jawaharlal nehru

ఆంధ్రీకరణము :

చింతా దీక్షితులు

Chinta. Thekshithulu.

సంస్కృతి ప్రచురణ

వెల రెండు రూపాయలు

# విషయసూచిక

## డెహ్రాడూన్ జిల్లా జెయిలునుండి



## పటములు



## రచయిత

1889లో జననము. కాశ్మీర బ్రాహ్మణులు. తండ్రిపేరు మోతీలాల్ నెహ్రూ—ప్రఖ్యాత న్యాయవాది. తల్లి స్వరూపరాణి. జన్మస్థానము ప్రయాగ—అలహాబాద్. ఇంటివద్ద కొంతకాలము ప్రైవేటు చదువుకొని, హారోలో, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములోని ట్రినిటీకళాశాలలో విద్య నభ్యసించినారు. అలహాబాద్ హైకోర్టులో న్యాయవాదిగా జీవితము ప్రారంభించినారు. 1918 లో ఇండియన్ హోమ్‌రూల్ లీగుకు కార్యదర్శి అయినారు. 1918 నుండి అఖిలభారతకాంగ్రెస్‌సభలో సభ్యులుగా నున్నారు. 1921 లో మొదటిసారి కారాగృహవాస మనుభవించినారు.

ఇప్పటికి ఎనిమిదిమారులు శ్రీకృష్ణజన్మస్థానము చూచివచ్చినారు. 1929 లో కాంగ్రెస్ కార్యదర్శి అయినారు. 1930, 36, 37, 46లలో కాంగ్రెస్ అధ్యక్షులయినారు. వివాహితులు. భార్య—కమలా నెహ్రూ—చనిపోయినది. కుమారులు లేరు. కుమార్తె ఒక్కతే—ఇందిరాగాంధీ. చెల్లెండ్రిద్దరు—విజయలక్ష్మి పండిట్, కృష్ణహతీసింగ్.

ఈయన గొప్ప ప్రజాస్వామ్యవాది. ఆంగ్లములో అనేకగ్రంథములను రచించినారు. వీరి రచనలలో 'సోవియట్ రష్యా' (సంస్కృతి—4) 'ప్రపంచ పరిణామము' (సంస్కృతి—20) లు తెలుగున వెలువడియున్నవి. విలాసము, 17 యార్క్ రోడ్డు, న్యూఢిల్లీ.

# మా మాట

'ప్రపంచ చరిత్ర' మొదటిభాగము వెలువడి చాల నెలలు గడచినవి. రెండునెలల కొకభాగము చొప్పున, 10 భాగములను రెండేండ్లలోపున ప్రచురింప గలుగుదు మనుకొన్నాము. కాని కాగితపుకరువు, కోరినరకపు కాగితము సమయమునకు లభించకపోవుట, ముద్రణ కగు ఖర్చులు, స్వల్ప విక్రయము—ఇవి కారణముగా అనుకొన్నంత త్వరగా రెండవభాగము వెలువరచలేక పోయినాము. త్వరలోనే మా సొంత ముద్రణాలయము ఏర్పరచ ప్రయత్నించుచున్నాము. మాప్రయత్నము ఫలించిన—స్వతంత్రుల మైన—త్వరలోనే మిగిలిన భాగములను పాఠకమహాశయుల కందించగలము.

ప్రకాశకులు

# 36

# దక్షిణ ఇండియా వలసపోవుట

ఏప్రియల్ 28, 1932.

మన మెంతో దూరము తిరిగితిమి. మరల ఇండియాకు తిరిగి వచ్చి మన పూర్వీకులు ఏమి చేయుచుండిరో చూతము. కుషాణుల పొలిమేర సామ్రాజ్యము నీకు జ్ఞాపకమున్న దనుకొందును. ఈ బౌద్ధ సామ్రాజ్యమున ఉత్తరహిందూస్థానమంతయును, మధ్య ఆసియాలో పెద్దభాగమును ఇమిడియుండెను. దాని రాజధాని పురుషపురము, లేదా పెషావరు. ఈ కాలమునందే దక్షిణ ఇండియాలో ఈ సముద్రమునుండి ఆ సముద్రమువరకు వ్యాపించిన ఆంధ్రరాజ్య ముండెను. సుమారు 300 సంవత్సరముల కాలము కుషాణులును, ఆంధ్రులును అభివృద్ధిలో నుండిరి. క్రీ. వె. మూడవ శతాబ్ది మధ్యకాలములో ఈ రెండు సామ్రాజ్యములును అంతమొందినవి. తరువాత కొంతకాలమువరకు ఇండియాలో కొన్ని చిన్నరాజ్యములు వర్ధిల్లినవి. కాని నూరుసంవత్సరములలో వేరొక చంద్రగుప్తుడు తలయెత్తెను. అప్పు డొక హిందూసామ్రాజ్యము ప్రారంభమాయెను. వారిని గుప్తు లందురు. గుప్తుల సంగతి ఎత్తుకొనుటకు ముందు, దక్షిణమున ప్రారంభమయిన గొప్ప ఉద్యమములను గూర్చి తెలిసికొందము. ఇండియా దేశమందలి లలితకళలను, సంస్కృతిని తూర్పున నున్న దూరద్వీపములకు వ్యాపింపజేసిన ఉద్యమము లివి.

ఇండియా హిమాలయములకును, రెండు సముద్రములకును నడుమ నున్నది. దాని ఆకారము నీకు తెలియును. ఉత్తర భాగము సముద్రమునకు సుదూరమున నున్నది. దాని పొలిమేరలగుండా శత్రువులు దండయాత్రలు నడిపించుచుండిరి, కాన ఆ పొలిమేరను సంరక్షించుకొనుటయే అచ్చటివారి ప్రధానవ్యాపకముగా నుండెను. తూర్పున, పడ

మట, దక్షిణమున మనకు గొప్ప సముద్రతీర మున్నది. ఇండియా సన్నగిలుచు పోగాపోగా కన్యాకుమారివద్ద (కామరిన్ అగ్రము) తూర్పు పడమరలు కలియుచున్నవి. సముద్రప్రాంతమున నివసించు జనులకు సముద్ర మన్న ప్రీతి. వారిలో పలువురు సహజముగా నావికవృత్తిలో ప్రవేశింతురు. పాశ్చాత్యదేశములతో దక్షిణఇండియా బహు ప్రాచీన కాలమునుండియు గొప్పవర్తకమును సాగించుచుండెనని నీకు చెప్పియుంటిని. కాన ప్రాచీనకాలమునుండియు నౌకానిర్మాణవిద్య ఇండియాలో వర్ధిల్లుచుండెనన్న ఆశ్చర్యకరము కాదు. వర్తకమునకో, సాహసకార్యములు చేయుటకో అచ్చటివారు సముద్రముల దాటుచుండిరి. విజయచక్రవర్తి ఇండియానుండి వెళ్ళి సింహళమును వశపరచుకొనె నని చెప్పుదురు. గౌతమబుద్ధుడు జీవించియున్న కాలమున నిది జరిగెను. అజంతా గుహలలో, విజయుడు సింహళమునకు సముద్రమును దాటి వెళ్లుచున్నట్లును, అతని గుర్రములును, ఏనుగులును నావలలో దాటించబడుచున్నట్లును చిత్రము లున్నవి. సింహళద్వీపశబ్దమునందలి సింహళ మను పేరు విజయుడు పెట్టినదే. సింహళశబ్దము సింహమునుండి వచ్చినది. సింహమునకు సంబంధించిన కథ యొకటి ఆ ద్వీపమున ప్రచారములో నున్నది. దానిని మరచితిని. సిలోను అను పదము సింహళమునుండి వచ్చినదని ఊహింతును.

దక్షిణఇండియానుండి సింహళమునకు వెళ్లుటకు సముద్రమును దాటవలసియున్నది. ఈ దాటుట అంత కష్టమైన పని కాదు. బెంగాలు మొదలు గుజరాతువరకు నున్న సముద్రతీరమందలి రేవు లనేకమునుండి జనులు సముద్రయానము చేయువా రనుటకును, నౌకానిర్మాణము చేయువా రనుటకును నిదర్శనములు పుష్కలముగా నున్నవి. నైనీ చెరసాల నుండి నీకు అర్థశాస్త్రమునుగురించి వ్రాసియుంటిని. చంద్రగుప్తమౌర్యుని మహామంత్రి చాణక్యుడు తన అర్థశాస్త్రములో నౌకాబలమునుగూర్చి కొంత వ్రాసియున్నాడు. చంద్రగుప్తుని కొలువులో గ్రీకురాయబారిగా

మున్న మెగాస్తనీసుకూడ దాని నుదహరించెను. కాబట్టి మౌర్యరాజ్య ప్రారంభమునందే నౌకానిర్మా[illegible]
చున్న పరిశ్రమ యని బోధపడుచున్నది. నౌక లుండుట సముద్రయాన ములకే గదా. కాన ఆ నౌకలలో అనేకులు సముద్రయానములు సలిపి యుందురు. ఈ విషయమును తలచుకొని, నేడు సముద్రమును దాటు టకు భయపడు ప్రజలను, అట్లు దాటుట ధర్మసమ్మతము కాదని యూహించు ప్రజలను తలచుకొనిన వింతగా నుండును. ఇట్టి మానవు లను పురాతన పురుషుల సంప్రదాయమువారని చెప్పజెల్లదు. ఏలయన, పురాతనకాలమందలి పురుషు లింతకన్న వివేకము కలవారు. అదృష్ట వశమున అసాధారణమగునట్టి యూహలు నేడు చాలవర కంతరించినవి. వానిని వినువారు నేడు బహుకొద్దిమంది మాత్రమే.

ఉత్తరాదికన్న అధికముగా దక్షిణాదియే సముద్రమువైపు దృష్టులు నిగిడ్చెను. పరదేశవర్తకము అధికభాగము దక్షిణాదితోనే జరుగు చుండెను. యవనసారాయిలు, యవనపాత్రలు, యవనదీపస్తంభములు తమిళకావ్యములలో నుదహరింపబడినవి. యవనపదము ముఖ్యముగా గ్రీకుల నుద్దేశించినది. కాని పరదేశులందరికిని ఆ పదమును వాడు చున్నట్లు తోచును. రెండుమూడు శతాబ్దులనాటి ఆంధ్రనాణెములపై రెండు తెరచాపకొయ్యలు గల నావ ముద్రింపబడినది. ప్రాచీనాంధ్రులు నౌకా నిర్మాణ మన్నను, సముద్రయాన మన్నను ఎంతటి యుత్సాహము చూపెడి వారో దీనినిబట్టి గ్రహించవచ్చును.

కాన ఒక మహోద్యమమునకు మార్గదర్శకులైనవారు దక్షిణాదివారే. తత్ఫలముగా తూర్పుదీవులందంతట హిందువుల వలసలు స్థాపించబడి నవి. క్రీస్తువెనుక ప్రథమశతాబ్దిలో ఈవలసలకు ప్రయాణములు ప్రారంభ మాయెను. వందలకొద్ది సంవత్సరములపాటు సాగెను. మలయా, జావా, సుమత్రా, కంబోడియా, బోర్నియోద్వీపము లెల్లకడలకు వారు వెళ్ళిరి. అక్కడ వారు స్థిరపడిరి. వారితోకూడ హైందవకళను, హైందవ

సంస్కృతిని కొంపోయిరి. బర్మాలో, సయాంలో, ఇండోచీనాలో హిందువుల వలసలు పెద్ద వున్నవి. క్రొత్త పట్టణములకును, నివాసస్థలములకును వారు పెట్టిన పెక్కు పేర్లుసైతము ఇండియానుండి గ్రహింపబడినవే—అయోధ్య, హస్తినాపురము, తక్షశిల, గాంధారము. చరిత్ర ఎట్లు పునశ్చరణ చేయునో! అమెరికాకు వలసవెళ్ళిన ఆంగ్లో - సాక్సనులు ఈ విధముగానే చేసిరి. నేడు అమెరికా సంయుక్తరాష్ట్రములలో ప్రాత ఇంగ్లీషు నగరముల పేర్లు కొన్నిపట్టణముల కుంచబడినవి.

సాధారణముగా వలసకువెళ్ళినవారు సక్రమముగా ప్రవర్తించరు. వలసకు వెళ్ళిన హిందువులుకూడ వెళ్ళిన తావులందెల్ల సక్రమముగా ప్రవర్తించియుండరు. ద్వీపవాసులను తమ ప్రయోజనముకొరకు బాధించియుందురు. వారిపై అధికారమును చెలాయించియుందురు. కొంతకాలమైనపిమ్మట ద్వీపవాసులును, వలసకుపోయినవారును కలిసిపోయియుందురు. ఏలయన, ఇండియాతో ఎడతెగని సంబంధము నిలుపుకొనుట కష్టముగాదా. ఈ తూర్పుద్వీపములలో హిందూరాజ్యములు, సామ్రాజ్యములు స్థాపించబడినవి. పిమ్మట బౌద్ధపరిపాలకులు వచ్చిరి. ప్రభుత్వమునకై హిందువులకును, బౌద్ధులకును కలహములు ప్రాప్తించెను. విస్తరితహిందూస్థానము (మహా హిందూస్థానము) యొక్క చరిత్ర సుదీర్ఘమై మనోహరముగా నుండును. హిందువుల వలసభూములలో దివ్యభవనములును, గొప్ప దేవాలయములును వెలసినట్లు నేడు కానవచ్చు గొప్ప శిథిలములు సాక్ష్యమిచ్చుచున్నవి. కాంభోజ, శ్రీవిజయ, దివ్యమగు అంగ్‌కోరు, మజపహిత్ అను గొప్ప నగరములను హిందూ వాస్తుశాస్త్రజ్ఞులు, శిల్పులు నిర్మించియుండిరి.

సుమారు 1400 సంవత్సరముల కాలము ఈ హిందూ బౌద్ధరాజ్యములు ఈ ద్వీపములలో పరిపాలనము చేసినవి. ప్రభుత్వమునకై ఒకరితో నొకరు పోరాడుచు, ఒకరి నొకరు వినాశముచేసికొనుచు ఆ రాజ్యములవారు, కాలముగడపిరి. 15 వ శతాబ్దిని చివరకు ఈ ద్వీపములు ముస్లిములకు వశమయ్యెను. వారి తరువాత కొద్దికాలములోనే పోర్చు

గీసులు, స్పెయినుదేశస్థులు, డచ్చివారు, ఇంగ్లీషువారు, చివరకు అమెరికనులు వచ్చిరి. చీనాదేశస్థులు పొరుగుననే యుండిరి. ఒక్కొక్కమారు వారు వీరి వ్యవహారములలో కలుగజేసికొనుచు, విజయముగాంచుచు, తరచు స్నేహముగా మెలగుచు, కానుకలు పంపుచు స్వీకరించుచు ఉండిరి. చీనాదేశస్థుల గొప్ప నాగరికత, సంస్కృతి వారినెల్లవేళల సంస్కరించుచునే యుండెను.

తూర్పున వెలసిన హిందువుల వలసలనుగురించి తెలిసికొనదగిన విషయము లనేక మున్నవి. అం దొక్కటి. ఆ కాలమున దక్షిణఇండియా నేలుచున్న ప్రధానప్రభుత్వములలో నొకటి వలసలు వెళ్ళుటకు సౌకర్యముల నేర్పాటు చేసియుండెననుట స్పష్టము. మొట్టమొదట తమంతట తామే కొందరు పరిశోధకులు పోయియుందురు. పిమ్మట వర్తకము వృద్ధియగుచురాగా కుటుంబములు, జనసమూహములు తమంతట తామే పోయియుందురు. తొలుత నచ్చట నివాసమేర్పరచుకొన్నవారు కళింగదేశము (ఒరిస్సా) నుండియు, తూర్పుతీరమునుండియు వచ్చినట్లు చెప్పుదురు. బహుశా కొందరు బెంగాలునుండికూడ పోయియుండవచ్చును. గుజరాతునుండి కొందరు వెడలగొట్టబడి ఈ ద్వీపములకు వెళ్ళినట్లు వృద్ధసంప్రదాయ మొకటి కలదు. కాని ఇవి ఊహలు. వలసలకు వెళ్ళిన ప్రధానపురుషులు పల్లవుల దేశమునుండియే వెళ్ళిరి. పల్లవుల దేశము తమిళనాడుకు దక్షిణభాగమున నున్నది. అచ్చట పల్లవరాజవంశము రాజ్యము చేయుచుండెను. మలయా మున్నగు ద్వీపములకు జనులు వలసపోవుట కేర్పాటు లీ పల్లవులే చేసియుందురు. ఉత్తర హిందూస్థానమునుండి జనులు వచ్చిపడుటచే జనసంఖ్య వృద్ధికాగా వీరు వలసలు పోయియుందురు. కారణ మేమైనను, ఇండియాకు ఎంతోదూరమున, దూరదూర ప్రదేశములలో వలసల నేర్పాటుచేసికొనుటకు ముందుగా నిశ్చయించి ఒకే పర్యాయము బయలుదేరివెళ్ళి ఆయా ప్రదేశములలో వలసలు స్థాపించిరి. ఈ నివాసభూములు ఇండోచీనాలో, మలయా ద్వీపకల్పములో, బోర్నియోలో, సుమత్రా, జావా మున్నగు ప్రదేశములలో

నుండెను. ఇవన్నియును హిందూదేశమునకు సంబంధించిన పేర్లు గలిగిన పల్లవుల వలసలే. ఇండోచీనాలోని వలసకు కాంభోజమని పేరు (దానినే ఇప్పుడు కంబోడియా అందురు). ఈ పేరు కాబూలు లోయలోని గాంధారదేశమందున్న కాంభోజ నామమే.

400, 500 సంవత్సరములపాటు ఈ వలసలు హిందూమతమునే అవలంబించియుండెను. పిమ్మట క్రమక్రమముగా బౌద్ధమతము వ్యాపించెను. చాలకాలమైనపిమ్మట ఇస్లాంమతము వచ్చెను. అది మలయాద్వీప సముదాయపు కొంతభాగములో వ్యాపించెను. మిగతభాగము బౌద్ధముగానే యుండెను.

మలయా ద్వీపసముదాయములో సామ్రాజ్యములు, రాజ్యములు లేచినవి, అంతరించినవి. దక్షిణ ఇండియానుండి వెళ్ళిన వలసల ప్రధాన ఫలితము ఈ ప్రపంచభాగమున హిందూ - ఆర్యుల నాగరికత ప్రవేశము గాంచుట. కొంతవరకు మలయా ద్వీపసముదాయమందలి ప్రజలు మనము వారసులమైన నాగరికతకే వారసులైరి. ఇతర సంపర్కము కూడ—ప్రధానముగా చీనాసంపర్కము—వారికి తగిలెను. ఇండియా చీనాల ప్రబలమగు సంపర్కములు మలయా ద్వీపసముదాయ ప్రజలపై ఎట్లు పనిచేసినవో పరిశీలించుట ముచ్చటగా నుండును. కొందరిలో హిందూ సంప్రదాయము లధికముగా కానవచ్చును. మరికొందరిలో చీనాసంప్రదాయములు కానవచ్చును. బర్మా, సయాం, ఇండోచీనాలలో చీనాప్రభావ మధికముగా నుండెను. మలయాలో అంత లేదు. జావా, సుమత్రా మున్నగు ద్వీపములలో హిందూప్రభావము క్రొత్తగా వచ్చిన ఇస్లాం బురఖాతో కానవచ్చును.

కాని హిందూ, చీనాసంపర్కములకు వివాదము లేదు. వాటిలో పోలికలు తక్కువే. అయినప్పటికిని దేనికది కష్టములేకుండ, సంఘర్షణ లేకుండ పోగలిగినవి. మతవిషయమున—హిందూమతముకాని, బౌద్ధము కాని—హిందూదేశమే 'కడుపుచల్లంగ మతముల గన్న తల్లి'. చీనా సైతము తన మతమును ఇండియానుండియే గ్రహించెను. లలితకళల

విషయమునకూడ, మలయా ద్వీపసముదాయముపై హిందూప్రభావ మత్య ధికము. చీనా ప్రభావ మధికముగా పనిచేసిన ఇండోచీనాలో సైతము గృహనిర్మాణపద్ధతి హిందూ వాస్తుశాస్త్రానుగుణముగానే యుండెను. పరిపాలనాపద్ధతుల విషయమునను, జీవితమునకు సంబంధించిన తత్వ శాస్త్ర విషయమునను చీనా తన ప్రభావము నీ దేశములపై నధికముగా చూపెను. కావుననే నేడు ఇండోచీనా, సయాం, బర్మాదేశములందలి ప్రజలు హిందూదేశస్థులకుగాక చీనాదేశస్థులకే సన్నిహితులైనట్లు కని పించుచున్నారు. జాతినిబట్టి చూడ వారిలో మంగోలియన్ రక్తమే అధికముగా ప్రవహించుచున్నది. ఇందువల్లనే వారు చీనాదేశస్థులను పోలియున్నారు.

హిందూదేశ శిల్పులచే నిర్మింపబడిన గొప్ప బౌద్ధాలయముల శిథి లములు నేడు జావాలోని బొరోబొడూర్ అను చోట చూడనగును. ఈ యాలయముల గోడలపై బుద్ధుని జీవితగాథ సర్వము మలచబడినది అవి బుద్ధున కెత్తిన జ్ఞాపకచిహ్నములు మాత్రమే కావు; ఆనాటి హిందూ శిల్పమున కెత్తిన జ్ఞాపకచిహ్నములు కూడ.

హిందూదేశప్రభావ మంతటితో ఆగలేదు. అది యింకను దూర ముగా పోయెను. ఫిలిప్పైనుదీవులను, ఫార్మోజానుకూడ అది ఆవ రించెను. ఈ రెండుదీవులును కొంతకాలముపాటు సుమత్రాలోని శ్రీ విజయుని హిందూరాజ్య భాగములై యుండెను. చాలకాలమైన పిమ్మట స్పెయినుదేశస్థులు ఫిలిప్పైనుదీవుల నేలిరి. నేడు వారు అమెరికనుల వశమం దున్నారు. ఫిలిప్పైను దీవులకు ముఖ్యపట్టణము మణిలా, కొన్నాళ్ళక్రితము ఒక శాసనసభాభవన మాపట్టణమున నిర్మింపబడినది. భవనముఖమున నాలుగు ప్రతిమలు మలచబడినవి. ఫిలిప్పైనుల సంస్కృ తికి మూలములగు ప్రతిమ లవి. ఈ ప్రతిమలలో ఒకటి ధర్మశాస్త్ర కర్తయగు మనుప్రతిమ; చీనాతత్వవేత్తయగు లోచేది రెండవ ప్రతిమ; ఆంగ్లో-సాక్సను ధర్మశాసనములను, న్యాయమును తెలియజేయు ప్రతిమ మూడవది; స్పెయినుదేశమును తెలియజేయు ప్రతిమ నాల్గవది.

37

# గుప్తుల హయామున హిందూసామ్రాజ్యతత్త్వము

ఏప్రియల్ 29, 1932.

దక్షిణఇండియాలోని ప్రజలు సముద్రములు దాటి దూరదేశములలో నివాసభూములు, పట్టణములు నిర్మించుకొనుచుండు కాలమున ఉత్తర హిందూస్థాన మల్లకల్లోలముగా నుండెను. కుషాణసామ్రాజ్యము బలమును, గొప్పతనమును కోల్పోయి సన్నగిల్లి ముడుచుకొనిపోవుచుండెను. ఉత్తరమునందంతటను చిన్నరాజ్యములు వెలసినవి. వాయవ్యపొలిమేరల గుండ దిగిన శకులు, సిథియనులు, టర్కీలసంతతివారు వాటి నేలుచుండిరి. వీరు బౌద్ధులని నీకు చెప్పియుంటిని. వీరు ఇండియాకు శత్రువులవలె దాడిచేయుటకు రాలేదు. ఇండియాలో స్థిరనివాస మేర్పరచుకొనుటకు వచ్చిరి. మధ్యఆసియాతెగలవారిచే ముందుకు తరుమబడుటచే వీరు ఇండియాకు వచ్చిరి. తరిమినవారిని చీనారాజ్యము అచ్చట నిలువనీయలేదు. ఇండియాకు వచ్చి ఈ తెగలవారు హిందూ-ఆర్యుల ఆచారములను, సంప్రదాయములను అధికముగా అవలంబించిరి. మతము, సంస్కృతి, నాగరికతల విషయమున వీరు ఇండియాను మాతృభూమిగా నెన్నుకొనుచుండిరి. కుషాణులు విరివిగా హిందూ-ఆర్యుల సంప్రదాయములనే అనుసరించిరి. ఇండియాలో వీరు నిలిచిపోవుటకును, ఎంతోకాలము ఇండియాలోని పెద్దభాగములను పరిపాలించుటకును ఇదియే కారణము. వారు హిందూ-ఆర్యులవలెనే ప్రవర్తించిరి. తాము పరదేశులన్నమాట దేశస్థులు మరచిపోవలెనని కోరిరి. కొంతవరకు వీరు కృతకృత్యులైరి. కాని పూర్తిగా కాలేదు. ముఖ్యముగా క్షత్రియులు, తమ్ము పరదేశు లేదా

చున్నారను భావముతో బాధపడుచుండిరి. ఈ పరదేశపాలనము వారికి దుర్భరముగా నుండెను. ప్రజల హృదయములు తత్తరపాటు జెంద జొచ్చెను. ఉద్రేక మతిశయించెను. చివరకు అసంతుష్టితో కుములుచున్న ప్రజలకు సమర్థుడగు నాయకుడు దొరికెను. అతని జెండాక్రింద చేరి, ఆర్యావర్తమును పరపాలనమునుండి విడిపించుటకు ప్రజలు ధర్మయుద్ధ మును బయలుదేరదీసిరి.

ఈ నాయకుని పేరు చంద్రగుప్తుడు. అశోకుని తాతయైన చంద్ర గుప్తుడు వేరు అను మాట మరచిపోవద్దు. ఇతడు మౌర్యవంశమునకు సంబంధించినవాడు కాడు. ఇతడు పాటలీపుత్రము నేలు చిన్నరాజు. అప్పటికే అశోకుని సంతతివారు అంతరించిరి. ఇప్పుడు మనము క్రీ. పె. నాల్గవ శతాబ్దిలో, అనగా క్రీ. వె. 308 సంవత్సరములో నున్నామని జ్ఞప్తియం దుంచుకొనుము. అనగా అశోకుడు మరణించి ఇప్పటికి 534 సంవత్సరము లైనది.

చంద్రగుప్త డాశాపూరితుడు, సమర్థుడు. ఉత్తరమున ఉన్న ఆర్య నాయకులను కలియగట్టుకొనుట కాతడు ప్రారంభించెను. వారితో కలిసి ఒక సంయుక్తప్రభుత్వమును (Federation) స్థాపించవలెనని అతని ఊహ. ప్రబలురు, ప్రసిద్ధులు అగు లిచ్ఛవుల వంశసంజాతను కుమారదేవి నాతడు వివాహము చేసికొనెను. తత్కారణమున లిచ్ఛవుల సహాయ మాతడు పొంద వీలుకలిగెను. చేయవలసిన ఏర్పాట్లన్నియు జాగ్రత్తగా జేసి అతడు హిందూస్థానమందలి పరదేశప్రభువులపై ధర్మయుద్ధమును ప్రకటించెను. పరదేశప్రభువులు కారణముగా తమ పదవులను, అధికార ములను గోల్పోయిన క్షత్రియులును, ఆర్యకులీనులును అతనిని ప్రోత్స హించిరి. 12 సంవత్సరములపాటు పోరాటము జరిగినపిమ్మట చంద్ర గుప్తుడు ఉత్తరహిందూస్థానమందలి ఒక భాగమును స్వాధీనముచేసి కొనెను. నేటి సంయుక్తరాష్ట్రము లాభాగములోనివే. పిమ్మట అతడు రాజాధిరాజుగా పట్టము కట్టుకొనెను.

గుప్తరాజవంశ మీవిధముగా ప్రారంభమయ్యెను. హూణులు వచ్చువరకు సుమారు 200 సంవత్సరముల కాల మది నిలిచియుండెను. ఆ కాలమున హిందూమతము, జాతీయత సగర్వముగా తలయెత్తి తిరుగుచు ఇతరులను దీకొనుచుండెను. పరదేశప్రభువులు—టుర్కులు, పార్థియనులు, మున్నగు అనార్యులు—సమూలముగా, బలాత్కారముగా తొలగింపబడిరి. జాతివైర మెట్లు పనిచేసినదో మనము దీనినిబట్టి తెలిసికొనవచ్చును. హిందూ-ఆర్యకులీనులు తమ జాతి యన్న గర్వించెదువారు. ఈ బర్బరులను, మ్లేచ్ఛులను తృణీకరించువారు. గుప్తులచే నోటమిచెందిన హిందూ-ఆర్యరాజ్యములు, రాజులు దయగా చూడబడిరి. అనార్యులపట్ల దయాదాక్షిణ్యములు చూపబడలేదు.

చంద్రగుప్తుని కుమారుడు సముద్రగుప్తుడు ధైర్యసాహసములందు తండ్రిని మించినవాడు. అతడు గొప్పసేనాని. ఆతడు చక్రవర్తియైనప్పుడు ఉత్తరహిందూస్థానమం దంతటను, దక్షిణముననుకూడ దిగ్విజయ యాత్రలు చేసెను. హిందూదేశమునం దధికభాగమును వశముచేసికొని గుప్తసామ్రాజ్యము నాతడు విస్తరింపజేసెను. కాని దక్షిణమున నతని ప్రభుత్వము నామమాత్రమే. ఉత్తరమున కుషాణులు సింధునది దాటువరకు తరుమగొట్టబడిరి.

సముద్రగుప్తుని కుమారుడు రెండవ చంద్రగుప్తుడుకూడ యోధుడే. చాలకాలమునుండి శకరాజవంశమో, టుర్కీరాజవంశమో పరిపాలించుచున్న కతియవాడు, గుజరాతుల నాతడు స్వాధీనముచేసికొనెను. విక్రమాదిత్యనామము నాతడు వహించెను. ఈ నామమే ఇతనికి నిలిచినది. కాని ఈ పేరు సీజరుపేరువలెనే అనేకరాజుల బిరుదమైనది. ఆకారణమున రాజులపేర్లు గందరగోళముగా నుండెను.

ఢిల్లీలో కుతుబ్‌మీనారువద్ద పెద్ద ఇనుపస్తంభమును చూచిన జ్ఞాపక మున్నదా? ఈ స్తంభము నాతడు జయస్తంభముగా నెత్తినట్లు చెప్పుదురు. అది చక్కని పనివానితనమును చూపుచున్నది. దాని శిఖరముపై సామ్రాజ్యచిహ్నమగు పద్మము చెక్కబడినది.

గుప్తుల రాజ్యకాలము ఇండియాలో హిందూసామ్రాజ్యతత్వము విలసిల్లిన కాలము. ప్రాచీన ఆర్యసంస్కృతి, సంస్కృతవిద్య ఆకాలమున గొప్పగా పునరుజ్జీవనము కన్నవి. గ్రీకులు, కుషాణులు మున్నగువారు ప్రవేశపెట్టిన గ్రీకు, మంగోలియన్ సంస్కృతులు, సంప్రదాయములు ఆనాడు ప్రోత్సహింపబడలేదు సరిగదా, హిందూ-ఆర్య సంప్రదాయములకు ప్రాముఖ్య మిచ్చి, అవి అణచివేయబడినవి. సంస్కృతము రాజభాష. ఆ రోజులలో నైనను సంస్కృతము ప్రజాసామాన్యము వాడుకొను భాష కాదు. ఆనాటి వాడుకభాష సంస్కృతమునకు సన్నిహితముగా నున్న ఒక విధమగు ప్రాకృతభాష. ఆనాడు సంస్కృతము వాడుకభాషగా నుండనప్పటికిని, అది సజీవముగానే యుండెను. సంస్కృతకావ్యనాటకాదులు ఆనాడు వికాసముచెందెను. హిందూ-ఆర్య కళలుకూడ వికసించెను. వేదములు, పురాణములు పుట్టిన మహాకాలము తరువాత ఈకాలమందే సంస్కృతవాఙ్మయము మహోచ్చదశ నందెను. అసామాన్య కవియగు కాళిదా సీకాలమువాడే. మహాకవులచే, మహాశిల్పులచే నలంకరింపబడిన విక్రమాదిత్యుని సభాంగణము దేదీప్యమానముగా వెలుగుచుండెను. విక్రమాదిత్యుని కొలువుకూటమందలి నవరత్నములను గూర్చి వినలేదా ? ఈ నవరత్నములలో ఒక రత్నము కాళిదాసు. సముద్రగుప్తుడు తన రాజధానిని పాటలీపుత్రమునుండి అయోధ్యకు మార్చెను. వాల్మీకికవిమహాకావ్యమున అమరత్వము గాంచిన రామచంద్రుని చరిత్రచే పునీతమైనది అయోధ్య. ఒత్తుకొనివచ్చు అతని హిందూ-ఆర్యదృష్టికి అయోధ్య తగిన స్థానమని అత డనుకొనియుండును.

ఆర్యత్వము,హిందూమతము పునరుజ్జీవనము కాంచుటవల్ల బౌద్ధము ప్రజల ఉపేక్షకు పాత్రమయ్యెను. ఇందుకు కారణములు—ఈ యుద్యమము క్షత్రియసహాయము పొందిన కులీనులది. బౌద్ధమన్ననో ప్రజాపక్షావలంబి. మరియు, మహాయాన బౌద్ధము ఉత్తరహిందూస్థానము నేలిన కుషాణులు మున్నగు పరదేశప్రభువుల సంపర్కదోషము పొందినది

కాని బౌద్ధమును హింసలపాలు చేసినట్లు కనిపించదు. బౌద్ధమతములు అట్లే నిలిచియుండెను. అవి గొప్ప విద్యాసంస్థలుగానే పనిచేయుచుండెను. బౌద్ధమున కాటపట్టయిన సింహళమునేలు ప్రభువులతో గుప్తులు చెలిమి చేసికొనిరి. సింహళద్వీపరాజు మేఘవర్ణుడు సముద్రగుప్తునకు అమూల్యములగు కానుకలను పంపెను. సింహళవిద్యార్థుల యుపయోగార్థము గయలో బౌద్ధమతము నొకటి అతడు ప్రతిష్ఠించెను.

కాని ఇండియాలో బౌద్ధము క్షీణించెను. దీనికి కారణ మిదివరలో నీకు చెప్పియుంటిని. బ్రాహ్మణుల ఒత్తిడివల్లగాని, ఆనాటి ప్రభుత్వము యొక్క ఒత్తిడివల్లగాని అది క్షీణించలేదు. దానిని తనలో క్రమముగా నంతర్భూతము చేసికొన్న హిందూమత ప్రభావమే అందుకు కారణము.

సుమారు ఈకాలమునందే చీనానుండి ఒక ప్రసిద్ధయాత్రికుడు వచ్చి ఇండియాను దర్శించెను. అతడు యువాన్ ఛాంగ్ కాడు. ఇతనినిగూర్చి నీ కిదివరలో చెప్పియుంటిని, అతడు ఫాహియాన్. అతడు బౌద్ధుడు. బౌద్ధ మతగ్రంథములకొర కాతడు వచ్చెను. మగధరాజ్యమందలి ప్రజలు సిరిసంపదలతో సుఖముగా నుండిరని యతడు వ్రాసెను. దండనీతి మార్దవముగా నుండెననియు, మరణదండన ఆకాలమున లేదనియు అతడు వ్రాసెను. గయ ఆకాలమున నిర్జనప్రదేశముగా నుండెను. కపిలవాస్తు నగరము అరణ్యమయము. కాని పాటలీపుత్రమున ప్రజలు ధనధాన్యములతో, సిరిసంపదలతో, నీతినియమములతో విరాజిల్లుచుండిరి. ధనాఢ్యములు, వైభవోపేతములు అగు బౌద్ధసన్యాసమఠములు పెక్కు లానాడుండెను. రాచబాటల పొడుగునను ధర్మశాల లుండెను. యాత్రికులందు విశ్రాంతి తీర్చుకొని ఉచితముగా భోజనము చేయవచ్చును. ఇందులకగు వ్యయము దొరతనము భరించుచుండెను. పెద్దనగరములలో ఉచిత వైద్యశాల లుండెను.

ఇండియాలో పర్యటనముచేసి ఫాహియాన్ సింహళద్వీపమునకు వెళ్లెను. అక్కడ రెండు సంవత్సరములు గడపెను. కాని అతని

స్నేహితు డొకడు టోచింగ్ అనువాడు ఇండియాపై మరులుగొని, బౌద్ధ భిక్కుల భగవద్భక్తి మనస్సు నాకర్షింపగా, ఇండియాలోనే నిలిచి పోయెను. సింహళమునుండి ఫాహియాన్ సముద్రమార్గము ననుసరించి చీనాకు తిరిగివెళ్లెను. అనేక కష్టములపాలై, పెక్కు సంవత్సరముల అనంతరము అతడు ఇల్లుచేరెను.

విక్రమాదిత్యు డను రెండవ చంద్రగుప్తుడు దాదాపు 23 సంవత్సరములు రాజ్యముచేసెను. అతని తరువాత అతని కుమారుడు కుమారగుప్తుడు సింహాసన మెక్కెను. అతడు 40 సంవత్సరములు రాజ్యమేలెను. తరువాత స్కందగుప్తుడు క్రీ. పె. 453 సంవత్సరమున రాజ్యాభిషిక్తు డయ్యెను. అత డొక బీభత్సము నెదురుకో వలసివచ్చెను. గుప్తమహా సామ్రాజ్యపతనమున కదియే చివరకు కారణమయ్యెను. దీనినిగురించి తరువాతి ఉత్తరములో వ్రాసెదను.

గుప్తకళకు నిదర్శనములు—అజంతాది కుడ్యచిత్రములు, చావళ్లు, గర్భాలయములు. అవి ఎంత రమణీయముగా నున్నవో చూచినప్పుడు నీవు తెలిసికొనగలవు. దురదృష్టవశమున చిత్రములు మాసిపోవుచున్నవి. ఎండకు, గాలికి అవి చిరకాలము నిలువలేవు.

ఇండియాలో గుప్తులు రాజ్యపాలనము చేయుకాలమున ప్రపంచమున నితరభాగములలో నేమి జరుగుచుండెను? కాంస్టాంటినోపులు ప్రతిష్ఠించిన రోమకచక్రవర్తి ఘనుడగు కాంస్టాంటయినుసమకాలికుడు మొదటి చంద్రగుప్తుడు. తరువాతి గుప్తుల కాలమున రోమకసామ్రాజ్యము తూర్పు సామ్రాజ్యమనియు, పడమటి సామ్రాజ్యమనియు చీలిపోయెను. తుట్టతుదకు పడమటి సామ్రాజ్యము ఉత్తరాది బర్బరతెగలచే కూలద్రోయబడెను. ఇట్లు రోమకసామ్రాజ్యము దుర్బలమగుచున్న కాలమున ఇండియాలో మహాసేనానులతో, చతురంగబలములతో ప్రబలమగు ప్రభుత్వము పరిపాలన సాగించుచుండెను. సముద్రగుప్తుని హిందూనెపోలియన్ అనుట కలదు. అత డత్యాశాపరుడే కాని అతని దృష్టి, విజయములు సాధించుపట్ల, ఇండియా పొలిమేరల దాటిపోలేదు.

గుప్తుల కాలమున సామ్రాజ్యతత్వము విజృంభించెను. దేశాక్రమణము జరిగెను. విజయములు సాధింపబడెను. కాని ప్రతి దేశచరిత్రయందును ఇట్లు సామ్రాజ్యతత్వము విజృంభించిన రోజులు కలవు. దీర్ఘదృష్టితో చూచిన వాటిప్రయోజనము స్వల్పమే. గుప్తులకాలములో జరిగిన సారస్వత, శిల్పముల దివ్యపునరుజ్జీవనము మాత్రము ఇండియాలో గర్వముతో; చిరకాలము స్మరింపదగియుండును.

# 38

# ఇండియాకు హూణుల ఆగమనము

మే 4, 1932

వాయవ్యపర్వతములగుండా అవతరించిన క్రొత్తబీభత్సము హూణుల బీభత్సము. రోమకసామ్రాజ్యమునుగురించి ప్రసంగించుకొను సమయమున వెనుకటి జాబులో హూణులనుగురించి నీకు కొంత వ్రాసియుంటిని. యూరోపులో వారి మహానాయకుడు అట్టిలా అనువాడు. అతడు రోమును, కాంస్టాంటినోపులును అనేకసంవత్సరములు గడగడలాడించెను. వీరి సంబంధులే హూణులు. వీరిని శ్వేతహూణు లందురు. ఆకాలముననే వీరు ఇండియాకు వచ్చిరి. వీరందరును మధ్యఆసియానుండి వచ్చిన దేశద్రిమ్మరితెగలకు చెందినవారే. వీరు చాలకాలము ఇండియా పొలిమేరలలో పొంచుండి తిరుగుచు ఆప్రాంతములకు ఉపద్రవములు కలిగించుచుండిరి. వారి సంఖ్య వృద్ధియయ్యెను. బహుశా వెనుకనుండి ఇతరతెగలు వీరిని ముందుకు నెట్టియుందురు. ఈ కారణములవలన వారు ఇండియాపై దండయాత్ర సాగించిరి.

గుప్తవంశములో నయిదవవాడగు సముద్రగుప్తుడు ఈ హూణుల ధాటి నెదుర్కొనవలసివచ్చెను. వారి నాతడు ఓడించి వెనుకకు తరిమెను. కాని మరి పన్నెండుసంవత్సరములకు వారు తిరిగివచ్చిరి. క్రమక్రమముగా

గాంధారదేశమందును, ఉత్తరహిందూస్థాన మధికభాగమునందును వారు అల్లుకుపోయిరి. వారు బౌద్ధులను హింసించిరి; అనేకవిధములగు చిత్రవధలు చేయుచుండిరి.

వారిని తరిమివేయుటకు నిరంతరము యుద్ధములు జరిగియుండవచ్చును కాని గుప్తులు వారిని తరిమివేయలేకపోయిరి. హూణుల క్రొత్త దండులు పదేపదే వచ్చి మధ్యఇండియానంతయు ఆక్రమించెను. తోరమన్ అను వారి నాయకుడు రాజుగా పట్టాభిషిక్తు డయ్యెను. అతడు దుష్టుడేకాని అతని అనంతరము రాజ్యమునకు వచ్చిన అతని కుమారుడు వట్టి కిరాతుడు; క్రౌర్యమున రాక్షసులకు తీసిపోడు. అతని పేరు 'మిహిరగుల'. కల్హణుడు వ్రాసిన రాజతరంగిణి యను పేరు గల కాశ్మీర చరిత్రములో 'మిహిరగులుని' వేడుకలలో నొకటి ఏనుగులను కొండ శిఖరమునుండి క్రింది లోయలోనికి దొర్లించుట యైనట్లు చెప్పబడినది. అతని అత్యాచారములను చూచి ఆర్యావర్తము మేలుకొన్నది. గుప్త వంశీయుడగు బాలాదిత్యుడును, మధ్యఇండియాపాలకుడగు యశోధర్ముడును నాయకులుగా ఆర్యులు హూణుల నోడించి మిహిరగులను చెరబెట్టిరి. బాలాదిత్యుడు హూణులవంటివాడు కాడు. దయాదాక్షిణ్యములు కలవాడు. అతడు మిహిరగులను దేశము దాటిపొమ్మని ఆజ్ఞాపించి విడిచిపుచ్చెను. మిహిరగుల కాశ్మీరములో తలదాచుకొనెను. కొన్నిసంవత్సరము లైన పిమ్మట అతడు ద్రోహియై, తన్ను దయతో చూచిన బాలాదిత్యునిపై బడెను.

అచిరకాలములోనే హూణప్రభుత్వము ఇండియాలో దుర్బలమయ్యెను. కాని హూణుల సంతతివారు పలువురు ఇండియాలోనే నిలిచిపోయి, క్రమక్రమముగా ఆర్యజనులలో కలిసిపోయిరి. మధ్య ఇండియా రాజపుత్రస్థానములలోని రాజపుత్రతెగలు కొన్నిటియందు ఈ శ్వేతహూణుల రక్తస్పర్శ యుండవచ్చును.

హూణులు ఉత్తరహిందూస్థానమును కొద్దికాలమే—50 సంవత్సరములకు లోపుగానే—పాలించిరి. పిమ్మట వారు నెమ్మదిగా అచ్చటనే

నివాసము లేర్పాటుచేసికొనిరి. కాని హూణుల యుద్ధములు, హూణుల క్రౌర్యము హిందూఆర్యుల హృదయములకు హత్తుకొనిపోయెను. హూణుల జీవిత పద్ధతులు, పరిపాలనాపద్ధతులు ఆర్యపద్ధతులకు భిన్నముగా నుండెను. ఆర్యు లింకను స్వేచ్ఛాప్రియులగు జాతిగానే ఉండిరి. వారి రాజులు సైతము ప్రజాభీష్టములకు తలయొగ్గవలసినదే. వారి గ్రామసంఘములు అధికారమును కైవసము చేసికొనియుండెను. హూణుల రాకవల్లను, వారు నివాసము లేర్పాటుచేసికొని హిందువులతో కలిసిపోవుటవల్లను ఈ ఆర్య నియమములు పలచబడెను.

మహాగుప్తులలో చివరివాడగు బాలాదిత్యుడు క్రీ. వె. 530 సంవత్సరమున మరణించెను. నికరమగు హిందూరాజవంశమునకు జెందిన ఈ పాలకుని బౌద్ధమత మాకర్షించుట వింత. అతని గురు వొక బౌద్ధ భిక్షువు. గుప్తరాజుల కాలములో కృష్ణారాధనము మరల తలయెత్తెను. అయినప్పటికిని బౌద్ధముతో దాని కెట్టి నిరోధమును ఉన్నట్లు తోచదు.

200 సంవత్సరముల కాలము గుప్తులు పరిపాలనము చేసినపిమ్మట ఉత్తరమున మరల అనేక రాజ్యములు ఎట్టి కేంద్రప్రభుత్వముతోను సంబంధము లేకుండ తలయెత్తెను. దక్షిణ హిందూస్థానమున మాత్రము ఒక గొప్పరాజ్య మిప్పుడు వృద్ధిలోనికి వచ్చినది. పులకేశి దను రాజు రామచంద్రుని సంతతివాడనని చెప్పుకొని, దక్షిణమున చాళుక్య సామ్రాజ్య మను పేర నొక సామ్రాజ్యమును స్థాపించెను. ఈ దాక్షిణాత్యులు తూర్పు దీవులలోని హిందూవలసలతో దగ్గరసంబంధము గలవారై యుండవలెను. హిందూదేశమునకును, ఈ దీవులకును మధ్య నిరంతరము వర్తకము సాగుచునుండవలెను. హిందువుల నావలు పర్షియాకు వర్తక సామగ్రిని కొనిపోవుచుండెనని మనకు తెలియుచున్నది. చాళుక్యసామ్రాజ్యమును, పర్షియాలోని సస్సనీదులును—ముఖ్యముగా వారి మహారాజులలో నొకడగు ఖుస్రూ II—పరస్పరము రాయబారులను తమ తమ కొలువులకు పంపుకొనుచుండిరి.

# 39

# పరదేశపు మార్కెట్టులను ఇండియా స్వాధీనము చేసికొనుట

మే 5, 1932.

మనము ప్రసంగించుకొనుచున్న ఈ ప్రాచీనచరిత్రకాలమున, వేయిసంవత్సరములకు పైగా, పడమటి యూరోపులోను, పడమటి ఆసియాలోను, తూర్పున చీనావరకును గల దేశములందంతటను హిందూస్థానీయుల వర్తకము విరివిగా జరుగుచుండెను. ఇందుకు కారణ మేమి? వారు చక్కని నావికులు, మంచి వర్తకులు అనుటకు సందేహము లేదు. చేతిపనులు చేయుటలో అఖండప్రజ్ఞ గలవారు. ఇవి వ్యాపారమునకు సహాయభూతముగానే యుండెను గాని నిజమగు కారణములు కావు. దూరస్థమగు మార్కెట్టులను ఇండియా స్వాధీనముచేసికొనుటకు ఒక ముఖ్య కారణము ఇండియాలో రసాయనశాస్త్ర మభివృద్ధిగాంచుట. ముఖ్యముగా బట్టలకు రంగులువేయుటలో వారు నిపుణులు. బట్టలకు వెలిసిపోని రంగులను వేయు ప్రత్యేకపద్ధతులను వా రాకాలమున కని పెట్టియుండిరి. నీలిచెట్టునుండి నీలిమందు తయారుచేయు ప్రత్యేక పద్ధతి కూడ వారికి తెలియును. ఇండిగో అను పదముకూడ ఇండియానుండియే వచ్చినది. మన పూర్వులకు ఉక్కును సరిగా కాచి తయారుచేయు పద్ధతి కూడ తెలియునని తోచుచున్నది. చక్కని ఆయుధములను వారు ఉక్కుతో తయారుచేసెడివారు. అలెగ్జాండరు దండయాత్రకు సంబంధించిన ప్రాచీన పరిషియన్ కథలలో మంచి ఖడ్గము, బాకు అను పేర్లు వచ్చినపుడు అవి ఇండియాలో తయారైనవని చెప్పుచుండెడివారని ఇదివరలో నీకు వ్రాసి యుంటినిగదా.

ఈ రంగులను, ఇతర పదార్థములను ఇతర దేశములలోకంటె మిన్నగా ఇండియాలో తయారుచేయుచుండుటవల్లనే అది మార్కెట్టులను స్వాధీనము చేసికొనగల్గెను. మంచి ఉపకరణము లున్నట్టియు, చౌకగా వస్తువులు తయారుచేయగలట్టియు మనుష్యుడుగాని, దేశముగాని అట్టి ఉపకరణములు, పద్ధతులు లేని మనుష్యునిగాని, దేశమునుగాని మార్కెట్టుల నుండి కాలక్రమమున తరిమివేయకతప్పదు. ఈ కారణములవల్లనే గత 200 సంవత్సరములలో యూరోపు ఆసియాను మించిపోయినది. క్రొత్త పరిశోధనము, క్రొత్త వస్తువులను కనిపెట్టుటవలన యూరోపునకు బలమైన క్రొత్త యుపకరణములు చిక్కినవి. తయారుచేయు పద్ధతులు క్రొత్తవి లభించినవి. వీటి సహాయముతో యూరోపు ప్రపంచపు మార్కెట్టును స్వాధీనముచేసికొని భాగ్యవంతము,శక్తివంతము నైనది. ఆ దేశమునకు సహాయముచేసిన ఇతర కారణములును ఉన్నవి. కాని ఉపకరణ మెంత ప్రయోజనకరమగు వస్తువో ఆలోచించుము. ఒక మహనీయుడు చెప్పినట్లు మానవుడు ఉపకరణములను తయారుచేయు జంతువు. తొలి రోజులనుండి నేటికాలమువరకును మానవుని చరిత్రను పరిశీలించినచో నది నానాటికిని సమర్థమగుచున్న ఉపకరణముల చరిత్ర యనియే తేలును. తొలినాటి రాతిబాణములు, శిలాయుగమునకు సంబంధించిన రాతిసుత్తెలు మొదలుకొని రైల్వేలు, ఆవిరిఇంజనులు, నేటి బ్రహ్మాండమైన యంత్రములవరకు గల ఉపకరణముల చరిత్రయే మానవచరిత్ర యగుచున్నది. మన మే పని చేయవలసివచ్చినను ఉపకరణము కావలెను. ఉపకరణములే లేని పక్షమున మన మెట్టి స్థితియందుండెడివారమో.

ఉపకరణము మంచి వస్తువే. చేయవలసిన పనినది చులకన చేయును. కాని ఉపకరణమును దుర్వినియోగము చేయవచ్చునుకూడ. రంపము మంచి ఉపకరణమే; కాని శిశువు దానిని వాడిన చెయ్యి తెగును. కత్తి ఎంతో ఉపయోగకరమగు ఉపకరణము: ప్రతిబాలభటునకు అది యుండవలెను. కాని మూర్ఖుని చేతిలోకత్తి వేరొకని ప్రాణము తీయును.

అది కత్తితప్పుకాదు; ఆ యుపకరణమును దుర్వినియోగముచేయు మనుష్యుని తప్పు.

ఆవిధముగానే నేటి యంత్రములు మంచివే అయినప్పటికిని అనేక విధములుగా దుర్వినియోగము చేయబడినవి, చేయబడుచున్నవి. ప్రజల కార్యభారమును తగ్గించుటకు బదులు ఈయంత్రములు వారి యవస్థను పూర్వముకన్నను అధ్వాన్నముగా చేయుచున్నవి. లక్షలకొద్ది జనుల శరీరములకును, మనస్సులకును సౌఖ్యముచేకూర్చుటకు బదులు అనేకుల కవి దుఃఖమును తెచ్చిపెట్టినవి. ప్రభుత్వపు చేతులలో అవి బ్రహ్మాండమగు శక్తిని పెట్టుటచే వారు యుద్ధములపేర లక్షలకొద్ది జనులను మారణము చేయవచ్చును.

కాని తప్పు యంత్రములది కాదు, వాటిని దుర్వినియోగముచేసిన వారిది. బ్రహ్మాండమగు యంత్రములను నడిపించువారు ధనాశాతత్పరులైన, బాధ్యత లేని మనుష్యులుగాక, ప్రజల శ్రేయస్సు కోరి ప్రజల తరపున వాటిని నడిపించువారైనచో ప్రపంచ మెంతో హాయిగా నుండును.

ఆ రోజులలో, ఈ రోజులవలెగాక, వస్తువులను తయారుచేయుట యందు ఇండియా ప్రపంచమునందు ప్రథమస్థానము నాక్రమించెను. కావుననే ఇండియాలో తయారైన బట్టలు, రంగులు, ఇతర వస్తువులు దూరదేశములకు వెళ్లుచుండెను. దూరదేశప్రజలు వాటిని కోరుచుండిరి. ఈ వర్తకము ఇండియాకు ధనమును కూర్చెను. ఈ వర్తకముమాట అటుండ, దక్షిణహిందూస్థానము మిరియములను, ఇతర సుగంధద్రవ్యములను ఇతరదేశములకు పంపుచుండెను. ఈ సుగంధద్రవ్యములుకూడ తూర్పుదీవులనుండి వచ్చి ఇండియామీదుగా పాశ్చాత్యదేశములకు పోవుచుండెను. రోమునందును, పాశ్చాత్యదేశములందును మిరియములకు విలువ హెచ్చుగా నుండెను. క్రీ. వె. 410 సంవత్సరమున రోమును స్వాధీనముచేసికొన్న గాతులనాయకుడు-అలరిక్ అనువాడు అచ్చటినుండి 3000 పౌనుల మిరియములను తీసికొనిపోయెనట. ఈ మిరియములన్నియు ఇండియానుండియో, ఇండియాద్వారానో వచ్చియుండును.

# దేశముల, నాగరికతల ఒడుదొడుకులు

మే 6, 1932.

చాలకాలమయినది మనము చీనాను వదలిపెట్టి. మరల నచ్చటికి వెళ్ళి మన కథను సాగింతము. పడమట రోము పతనమగుచున్నప్పుడు, ఇండియాలో గుప్తులకాలమున జాతీయ పునరుజ్జీవనము జరుగుచున్నప్పుడు చీనాలో ఏమి జరుగుచున్నదో చూతము. రోమువృద్ధిపతనములవలన చీనాకు ఏమీగకుట్టినట్లుకూడ లేదు. ఆ రెండుదేశములకు మధ్యదూరము అధికము. చీనాప్రభుత్వము మధ్య ఆసియాతెగలను తరిమివేయుటవల్ల ఒక్కొక్కసమయమున యూరోపుకును, ఇండియాకును ప్రమాదములు పొటిల్లె నని ఇదివరలో చెప్పియుంటిని. వారిచే తరుముగొట్టబడిన ఈ తెగలవారు పడమరకో, దక్షిణమునకో పోవుచుండిరి. వా రచ్చటి రాజ్యములను, ప్రభుత్వములను తారుమారు చేయుచుండిరి. చివరకు వారు తూర్పు యూరోపునందును, ఇండియాలోను స్థిరనివాసము లేర్పాటుచేసికొనిరి.

రోమునకును, చీనాకును ఆకాలములో ప్రత్యక్షసంబంధ ముండెను. ఒకరిరాజ్యమున కొకరు రాయబారులను బంపుచుండిరి. ఇట్టి తొట్టతొలి రాయబారి యొకడు క్రీ. వె. 166 సంవత్సరమున ఆన్‌టన్ అను రోమకచక్రవర్తి పంపగా చీనాకు వచ్చినట్లు చీనాగ్రంథములు చెప్పుచున్నవి. ఈ ఆన్‌టన్ అనువాడు వెనుక నీకు వ్రాసిన మార్కస్ అరీలియస్ అంటోనినస్ చక్రవర్తియే. యూరోపులో రోముపతనము ఒక బ్రహ్మాండమగు విషయము. అది ఒక నగరము పడుటమాత్రమే కాదు. ఒక సామ్రాజ్యము కూలుటమాత్రమే కాదు. ఒకవిధముగా రోమక సామ్రాజ్యము కాంస్టాంటినోపులులో తరువాత చిరకాలమువరకు సాగెను. ఆ సామ్రాజ్యచ్ఛాయలు సుమారు 1400సంవత్సరముల కాలము యూరోపు

నంతయు నలముకొనెను. రోముపతన మన్న ఒక మహాయుగ మంత రించిన దన్నమాట. గ్రీసు, రోములకు సంబంధించిన ప్రాచీన ప్రపంచము అంతమునకువచ్చినదన్నమాట. రోముశిథిలములనుండి మరొకప్రపంచము, మరొకసంస్కృతి, మరొకనాగరికత పాశ్చాత్యదేశమున లేచుచుండెను. మాటలవల్ల మనము భ్రమలపా లగుదుము. ఆ మాటలే వాడుకలో మనకు వినిపించుచున్నవి గావున ఆ మాటల కాయర్థమేయని మనము భ్రమపడు దుము. రోముపతనానంతరము పశ్చిమయూరోపు రోముభాషనే వాడ జొచ్చెను. కాని అభాషలో వేరుభావనలు, వేరు అర్థములు ఒదిగియుండెను. నేటి యూరోపుదేశములు గ్రీసురోముల సంతానమేయని ప్రజ లందురు. కొంతవరకు నిజమేకాని ఇది బుద్ధిని భ్రమపెట్టు వాక్యము. ఎందువల్ల ననగా, గ్రీసురోముల ఆశయమొకటి: యూరోపుదేశముల ఆశయ మొకటి. గ్రీసు, రోముల ప్రాచీన ప్రపంచము పూర్తిగా అణగారిపోయెను. వేయి సంవత్సరములపైబడిన కాలములో నిర్మింపబడిన నాగరికత ఎండి క్షీణించెను. అప్పుడే, సగము నాగరికత సగము అనాగరికతలో మునిగి యుండిన పశ్చిమయూరోపుదేశములు చరిత్రలో ప్రవేశించెను. నెమ్మదిగా అవి ఒక క్రొత్త నాగరికతను, ఒక క్రొత్తసంస్కృతిని నిర్మించెను. రోమునుండి వా రనేకవిషయములు నేర్చుకొనిరి. ప్రాచీన ప్రపంచము నుండి వా రనేకవిషయముల నెరువుతెచ్చుకొనిరి. కాని ఎంతో కష్టపడి, ఎన్నోశ్రమలకోర్చి వా రాయావిషయములను నేర్చుకొనిరి. పందలకొద్ది సంవత్సరముల కాలము యూరోపులో సంస్కృతిగాని, నాగరికతగాని లేవు. మౌఢ్యము, అజ్ఞానాంధకారము అప్పు డాదేశములను గ్రమ్మి యుండెను. అందువల్లనే ఈ శతాబ్దుల కాలమునకు అంధకారయుగము లను పేరు వచ్చెను.

ఇది యిట్లు ఏల జరుగవలెను? ప్రపంచ మేల వెనుకడుగు వేయ వలెను? ఎంతో కష్టముతో కొన్నివందల సంవత్సరములలో సముపా ర్జించిన విజ్ఞానము ఏల అంతరించి విస్మృతము కావలెను? ఇవి పెద్ద

సమస్యలు; బుద్ధిమంతులను బాధపెట్టు సమస్యలు. వాటికి సమాధానములు చెప్ప నేను ప్రయత్నించను. తత్వవిచారణమందును, కార్యశూరత్వము నందును మిన్నకెక్కిన ఇండియా హీనదశను పొంది ఎంతోకాలము పాటు బానిసదేశముగా నుండిపోవుట వింతలలో వింతకాదా! గతకాలము దేదీప్యమానముగా వెలిగిన చీనా అంతులేని పోరాటములలో చిక్కి కొననేల? కాని బహుశా కొంచెముకొంచెముగా మానవుడు దీర్ఘకాలము లలో సంపాదించిన విజ్ఞానమును, జ్ఞానమును మాసిపోవని తోచును. కావి ఏకారణముననో మన కన్నులు మూతలుపడును, మన ముక్కొక్కప్పుడు చూడలేము. గవాక్షము మూయబడుటచే అంధకారము కలుగును. కాని బయట అంతటను వెలుతు రున్నది. మనము మన కన్నులను మూతపడ నిచ్చి, గవాక్షములు మూసికొన్నప్పుడు వెలుతురు అంతరించినదని చెప్ప వీలులేదుకదా.

యూరోపులోని అంధకారయుగములకు కారణము క్రైస్తవమత మని కొంద రందురు. ఏసు బోధించిన క్రైస్తవము కాదు. రోమక చక్రవర్తి కాంస్టన్టైను అవలంబించినపిమ్మట పాశ్చాత్య దేశములలో విజృంభించిన 'అధికార క్రైస్తవము'. వీరు చెప్పు మాట ఏమనగా— నాల్గవ శతాబ్దిలో కాంస్టన్టైను క్రైస్తవము నవలంబించుట మొదలుగా "వేయి సంవత్సరములవరకు వివేకమునకు సంకెళ్లు పడినవి, తత్వవిచా రణ బానిసయైనది, విజ్ఞానము ముందంజవేయలేదు." మతముపేర హింసలు, మతమౌఢ్యము, అసహనము పొడచూపినవి. అంతే కాదు, విజ్ఞానశాస్త్రమందుగాని, ఇతర విధములుగాగాని అభివృద్ధిచూపుటకు ప్రజ లకు సాధ్యము కాకుండెను. పవిత్రగ్రంథములు తఱచు అభివృద్ధికి ఆటంకములుగా నుండెను. అవి వ్రాయబడినకాలమున ప్రపంచ మెట్లుండెనో అవి చెప్పును. ఆ కాలమందలి యభిప్రాయముల నవి చెప్పును; ఆచా రముల నవి చెప్పును. పవిత్రగ్రంథమునం దట్లున్నది కాబట్టి ఎవ్వరును ఆ యభిప్రాయములనుగాని, ఆచారములనుకాని కాదనరాదు. కాన,

ప్రపంచము బ్రహ్మాండముగా మారుచున్నప్పటికిని మనము మన యభిప్రాయములను, ఆచారములను నూతనపరిస్థితుల కనుకూలముగా నుండునట్లు మార్చుకోనయితికాదు. దీనికి ఫలితము ఆ కాలమునకు తగనివారమగుదుము. ఇట్టి పరిస్థితులలో చిక్కులు రానేవచ్చును.

యూరోపులో నిట్టి యంధకారయుగమును ప్రవేశపెట్టిన నేరమును కొందరు క్రైస్తవమతముపై నిలుపుదురు. అంధకారయుగములలో జ్ఞానదీపికను వెలిగించినది క్రైస్తవమును, క్రైస్తవసన్యాసులును, క్రైస్తవమతగురువులును అని మరికొంద రందురు. వారు శిల్పమును, కళను నిలిపిరి. అమూల్యగ్రంథములు వారు జాగ్రత్తచేసిరి, వాటి ప్రతులు కూడ తీసికొనిరి.

ఈ విధముగా ప్రజలు వాదోపవాదములు చేయుదురు. బహుశా ఉభయుల వాదములలోను సత్య ముండవచ్చును. కాని రోముపతనానంతరము సంభవించిన చెడుగు లన్నింటికిని బాధ్యత క్రైస్తవముపై నిలుపుట హాస్యాస్పదము. నిజమునకు రోముపతనమున కీ చెడుగులే కారణము.

నేను అసలుసంగతి వదలి దూరముగా పోతిని. నేను చెప్పదలచిన విషయ మేమనగా—యూరోపులో ఉన్నట్లుండి సంఘము చదికిలబడినది. మార్పు కలిగినది. అట్టి మార్పు చీనాలోగాని, ఇండియాలోగాని కలుగలేదు. యూరోపులో ఒక నాగరికత అంతమొందినది. ఇంకొక నాగరికత మెల్లగా పొడచూపుచున్నది. అదియే నేటి నాగరికతగా పరిణమించనున్నది. చీనాలో వెనుకటి ఉన్నత సంస్కృతియు, నాగరికతయు ఎట్టి యవాంతరములును లేక సాగుచుండెను. ఒడుదొడుకులు మాత్ర ముండెను. మంచికాలములు వచ్చును, పోవును. దుష్టులగు రాజులు, చక్రవర్తులు వత్తురు, పోదురు. రాజవంశములు మారును. కాని పరంపరాగతమైన సంస్కృతిమాత్రము విచ్ఛిన్నము కాదు. చీనా చిన్న రాజ్యములుగా చీలిపోయినప్పుడును, అన్యోన్యకలహములు సంభవించి

నప్పుడునుకూడ కళలు, సాహిత్యము వృద్ధినందెను. చక్కని చిత్తరువులు తయారయ్యెను. అందమగు పాత్రలు, చక్కని భవనములు నిర్మితము లయ్యెను. అక్షరముద్రణము వాడుకలోనికి వచ్చెను. టీ త్రాగుట ఆచారమాయెను. కావ్యములందుకూడ టీప్రశంస లెక్కెను. చీనాలో అవిచ్ఛిన్న సౌందర్యమును, కళలును నిరంతరము తాండవమాడు చుండెను. దాని నాగరికౌన్నత్యమే యిందుకు కారణము.

ఇండియాకూడ అంతే. రోమువలె అది హఠాత్తుగా విచ్ఛిన్నము కాలేదు. చెడ్డకాలములు వచ్చినవి, మంచి కాలములు వచ్చినవి. కళా సాహిత్య సృష్టులు జరిగిన కాలము లున్నవి. క్షయ వినాశములు దాపురించిన కాలము లున్నవి. కాని నాగరికత ఒకమాదిరిగా సాగుచునే యుండెను. ఇండియానుండి ఇతర తూర్పుదేశముల కది వ్యాపించెను. కొల్లగొట్టుటకు వచ్చిన మ్లేచ్ఛుల నది తనలో అంతర్భూతము చేసికొని వారికి బుద్ధులు కరపెను. పాశ్చాత్యదేశమును తృణీకరించి ఇండియా చీనాలను పొగడుచున్నానని తలచవద్దు. నేటి ఇండియాచీనాల పరిస్థితులలో స్తుతింపదగిన దేమియు లేదు. గతకాలమున నెంత ఘనత నొందిరో అంతకంత, సాటిజాతులలో అధోగతిపాలైరన్న సంగతి అంధుడుకూడ చూడగలడు. గతకాలసంస్కృతి విచ్ఛిన్నము కాలేదన్నప్పుడు మనము పూర్వౌన్నత్యమును గోల్పోలేదని యర్థముకాదు. మన మొకప్పు డున్నతిలో నుండి నేడు తగ్గిపోయినప్పుడు ప్రపంచమున మనము నీచస్థితికి వచ్చినట్లే స్పష్టమగుచున్నది. అవిచ్ఛిన్నముగా జరుగుచున్న మన నాగరికతను చూచి మనము సంబరపడవచ్చును కాని ఆ నాగరికతయే శుష్కించినప్పుడు మన కెట్టి సంతుష్టి యుండును? గతకాలముతో తెగతెంపులు సంభవించియున్నట్లయితే మనకు శ్రేయస్కరముగా నుండెడిదేమో. అట్లు జరిగినచో మనకు కదలిక పుట్టి యుండెడిది. నూతనజీవనము, వీర్యము మనకు కలిగెడివి. నేడు ఇండియాలోను, ప్రపంచమందును జరుగుచున్న సంఘటనలు మన దేశ

మున కిట్టి కదలిక కలిగించి దానికి యౌవనమును, నూతనజీవనమును కలిగించుచున్నట్లు తోచుచున్నది.

గతకాలమున హిందూదేశమునకు బలమును, పట్టుదలయును దాని పంచాయతీలనుండి వచ్చియుండెను. అవి దేశమున బాగుగా వ్యాపించినవి. అవి గ్రామప్రజాప్రభుత్వములు. ఈనా డున్నట్లు ఆనాడు పెద్ద భూస్వాములుగాని, గొప్ప జమీందారులుగాని లేరు. భూమి పంచాయతీలకు చెందియుండెను, అనగా భూమిని దున్ను రైతుల దన్నమాట. ఈ పంచాయతీలకు పలుకుబడి, అధికారము అధికముగా నుండెను. అందలి సభ్యులు గ్రామస్థులచే ఎన్నుకోబడుచుండిరి. కావుననే ప్రజాప్రతినిధి ప్రభుత్వమున కాధార మీపద్ధతిలో నుండెను. రాజులు వచ్చుచుండిరి, పోవుచుండిరి, లేదా ఒకరితో నొకరు కలహించుచుండిరి. అయినను ఈ గ్రామపద్ధతిని వారు ఎన్నడుసు ముట్టుకొనలేదు. దాని వ్యవహారములలో కలుగజేసికొనలేదు. పంచాయతీల స్వాతంత్ర్యమును తొలగించుటకు సాహసించలేదు. సామ్రాజ్యములు మారుచున్నప్పటికిని గ్రామపద్ధతిపై నాధారపడియున్న సంఘకట్టుబాట్లలో గొప్పమార్పులు రాలేదు. దండయాత్రలు, యుద్ధములు, రాజులుమారుట అను విషయములను బట్టి దేశమందలి జనులందరును బాధపడిరని మనము భ్రమపడవచ్చును. ఒక్కొక్కప్పుడు జనులందరును బాధపడినమాట వాస్తవమే. అది ముఖ్యముగా ఉత్తరహిందూస్థానములో జరిగినది. కాని మొత్తముమీద ప్రజలు బయట ఏమి జరుగుచున్నదో, పైని ఎట్టిమార్పులు జరుగుచుండెనో అంతగా లెక్క పెట్టెడివారు కారనియే చెప్పవచ్చును.

హిందూస్థానమున చాల కాలముపాటు సంఘమునకు బలము కూర్చిన వేరొక విషయముతొలిరోజులలో నుండెడి వర్ణవ్యవస్థ. ఆ రోజులలో వర్ణవ్యవస్థ తరువాతికాలములోవలె అంతగా బిగిసికొని పోలేదు. అది పుట్టుకమీదనే ఆధారపడలేదుకూడ. వేల సంవత్సరములపాటు అది హిందువుల నొకటిగా కట్టియుంచగలిగినది. మార్పు

చెందరాదనిగాని, అభివృద్ధి పనికిరాదనిగాని చెప్పియుండిన నిట్టి ఐక్యత సిద్ధించెడిది కాదు. మార్పును, అభివృద్ధిని అది అంగీకరించెను. వారి మతమును, జీవితవిధానమును మత సహనమును, మార్పును అంగీకరించెను. అందువల్లనే దానికి బలము చేకూరెను. కాని దండయాత్రలు తడవతడవకు వచ్చుటవల్లను, ఇతరచిక్కులవల్లను వర్ణవ్యవస్థ కాలక్రమమున బిగిసిపోయెను. దానితోపాటు హిందువుల దృష్టి సంకుచితమై, మార్దవమును గోల్పోయెను. ఇట్లు జరుగగాజరుగగా నేడు హిందువులు నీచస్థితికి రావలసినవారైరి. ఎట్టి యభివృద్ధికైనను వర్ణవ్యవస్థ అడ్డుదగులుచుండెను. సంఘము నొకటిగా కట్టియుంచుటకు బదులు దానిని వందలకొద్ది విభాగములుగా చేసెను. మనలను దుర్బలులనుగా జేసెను. అంతఃకలహములు పెంచెను.

వర్ణవ్యవస్థ ప్రాతకాలములో హిందూస్థానమందలి సంఘమునకంతకును బలముపోసెను. అయినప్పటికిని క్షయబీజములు దానిలోనే ఇమిడియుండెను. హెచ్చుతగ్గులను, అన్యాయమును శాశ్వతముగా నిలుపుటకు ప్రయత్నించుటచే చివర కది నిష్ఫలము కావలసినదే. అన్యాయమును, హెచ్చుతగ్గులను ఆధారముగా జేసికొని ఒక తెగగాని, కొందరు మనుష్యులుగాని వేరొక తెగనుగాని, మనుష్యులను గాని తమ లాభముకొరకు బాధపెట్టుచుండినచో సంఘము ఆరోగ్యముగా, స్థిరముగా ఎట్లుండగలదు? ఆత్మలాభముకొరకు అన్యాయముగా ఇతరులను బాధపెట్టుట నేడుకూడ జరుగుచున్నది కాపుననే లోకములో అసౌఖ్యము, చిక్కులు మనము చూచుచున్నాము. కాని ప్రపంచమందంతట ఈ విషయమును ప్రజలు తెలిసికొని దీనిని వదిలించుకొనుటకు గట్టిగా ప్రయత్నములు చేయుచున్నారు.

ఇండియాలోను, చీనాలోను సంఘముయొక్క బలము గ్రామములలో నుండెను. భూమికి యజమానులై దానిని దున్నుకొను వేలాది రైతులవల్ల సంఘబలము కలిగెను. చీనాలోకూడ పెద్ద జమీందార్లు లేరు.

ఇదియే సత్యమని మత మెన్నడును ఇండియాలో చెప్పలేదు. అస హనముకూడ లేదు. ప్రపంచప్రజలందరిలోను బహుశా చీనావారే నాటి కిని నేటికినికూడ మతవిషయమున ఎన్నడును తమ మతమే సరియైనదని పిడివాదములు చేయలేదు.

గ్రీసులోను, రోములోను, అంతకన్న పూర్వము ఈజిప్టులోను ఉన్నట్టి కూలిబానిసత్వము చీనాఇండియాలలో లేదు. ఇంటిచాకిరీకి కొందరు బానిసలగు నౌకరు లుండెడివారు. కాని వారివల్ల సంఘము కళం కితము కాలేదు. వారు లేకున్నను సంఘ మావిధముగానే సాగిపోయి యుండును. ప్రాచీన గ్రీసురోముదేశములలో అట్లుకాదు! అక్కడ అసంఖ్యాకులగు బానిసలు సంఘమున నొక ప్రధానభాగమైయుండిరి. అన్నిపనులను చేయు భారము వారిమీదనే ఉండెను. ఈజిప్టులో ఈ బానిసలే లేకున్న పిరమిడ్లు నిర్మించుట అసాధ్యమయ్యేడిది.

ఈ జాబును చీనాతో ప్రారంభించితిని. చీనాగాథ చెప్పదలచితిని కాని ఇతరవిషయములలోనికి లాగుకొనిపోతిని. నావిషయమున నిది సాధారణముగా జరుగుచుండునుగదా. పైమారు, బహుశా, చీనాను అంటియుండి కథ సాగింతము.

## 41

# టాంగుల పరిపాలనమున చీనాపర్ధిల్లుట

మే 7, 1932

చీనాలో హాన్‌రాజవంశమును గూర్చియు, బౌద్ధమత ప్రవేశమును గూర్చియు చెప్పియుంటిని. అక్షర ముద్రణమును కనిపెట్టి రనియు, ప్రభుత్వోద్యోగస్థులను నియమించుటకు పరీక్షలు జరిపెడివా రనియుకూడ చెప్పియుంటిని. క్రీ. వె. మూడవ శతాబ్దిలో హాన్‌రాజవంశ మంత రింపగా సామ్రాజ్యము మూడు రాజ్యములుగా చీలిపోయెను. "మూడు రాజ్యములు" అని చెప్పబడు విభాగములు అనేకవందల సంవత్సరములు

పరిపాలనము చేసెను. చివరకు టాంగ్‌రాజవంశ మను ఒక క్రొత్త రాజ వంశముక్రింద నివి ఏకమై ప్రబలమగు ఏకరాజ్యముగా విలిచెను. ఇది ఏడవ శతాబ్దిలో జరిగెను.

సామ్రాజ్యము చీలిపోయిన ఈ కాలములో సైతము, ఉత్తరము నుండి తార్తారులు దండయాత్రలు సాగించుచున్నను చీనాసంస్కృతియు, కళలును యథాప్రకారము వికసించుచునేయుండెను. పెద్ద పుస్తకభాండా గారములును, చక్కని చిత్తరువులును ఆకాలమున నున్నట్లు చెప్పుదురు. తన సన్నని నూలుబట్టలను, ఇతరవస్తువులనేగాక, తన తత్వవిచారణ మును, మతమును, శిల్పమునుకూడ ఇండియా చీనాకు ఎగుమతిచేయు చుండెను. అనేక బౌద్ధసన్యాసులు ఇండియానుండి మతప్రచారకులుగా చీనాకు వెళ్ళిరి. హిందూశిల్పసంప్రదాయమును వా రచ్చటికి గొంపో యిరి. హిందూశిల్పులును, కళాప్రవీణులునుకూడ చీనాకు పోయి యుందురు. బౌద్ధమతముతోపాటు నూతనాభిప్రాయములు ఇండియా నుండి వెళ్లి చీనాలో ప్రవేశించుటవల్ల మంచి ఫలితములు కలిగెను. చీనా అప్పటికిని ఇప్పటికినికూడ గొప్ప నాగరికతనందిన దేశమే. ఇండి యాలోని మతము, అభిప్రాయములు, కళలు వెనుకబడిన దేశమునకు పోయి అక్కడ పాదుకొన్నట్లు తలచరాదు. చీనాలోని ప్రాచీనకళలకు, ప్రాచీనాభిప్రాయములకును, ఇండియానుండి వచ్చిన కళలు, అభిప్రాయ ములకును సంయోగము కలిగినది. ఇందుండి వచ్చిన ఫలితము రెంటి కిని భిన్నమైనది. ఇండియానుండి గ్రహించిన విషయములు విశేష ముగా నున్నప్పటికిని అవి సంయోగముజెంది చీనాసంప్రదాయములకు భిన్నముకాని స్వరూపముతోనే వెలువడెను. ఇండియానుండి ప్రవ హించిన ఈ యభిప్రాయములు చీనా కళలకును, అభిప్రాయములకును పురోమార్గము చూపెను.

ఈ విధముగానే బౌద్ధమతసందేశమును, హిందూశిల్పసందేశమును కొరియా, జపానుదేశములకుకూడ మరీతూర్పుగా ప్రాకెను. ఈ దేశము

లలో, తత్కారణమున ఎట్టి మార్పులు వచ్చినవో తెలిసికొనుటకు ముచ్చటగా నుండును. తన సహజప్రకృతి కనుగుణముగా నుండునట్లు ఆయా దేశములు ఆ సందేశము నవలంబించిరి. కావుననే బౌద్ధమతము చీనా జపానుదేశములలో వర్ధిల్లుచున్నప్పటికిని అది ఆయాదేశములలో భిన్న స్వరూపములతో నున్నది. ఈ రెండుదేశములందలి బౌద్ధమతములును ఇండియానుండి వెళ్ళిన బౌద్ధముతో అనేకవిధములుగా భేదించుచున్నవి. దేశములనుబట్టియు, జనులనుబట్టియుకూడ శిల్పము, కళ మారుచుండును. ఇండియాలో నున్న జనులము మనము కళాసౌందర్యములను విస్మరించితిమి. చాలకాలమువరకు మనము సౌందర్యోపేతమగు నెట్టివస్తువును కల్పించలేదు సరిగదా సౌందర్యమును మెచ్చుకొనుట ఎట్లో కూడ మరచితిమి. స్వేచ్ఛలేని దేశమున సౌందర్యకళ లెట్లు వర్ధిల్లును? ఒక ప్రభుత్వమునకు లోబడియుండుట, ఏపనిని స్వేచ్ఛగా చేయుటకు వీలులేని నిర్బంధములో నుండుట అను అంధకారములలో అవి శుష్కించిపోవును. స్వాతంత్ర్యజ్యోతి మనకు ముందు కనిపించుచుండుటచేత ఇప్పుడిప్పుడే మన సౌందర్యగ్రహణశక్తి ప్రబుద్ధమగుచున్నది. స్వాతంత్ర్యము వచ్చిన పిమ్మట కళాసౌందర్యములు మన దేశములలో మరల తలయెత్తగలవు. ఇట్లు తలయెత్తినపిమ్మట మన యిండ్లలో, నగరములలో, జీవితములలో దాగియుండిన అందవికార మంతయు తుడుచుకొనిపోవు నని తలతును. ఇండియాకన్న చీనాజపానుదేశములు అదృష్టవంతములు. కళాసౌందర్యముల నుపాసించు శక్తి వారిలో సన్నగిల్లలేదు.

చీనాలో బౌద్ధమతము వ్యాపించుటతోడనే హిందూదేశబౌద్ధులును, సన్యాసులును అచ్చటికి అధికముగా పోదొడగిరి. చీనాదేశసన్యాసులు ఇండియాకును, ఇతర దేశములకును యాత్రలుచేయుచుండిరి. ఫాహియానును గురించి నీకు చెప్పియుంటిని. యువాన్‌చాంగునుకూర్చికూడ నీకు తెలియును. వీ రుభయులును ఇండియాకు వచ్చిరి. తూర్పుసముద్రములను దాటి ప్రయాణముచేసిన హ్యూషెంగ్ అను చీనాదేశసన్యాసి యాత్రా

వృత్తాంతము మనోహరముగా నుండును. అతడు క్రీ. వె. 499 సంవత్సర మున చీనారాజధానికి తిరిగివచ్చి తాను చీనాకు తూర్పున వేలకొలదిమైళ్ళ దూరముననున్న ఫ్యూశాంగ్ అను దేశమును చూచినట్లు చెప్పెను. చీనా జపానులకు తూర్పున శాంతమహాసముద్రమున్నది. హ్యూషెంగ్ ఈసము ద్రమును దాటియుండవచ్చును. బహుశా అతడు మెక్సికోను దర్శించి యుండవచ్చును. ఎందుకనగా, ఆకాలముననే మెక్సికోలో ప్రాచీననాగరికత విలసిల్లుచుండెను.

చీనాలో బౌద్ధమతము వ్యాపించుట చూచి, ఇండియాలోని బౌద్ధ మతప్రధానగురువు దక్షిణఇండియానుండి చీనాలోని కాంటన్‌పట్టణము నకు సముద్రమార్గమున వెళ్ళెను. ఇతని పేరో, బిరుదమో బోధిధర్ముడు. ఇండియాలో బౌద్ధము క్రమక్రమముగా దుర్బలమగుచుండుటచే అతడు చీనాకు పోయియుండును. క్రీ. వె. 526 సంవత్సరమున నతడు వెళ్ళెను. అప్పటి కతడు వయస్సుమళ్ళిన వృద్ధుడు. అతనితోడను, అతని తరు వాతనుకూడ పలువురు సన్యాసులు చీనాకువెళ్ళిరి. ఈ కాలమున లోయాంగ్ అను నొక చీనారాష్ట్రములో చూచిన, 3000కు మించిన హిందూబౌద్ధ సన్యాసులును, 10,000 హిందూకుటుంబములును ఉండెనని చెప్పుదురు.

మరికొద్దికాలమునకు బౌద్ధమత మిండియాలో పునరుద్ధరింప బడినది. బుద్ధుని జన్మదేశ మనియు, బౌద్ధధర్మగ్రంథము లిండియాలో నుండెనన్న కారణమునను భక్తులగు బౌద్ధులను ఇండియా ఆకర్షించు చునే యుండెను. కాని ఇండియాలోని బౌద్ధమున కుచ్ఛస్థితి పోయినట్లే తోచుచున్నది. ఇప్పుడు చీనాదేశము ప్రసిద్ధ బౌద్ధదేశ మైనది.

క్రీ. వె. 618 సంవత్సరమున కాచూ అను చక్రవర్తి ప్రథముడుగా టాంగ్‌రాజవంశము చీనాలో పరిపాలనచేయుటకు ప్రారంభించెను. అతడు చీనాదేశమంతయు ఏకమగునట్లు చేసెను. అంతే కాదు, దక్షిణమున అన్నాం, కంబోడియాలు మొదలుకొని పడమట పర్షియా, కాస్పియన్ సముద్రము పర్యంతము అతని అధికారము విస్తరించెను. ఈ ప్రబలమగు

సామ్రాజ్యములో కొరియాలో కొంతభాగముకూడ కలిసియుండెను. ఈ సామ్రాజ్యమునకు రాజధాని సి-అన్-ఫూ అను నగరము. ఇది తూర్పు ఆసియాలో వైభవమునకును, సంస్కృతికిని ఎంతో ప్రసిద్ధి కెక్కిన నగరము. జపానునుండియు, స్వతంత్రముగానున్న దక్షిణకొరియానుండియు రాయబారులు ఈ నగరమునకు వచ్చుచుండిరి. ఈ నగరమందలి కళలు, తత్వశాస్త్రము, నాగరీకములను గురించి తెలిసికొనుటకు పండిత సంఘములుకూడ వచ్చుచుండెను.

టాంగ్‌చక్రవర్తులు పరదేశములతో వర్తకమును ప్రోత్సహించిరి. పరదేశులు తమ దేశమునకు వచ్చి దర్శించుటకు అనుకూలములను కల్పించి వారిని ప్రోత్సహించిరి. చీనాలో నివాస మేర్పరచుకొన్నట్టియు, చీనాను దర్శింపవచ్చినట్టియు పరదేశులకొరకు ప్రత్యేకశాసనములు చేయబడినవి. సాధ్యమైనంతవరకు వారివారి యాచారముల ననుసరించి వారి గుణదోషములను నిర్ణయించుట కీశాసనములు పనికివచ్చెను. క్రీ. వె. 300 ప్రాంతమున దక్షిణచీనాలో కాంటన్‌వద్ద ముఖ్యముగా అరబ్బులు నివాసము లేర్పాటుచేసికొనిరి. ఇది ఇస్లాంరాకకు ముందు జరిగెను—అనగా మహమ్మదుప్రవక్తజననమునకు ముందన్నమాట. ఈ అరబ్బుల సహాయముతో సముద్రముల కావలి దేశములతో వర్తకవ్యాపారములు అరబ్బుల ఓడలతోను, చీనావారి ఓడలతోను జరుగుచుండెను.

జనాభా తీసికొనుపద్ధతి చీనాలో ప్రాచీనకాలమునుండి ఒక సంస్థగా నుండెనన్న విషయమును విన్నచో ఆశ్చర్యము కలుగును. క్రీ. వె. 156 సంవత్సరమున చీనాలో ఒక జనాభా తీసికొనబడినదట. ఇది హాన్‌ల కాలములోనైయుండవచ్చును. ఈ జనాభాలో కుటుంబములను లెక్కించువారు; మనుష్యులను కాదు. ప్రతికుటుంబమందును సుమారు 5గు రున్నట్లు ఊహించుచుండిరి. ఈ జనాభాలెక్కప్రకారము క్రీ. వె. 156 సంవత్సరములో చీనాలో 50,000,000 జనసంఖ్య యుండెను. ఇది దోషరహితమగు పద్ధతి కాదు కాని పాశ్చాత్యదేశములలో జనాభా తీసికొనుపద్ధతి

ఈమధ్యనే వచ్చినదన్నమాట మరువకుము. అమెరికాసంయుక్తరాష్ట్రము లలో తొట్టతొలి జనాభా 150 సంవత్సరములక్రితము తీసికోబడినది.

టాంగుల పరిపాలనము మొదటిరోజులలో చీనాలో మరిరెండు మత ములు పొడచూపినవి. అవి క్రైస్తవము, ఇస్లాము. మతవిషయమున భేదాభి ప్రాయములు ప్రకటించినందువలన పాశ్చాత్యదేశములనుండి తరుమగొట్ట బడిన ఒక క్రైస్తవమతశాఖవారు క్రైస్తవమును చీనాలో ప్రవేశపెట్టిరి. వారి పేరు నెస్టోరియనులు. క్రైస్తవమతశాఖలలోని వివాదములను, వారి యుద్ధము లను గురించి ఇదివరలో వ్రాసియుంటిని. ఈ వివాదల ఫలితముగానే నెస్టోరియనులు రోమునుండి తరుమగొట్టబడిరి. కాని వారు చీనాలోను, పర్షియాలోను, ఆసియాపలుప్రాంతములందును వ్యాపించిరి. వారు ఇండి యాకుకూడ వచ్చి కొంతవరకు కృతకృత్యులైరి. కాని కొంతకాలమైన పిమ్మట వచ్చిన క్రైస్తవమతముయొక్క యితరశాఖలును, ఇస్లామును నెస్టోరియను లంతరించుటకు కారణమైనవి. నేడు వారి జాడయే లేదు. నిరుడు మనము దర్శించిన దక్షిణఇండియాలోని ఒక ప్రదేశమున నెస్టోరి యనుల చిన్నవలసను చూచి నేనెంతో ఆశ్చర్యమును జెందితిని. నీకు జ్ఞాపకమున్నదా? వారి మతగురువు మనకు టీ యిచ్చెనుకదూ. అతడు వృద్ధుడు. మంచివాడు.

చీనాలో ప్రవేశించుటకు క్రైస్తవమతమునకు కొంతకాలముపట్టెను. కాని ఇస్లాంమతము త్వరితముగా వచ్చెను. నెస్టోరియనులకు కొద్ది సంవ త్సరములుముందు, ప్రవక్త జీవించియున్నకాలముననందే అది వచ్చెను. చీనాచక్రవర్తి ఉభయమత రాయబారులను—ఇస్లాం, నెస్టోరియనులు— మర్యాదతో ఆదరించెను. వారు చెప్పిన దంతయు వినెను. వారి యభి ప్రాయములు గ్రహించెను. ఇద్దరిని పక్షపాతములేకుండ గౌరవించెను. కాంటన్‌లో మసీదు కట్టుకొనుటకు అరబ్బులకు అనుమతి నిచ్చెను. 1300 సంవత్సరములవెనుక కట్టినదైనను ఈ మసీదు నేటికిని నిలిచి యున్నది. ప్రపంచమందలి మిక్కిలి ప్రాచీనమగు మసీదులలో నిది యొకటి.

ఇట్లే టాంగ్‌చక్రవర్తి క్రైస్తవాలయమును, సన్యాసి మఠమును కట్టుకొనుట కంగీకారము చూపెను. ఇట్టి సహనబుద్ధికిని, ఆకాలమున యూరోపునందు చెలరేగు అసహనమునకును ఎంత భేద మున్నదో!

అరబ్బులు కాగితములు తయారుచేయుపద్ధతి చీనావారినుండి నేర్చుకొని తరువాత యూరోపుకు నేర్పిరి. క్రీ. వె. 751 సంవత్సరమున మధ్య ఆసియాలోని టుర్కి-స్థాన్‌వద్ద చీనావారికిని, మస్లింఅరబ్బులకును యుద్ధము జరిగెను. చీనావారి ననేకులను అరబ్బులు చెరపట్టిరి. బంధితులు వారికి కాగితములుచేయు పద్ధతి నేర్పిరి.

టాంగ్‌చక్రవర్తులు క్రీ.వె. 907 వరకు-అనగా 300 సంవత్సరములు రాజ్యమేలిరి. ఈ కాలమున చీనా మహోన్నతదశయం దుండెనని చెప్పుదురు. అప్పుడు ఉన్నతమగు సంస్కృతి యా దేశమున నుండెను. ప్రజలు సుఖవంతులై యుండిరి. తరువాత ఎంతకాలమునకో పాశ్చాత్యులు నేర్చుకొన్న విషయము లనేకము చీనాదేశస్థుల కప్పటికే తెలియును. కాగితము సంగతి చెప్పియుంటిని. తుపాకిమందు మరియొకటి. చీనావారు మంచి వాస్తుశాస్త్రజ్ఞులు. సాధారణముగా సమస్త విషయములందును వారు యూరోపును మించియుండిరి. వారంత మించియుండినయెడల, ఆ యభివృద్ధినినిలుపుకొని యూరోపుకు ముందే యుండి శాస్త్రపరిజ్ఞానమునందును, పరిశోధనలం దును వారేల మార్గదర్శకులు కాలేదు? కాని యూరోపు మెల్ల మెల్లగా వారి సమీపమునకు ప్రాకివచ్చి, పడుచువాడు ముసలివానిని కలిసికొని దాటిపోవునట్లుగా, పిదప కొన్ని విషయములలో వారిని మించి పోయిరి. జాతుల చరిత్రలో నిట్టి సంఘటనలు ఏల సంభవించునో తెలిసికొనుట చాల కష్టము. తత్వశాస్త్రజ్ఞు లీవిషయము నాలోచింపదగుదురు, నీవు తత్త్వశాస్త్రజ్ఞురాలవు కావు కాబట్టి ఈ గొడవ పెట్టుకోవు. నేను మాత్రము గొడవపెట్టుకొననేల?

ఈకాలమందలి చీనాగొప్పదనము ఆసియా మిగతభాగములందు కూడ పనిచేసెను. కళ, నాగరికతల విషయమున చీనా ఆ దేశములకు

మార్గదర్శక మయ్యెను. గుప్తసామ్రాజ్య మంతరించిన పిమ్మట ఇండియా నక్షత్రమంత ప్రకాశమానముగా వెలుగుట లేదు. యథాప్రకారము చీనా నాగరికతయు, అభివృద్ధియు ప్రజలలో భోగజీవితమునకు దారితీసెను. రాజ్యవ్యవహారములలో దుర్నీతి, లంచగొండితనము ప్రవేశించెను. ఇందువల్ల పన్ను లమితముగా వృద్ధియయ్యెను. టాంగులన్న ప్రజలకు మొగముమొత్తినది. వారు దాని నంతరింపజేసిరి.

## 42

# ఛోజన్: డాయ్ నిప్పన్

మే 8, 1932.

ప్రపంచగాథను విపరించుకొనుచు పోవునప్పుడు నూతనదేశములు మన దృష్టిలోనికి వచ్చుచుండును. చీనాకు పొరుగున నున్నట్టియు, చీనానాగరికత నవలంబించినట్టియు కొరియాజపానుల నిప్పుడు విచారింతము. ఆసియాకు ఒక చివర ఆ దేశము లున్నవి. వీటినే దూరప్రాచ్య మందురు. వాటి తరువాత నున్నది శాంతమహాసముద్రమే. మొన్నమొన్నటివరకు ఈ దేశములకు అమెరికాతో ఎట్టిసంపర్కమును లేదు. వారికి ముఖ్యముగా సంపర్కమున్న గొప్పజాతి చీనాలోనున్న జాతియే. చీనానుండియు, చీనాద్వారాను వారికి మతము వచ్చినది; శిల్పము వచ్చినది; నాగరికత వచ్చినది. కొరియాజపానులు చీనాకు అమితముగా ఋణపడియున్నారు. ఇండియాకుకూడ వారు కొంత ఋణపడియున్నారు. వారికి ఇండియానుండి వచ్చిన దంతయు చీనానుండియే, చీనాసంప్రదాయములచే సంస్కరింపబడి వచ్చెను.

కొరియాజపానుల ఉనికినిబట్టి ఆ దేశవాసులకు ఆసియాలోగాని, ఇతరత్రాగాని జరుగు మహత్కార్యములతో ఎట్టి సంబంధమును లేకుండెను. కార్యరంగమునకు వారు దూరముగానుండిరి. ఒకవిధ

ముగా చూచిన వారు-ముఖ్యముగా జపాను-అదృష్టవంతు లనియే చెప్ప వలెను. కాబట్టి, వారి చరిత్రను ఈకాలమువరకు సునాయాసముగా నుపేక్షించవచ్చును. ఆసియాలో జరిగిన సంఘటనల నర్థముచేసికొనుటకు వారి చరిత్ర తోడ్పడదు. కాని వారి చరిత్రలు మన ముపేక్షించ నవసరములేదు. మలయా ద్వీపములయొక్కయు, తూర్పుదీవుల యొక్కయు చరిత్రలను మన ముపేక్షించుటలేదుకదా. పాపము ! అల్ప దేశమగు కొరియా పేరే రోజులనే మరిచినారు. జపాను దానిని కబళించి తన సామ్రాజ్యములో కలుపుకొన్నది. కాని స్వాతంత్ర్యయుద్ధము ప్రకటించి స్వాతంత్ర్యము పొందవలె ననియే ఇంకను కొరియా కలలు గనుచున్నది. ఈ రోజులలో జపానుపేరు తరుచు వినిపించుచున్నది. చీనా దేశముపై నది దండెత్తుటనుగూర్చి వార్తాపత్రికలు అధికముగా వ్రాయుచున్నవి. ఈ దినమున మంచూరియాలో ఏదో యుద్ధము జరుగుచున్నది. కాబట్టి కొరియాజపానుల ప్రాచీనచరిత్ర తెలిసికొనుట మంచిది. దీనినిబట్టి ఆ దేశముల ప్రస్తుతస్థితి అర్థముచేసికో వీలుకలుగును.

దీర్ఘకాలములపాటు ఆ దేశములు ఏదేశములకు అంటకుండ, ముట్టకుండ ఉండెడివని మొట్టమొదట మనము జ్ఞాపకముంచుకోవలెను.

జపాను ఎంతోకాలము ఏకాంతముగనే యుండెను. ఆ దేశముపై ఎవరును దాడివెడలియుండలేదు. జపాను చరిత్రలో, ఆ దేశముపై దండెత్తుటకు చేసిన ప్రయత్నములు బహుకొద్ది. కాని ఎవరును విజయము పొందలేదు. మొన్నటివరకును దానికి తటస్థించిన కష్టములన్నియు గృహసంబంధమైనవే. కొంతకాలముపాటు జపాను ప్రపంచముతో నెట్టిసంబంధమును లేకుండ కేటాయింపుగా నుండిపోయెను. జపానీయు డెవడును స్వదేశమును దాటి బయటికిపో వీలులేదు. అన్యదేశస్థు లెవరును, చీనావారుసైతము, జపానులో కాలుపెట్ట వీలులేదు. యూరోపునుండి వచ్చు పరదేశుల బారినుండియు, క్రైస్తవప్రచారకుల నుండియు తప్పించుకొనుటకై ఇట్లు చేయబడినది. అది చాల తెలివి

తక్కువపని. ప్రమాదకరమైన పని. అట్లు చేయుటవల్ల జాతినంతను చెరపెట్టినట్లగును. మంచిదో చెడ్డదో ఎట్టి బాహ్యాసంపర్కమును లేకుండ చేసినట్లగును. పిమ్మట జపాను హఠాత్తుగా ద్వారములను, కిటికీలను తెరిచివేసెను. యూరోపు నేర్పగలిగిన దంతయు నేర్చుకొనుటకు పరుగెత్తెను. ఎంత ఉత్సాహముతో నేర్చుకొన్న దనగా, ఒకటిరెండుతరములలో అది బాహ్యముగా యూరోపియన్‌దేశమువలె తయారైనది. యూరోపియనుల దురాచారముల నన్నిటినికూడ అది యవలంబించెను. ఇదంతయు గత 70 సంవత్సరములలో కాబోలు జరిగెను.

చీనాచరిత్రతరువాత కొరియాచరిత్ర ప్రారంభమగును. కొరియా చరిత్ర కెంతకాలము తరువాతనో జపానుచరిత్ర ప్రారంభమగును. కీచే అను చీనాప్రవాసి యొకడు చీనాలో రాజవంశము మారుట కిష్టపడక, 5000 అనుచరులతో తూర్పుముఖముగా వెళ్ళెనని ఇదివరలో చెప్పియుంటిని. అతడు కొరియాలో నిలిచిపోయెను. కొరియాకు ఛోజన్ అను పేరు పెట్టెను. ఛోజన్ అనగా ఉదయప్రశాంతభూమి అని అర్థము. ఇది క్రీ. పూ. 1122 లో జరిగినది. తనతోకూడ కీచే కళలను, చేతిపనులను, వ్యవసాయమును, పట్టుపనినికూడ తీసుకుపోయెను. 900 సంవత్సరములు పైగా కీచేయొక్క సంతతివారు ఛోజన్‌దేశము నేలిరి. చీనానుండి జనులు అప్పుడప్పుడు వలసవచ్చి ఛోజన్‌లో నివాసము లేర్పాటుచేసికొనువారు. ఈ విధముగా చీనాతో ఛోజన్‌కు సంబంధము ముందుచువచ్చెను.

షి హుయాంగ్ టీ అనువాడు చీనాకు చక్రవర్తిగా నున్నప్పుడు చీనాదేశీయుల తండమొకటి కొరియాకు వచ్చెను. ఇతని పేరు నీకు జ్ఞాపకమున్నదేమో? ఇతడు అశోకుని సమకాలికుడు. ఇతడే "ప్రథమ చక్రవర్తి"నని చెప్పుకొనెను. ప్రాచీనగ్రంథముల నన్నింటిని తగుల బెట్టించెను. షిహుయాంగ్‌టీయొక్క క్రూరపరిపాలనమును సహించలేక పలువురు చైనీయులు కొరియాలో తలదాచుకొనిరి. కీచేయొక్క సంతతి

వారు దుర్బలులగుటచే వారిని తరిమివేసిరి. ఇది జరిగినపిమ్మట ఛోజన్ 800 సంవత్సరముల పైగా అనేకరాజ్యములుగా విభజింపబడియుండెను. ఈ రాజ్యములు తరుచు ఒకదానితో నొకటి పోరాడుచుండెను. ఒకమారు ఇందలి ఒకరాజ్యము చీనాను సహాయముచేయుమని కోరెను. అది ఎంత ప్రమాదకరమైన కోరికయో! చీనావారు వచ్చిరి, సహాయముచేసిరి, తిరిగిపో నిరాకరించిరి. ప్రబలదేశముల వైఖరి ఇట్లే యుండునుగదా. చీనా అందే నిలిచిపోయి ఛోజన్‌దేశభాగమును తన సామ్రాజ్యములో కలుపు కొనెను. ఛోజన్ మిగతభాగముసైతము కొన్నివందల సంవత్సరముల కాలము చీనా నేలు టాంగ్‌చక్రవర్తుల ప్రభుత్వము నంగీకరించెను.

క్రీ. వె. 935 సంవత్సరమున ఛోజన్ సంయుక్తస్వతంత్రరాజ్య మయ్యెను. ఇందుకు కారకుడు వాంగ్‌కీన్ అనువాడు. ఇతని సంతతి వారు 450 సంవత్సరముల కాలము ఈ రాజ్యము నేలగలిగిరి.

2000 సంవత్సరముల కొరియాచరిత్ర నేను రెండుమూడుపేరా లలో చెప్పితిని. జ్ఞాపకముంచుకోదగిన యంశ మొకటే—అది చీనాకు కొరియా ఎక్కువగా ఋణపడుట. వ్రాతకళ కొరియాకు చీనానుండి వచ్చి నది. వేయిసంవత్సరములవరకు వారు చీనాఅక్షరములనే వాడుచుండిరి. నిజమునకు చీనావా రుపయోగించు అక్షరములు అక్షరములు కావు. అవి భావములను, మాటలను, సమాసములను తెలియజేయు చిహ్నములు. పిమ్మట వారు తమ భాష కుచితమగు వర్ణమాలను ప్రత్యేకముగా సృష్టించుకొనిరి.

బౌద్ధమతము చీనాద్వారా వచ్చెను. కన్‌ఫ్యూసియస్‌తత్వముకూడ చీనాద్వారానే వచ్చెను. ఇండియానుండి కళాభావములు చీనాద్వారా కొరియాకును, జపానునకును వచ్చెను. కొరియాలో చక్కని కళా చాతుర్యము వెల్లడించు వస్తువులు తయారయ్యెను. ముఖ్యముగా ప్రతి మలుపమలచుటయందు కొరియా ప్రసిద్ధికెక్కెను. వారి గృహనిర్మాణ వైఖరి చీనావైఖరిని పోలియుండెను. నౌకానిర్మాణమునందును మంచి

యభివృద్ధి జరిగినది. ఒకకాలమున కొరియాప్రజలకు శక్తివంతమగు నౌకాబల ముండెను. దాని సహాయమున వారు జపానుపై దండెత్తిరికూడ.

బహుశా నేటి జపానీయుల పూర్వికులు కొరియా (ఛోజన్)నుండి వచ్చినవారై యుండవచ్చును. అందు కొందరు దక్షిణమున మలేసియా (మలయాద్వీపసమూహము) నుండి వచ్చియుందురు. జపానీయులు మంగోలుజాతివారని నీకు తెలియును. జపానులో నేడు ఐనస్ అను పేరు గల ప్రజలు కొందరున్నారు. వా రాదేశమున ఆదిమనివాసులని చెప్పుదురు. వీరు అందముగా నుందురు. తలవెంట్రుక లధికముగా నుండును. వీరు సామాన్యజపానీయునకు భిన్నముగా కానవత్తురు. ఐనస్ ప్రజలు జపానుద్వీపముల ఉత్తరభాగమునకు తరుముగొట్టబడిరి.

సుమారు క్రీ. వె. 200 సంవత్సర ప్రాంతమున యామటోరాజ్యమును జింగో అను చక్రవర్తిని పాలించెను. జపాను పూర్వనామము యామటో. లేదా అది వలసవచ్చినవారు నిలిచిపోయిన ప్రదేశమైనను కావచ్చును. ఈమె పేరు 'జింగో' అని గుర్తించితివా? జపానునేలిన తొలిచక్రవర్తులలో జింగో అను పేరుండుట ఆశ్చర్యమే. ఇంగ్లీషు భాషలో జింగో అను పదమునకు స్పష్టార్థ మున్నది. డాంబికుడగు సామ్రాజ్యవాది యని దాని యర్థము. సామ్రాజ్యవాదులు సామాన్యముగా డాంబికులే అయియుందురుగనుక సామ్రాజ్యవాది యన్నను సరిపోవును. జపానులోకూడ సామ్రాజ్యవాదరోగము — జింగోతత్వము — ఉన్నది. ఈమధ్య నది కొరియాచీనాలయెడల దుర్ణయము చూపినది. జపానులోని మొట్టమొదటి చారిత్రక చక్రవర్తిని పేరు జింగో అయియుండుట ఆశ్చర్యకరమే.

యామటో కొరియాతో దగ్గరిసంబంధములను ఉంచుకొనుచుండెను. కొరియా ద్వారానే చీనానాగరికత యామటో చేరెను. క్రీ. వె. 400 సంవత్సరమున కొరియాద్వారానేచీనావారి లిఖితభాష జపాను చేరెను. ఆవిధముగానే బౌద్ధమతముకూడ వచ్చెను. క్రీ. వె. 552 సంవత్సరమున పక్చే

పాలకుడు (కొరియా మూడురాజ్యములలో ఇది యొక రాజ్యము) యామటోపాలకునకు బుద్ధుని స్వర్ణవిగ్రహమును, బౌద్ధమత ప్రచారకులను, బౌద్ధమత గ్రంథములను పంపెను.

జపానీయుల ప్రాచీనమతముపేరు షింటో. ఇది చీనాదేశపుమాట. దీని యర్థము "దేవతల మార్గము" అని. ఈమతము ప్రకృతిపూజ, పితృపూజల సమ్మేళనము. జన్మాంతరాదులనుగూర్చి ఈ మత మట్టేచెప్పదు. యోధజాతిమత మిది. చీనావారి కంత సమీపములో నుండియు, వారి నాగరికతద్వారా తాము బాగుపడి వారికి ఋణపడియుకూడ జపానువారు చీనావారికి పూర్తిగా భిన్నులే. చీనావారు నాటికిని నేటికినికూడ శాంతస్వభావులు. వారి నాగరికత యంతయు, వారి జీవితధర్మము లన్నియు శాంతియుతములే. మరి జపానీయు లన్ననో నాటికిని నేటికినికూడ యోధులే. సైనికుని ప్రధానధర్మము తన నాయకుని పట్లను, సాటిసైనికులపట్లను విశ్వాసము కలిగియుండుట. జపానీయు లిట్టి ధర్మము నక్షరాలా పాలింతురు. వారి ప్రాబల్యమునకు కారణముకూడ ఇదే. షింటో ఉపదేశించిన ధర్మ మిది—"దేవతలను పూజింపుడు, వారి సంతతిపై విశ్వాసము చూపుడు." కావున షింటో నేటివరకు జపానులో నిలిచియున్నది. బౌద్ధమతముతోపాటు అదియు ప్రజాహృదయముల నేలుచున్నది.

కాని ఇది సుగుణమా? సాటిసైనికునిపైని, తనపక్షముపైని విశ్వాసము చూపుట సుగుణమే. కాని షింటోమతమును, ఇతరమతములును ఈ విశ్వాసమును పురస్కరించుకొని మన పాలకుల లాభనిమిత్తము సామాన్యప్రజలను బాధపెట్టుచున్నవి. అధికారులను పూజింపవలెనని జపానులోను, రోములోను, ఇతరత్రా బోధించిరి. దీనివల్ల ఎట్టి ముప్పులు వచ్చినవో ముందుముందు చూతము.

బౌద్ధమతము నూతనముగా ప్రవేశించినప్పుడు దానికిని, ప్రాచీన షింటో మతమునకును కొంత సంఘర్షణ జరిగినది కాని కొంతకాలమునకిది సర్దుకొన్నది. నేటివరకు అవి రెండును జపానులో అన్యోన్యముగా

వర్ధిల్లుచున్నవి. ఈ రెండు మతములలోను షింటో ఎక్కువగా జన సమ్మతిని బడసినది. దీనిని ప్రోత్సహించువారు పాలకజాతివారు. ఎందు వల్ల ననగా—ఇది వారిపట్ల విధేయతా విశ్వాసములను ప్రజలు చూపవలె నని బోధించునుగాన. బౌద్ధమతము కొంచెము ప్రమాదకరమైన మతము. దాని స్థాపకుడే విప్లవకారు డగుట ఇందుకు కారణము.

జపానులో లలితకళాచరిత్ర బౌద్ధమతముతో ప్రారంభమైనది. చీనాతో ప్రత్యక్షముగా సంబంధము నేర్పాటుచేసికొనుటకు జపాను అప్పుడు ప్రారంభించెను. టాంగులకాలమున నూతనరాజధాని సి-అన్-ఫ్యూ తూర్పు ఆసియా అంతటిలోను ప్రసిద్ధివహించినప్పుడు చీనాకు తరుచు రాయ బారులు వెళ్ళుచుండెడివారు. జపానీయులు—యామటో ప్రజలు—నారా అను పేరు గల క్రొత్తరాజధానిని ప్రతిష్ఠించిరి. దానిని సి-అన్-ఫ్యూ వలెనే అచ్చముగా నుండునట్లు కట్టుటకు ప్రయత్నించిరి. ఇతరులుచేసిన పనిని చేయుట, ఇతరులను అనుకరించుట యందు జపానీయులు బహు సమర్థులు.

గొప్పకుటుంబములు ఒకదానితో నొకటి ప్రతిఘటించుచు అధి కారమునకు ప్రాకులాడుచుండుట జపానుచరిత్ర అంతటిలోను మనకు కనిపించును. ప్రాతరోజులలో ఇతర దేశములందును ఇట్లు జరుగు చుండెను. ఈకుటుంబములలో ప్రాతకాలపు మనుష్యతెగలభావన నిలిచి యుండెను. కాన జపానుచరిత్ర కక్షలువహించిన కుటుంబముల చరిత్రయే యగుచున్నది. వారి చక్రవర్తి, మికాడో, సర్వశక్తివంతుడని వారి నమ్మ కము. అతడు నిరంకుశుడు, దేవాంశసంభూతుడు, సూర్యసంతతిలోని వాడు. చక్రవర్తి నిరంకుశత్వమును ప్రజ లంగీకరించునట్లును, దేశ మందలి ప్రబలులకు విధేయత చూపునట్లును చేసినవి షింటోమతమును, పితృపూజయును. కాని చక్రవర్తిమాత్రము తరుచు జపానులో నిజమగు అధికారములేని వట్టి కీలుబొమ్మవతుగానే ఉండెను. అధికారము, బలము ఒక గొప్ప కుటుంబము, లేదా వంశము చేతిలో నుండెను. వారే వారి

కిష్టమువచ్చిన రాజులను, చక్రవర్తులను గద్దెపై కూర్చుండబెట్టుచుండిరి.

చరిత్రలో ప్రథమమున కానవచ్చు జపాను ఉన్నతకుటుంబము సోగాకుటుంబము. వారి చేతులలోనే ప్రభుత్వము సాగుచుండెను. వారు బౌద్ధమతము నవలంబించుటవల్లనే అది రాజమతము, ప్రభుత్వ మంగీకరించిన మతము అయినది. వారి నాయకులలో నొకడు, షోటుకు-తైషి అనువాడు జపాను చరిత్రలో అత్యుత్తమ పురుషులలో నొకడు, అతడు బౌద్ధమతముపై నిర్వ్యాజభక్తి కలవాడు. సమర్థుడగు కళాప్రవీణుడు. కన్ఫ్యూసియన్ ప్రధానగ్రంథములను చదివి అందలి యభిప్రాయముల నతడు గ్రహించెను. ప్రభుత్వమును పశుశక్తిపైగాక నైతికమగు పునాదులపై నిలిపెను. ఆ కాలమున జపానుదేశమునిండ వివిధవంశములవారు అనేకు లుండిరి. వారి నాయకులు సర్వస్వతంత్రులు. వా రొకరితో నొకరు నిరంతరము పోరాడుకొనుచుండిరి. ఎవరి యధికారమును వారు శిరసావహింపరు. చక్రవర్తి యను పెద్దపేరు పెట్టుకొన్నప్పటికిని అత డొక పెద్ద వంశమునకు నాయకుడు మాత్రమే. షోటుకు - తైషి ఈ పరిస్థితులను మార్చుటకు పూనుకొనెను. కేంద్రప్రభుత్వమును శక్తివంతముగా జేయ బూనుకొనెను. వివిధవంశనాయకుల నాతడు చక్రవర్తికి లొంగియుండు సామంతులనుగా జేసెను. ఇది క్రీ. వె. 600 సంవత్సరమున జరిగెను.

కాని షోటుకు - తైషి మరణానంతరము సోగాకుటుంబము తరిమివేయబడెను. కొంతకాలమైనపిమ్మట జపానుచరిత్రలో ప్రసిద్ధినందిన వేరొక పురుషుడు రంగమునకు దిగెను. అతని పేరు కాకటోమి—నో—కామటోరి. ఇతడు ప్రభుత్వమున ననేకవిధములగు మార్పులను తెచ్చిపెట్టెను. చీనావారి పద్ధతుల ననేక మవలంబించెను. కాని ప్రభుత్వోద్యోగులను నియమించుటకై పరీక్షలుపెట్టు చీనావారిపద్ధతిని మాత్ర మీతడనుకరించలేదు. ఇప్పుడు చక్రవర్తి ఒక వంశనాయకుడు మాత్రమే కాడు. అంతకన్న అధికు డాయెను. కేంద్రప్రభుత్వ[illegible] శక్తివంతమయ్యెను.

ఈ కాలమునందే, కొద్దికాలముపాటు మాత్రమే, నారారాజధాని పట్టణమయ్యెను. కొయొటొ క్రీ. వె. 794 సంవత్సరమున రాజధానిగాచేయబడినది. సుమారు 1100 సంవత్సరములపాటు అది రాజధానిగానే యుండెను. తరువాత, ఈమధ్యనే, దానిస్థానే, టోకియో రాజధాని యయ్యెను. టోకియో విశాలమైన గొప్ప నవీననగరము. కాని జపాను ఆత్మనుగూర్చి చెప్పునది కొయొటో. వేయిసంవత్సరముల విషయముల నది గర్భమునందు దాచుకొన్నది.

కాకటోమి—నో—కామటోరి ఫ్యూజీవరాకుటుంబమును స్థాపించెను. జపాను చరిత్రలో ఈకుటుంబము గొప్పకార్యములు చేసి ప్రసిద్ధివహించెను. 200 సంవత్సరములకాలము వారు పాలకులైయుండిరి. చక్రవర్తులను తమ చేతి కీలుబొమ్మలుగా చేసికొనిరి. తమ వంశస్త్రీలనే వారు వివాహమాడునట్లు చేసిరి. ఇతరకుటుంబములలో సమర్థు లుండుట చూచి వారిని సన్యాసమఠములందు ప్రవేశించునట్లు బలాత్కారముచేసిరి.

నారా రాజధానిగా నుండుకాలమున చీనాచక్రవర్తి జపానుపాలకున కొక సందేశ మంపెను. జపానుపాలకుని ఈవిధముగా సంబోధించెను: తై—నై—పుంగ్—కోక్ చక్రవర్తి అని. దీని యర్థము—మహా సూర్యోదయరాజ్యము అని. జపానీయుల కీపే రిష్టము. యామటో పేరుకన్న ఈపేరు గంభీరముగా నుండెను. కాన వారు వారి దేశమును డాయ్ నిప్పన్ — అనగా సూర్యోదయదేశము అని పిలువదొడగిరి. ఈ పేరే నేటివరకు జపానుకు వారు వాడుకొను పేరు. జపాను అను పదము నిప్పన్ అను పదమునుండి వచ్చినదే. 600 సంవత్సరముల తరువాత మార్కో—పోలో అను గొప్ప ఇటలీయాత్రికుడు చీనాను సందర్శించెను. అతడు జపానుకు వెళ్ళలేదు. కాని దానినిగురించి అతడు తన యాత్రా గ్రంథమున వ్రాసెను. అతడు నై—పుంగ్—కోక్ అను పేరు వినెను. ఈ పేరు నాతడు చిపంగో అని తన గ్రంథమున వ్రాసెను. ఈ పదము నుండి జపాను పదము పుట్టెను.

మన దేశమునకు ఇండియా, హిందూస్థానము అను పేర్లెందుకు వచ్చినవో నేను చెప్పితినా? నీకు తెలియునా? రెండు పేర్లును సింధునదిని బట్టియే వచ్చినవి. కావుననే సింధునది ఇండియా ఏకైక (ప్రధాన)నది యగుచున్నది. సింధు అను పేరునుబట్టి గ్రీకులు మన దేశమును ఇండోస్ అనిరి. దానినుండి ఇండియా వచ్చినది. సింధుపదమునుండియే పర్షియనుల వాడుకనుబట్టి హిందూపదము వచ్చినది. దీనినుండి హిందూస్థానము వచ్చినది.

## 43

# హర్షవర్ధనుడు: యువాన్ చాంగ్

మే 11, 1932

మనము మరల ఇండియాకు పోదము. హూణులు ఓడింపబడి తరుమగొట్టబడిరి. కాని వారు మూలమూలల దాగియుండిరి. బాలాదిత్యుని పిమ్మట గుప్తమహారాజవంశము అంతరించెను. ఉత్తరహిందూస్థానమున అనేకరాజ్యములు, రాష్ట్రములు ఉండెను. దక్షిణమున పులకేశి చాళుక్య సామ్రాజ్యమును స్థాపించెను.

కాన్పూరునకు అనతిదూరమున కనోజిపట్టణ మున్నది. కాన్పూరు నేడు పెద్దపట్టణమే. కాని ఫ్యాక్టరీలతోను, చిమ్నీలతోను అది అందవికారముగా నుండును. కనోజి చిన్నపట్టణము. అది గ్రామమంత పెద్దదిగా నుండును. కాని మనము ప్రసంగించుకొనుచున్న కాలమున అది యొక గొప్ప రాజధాని. కవులకు, శిల్పులకు, తత్వజ్ఞులకు అది ప్రసిద్ధిగాంచెను. అప్పటికి కాన్పూ రింకను పుట్టనేలేదు. మరికొన్ని వందల సంవత్సరముల వరకును అది పుట్టనేలేదు.

కనోజి ఈకాలపు పేరు. దాని అసలు పేరు కాన్యకుబ్జము. గూనుపిల్ల అని దానియర్థము. ఈపేరుకు సంబంధించిన గాథ ఏమనగా—

ఒక ఋషి తన కపచారముచేసి రను కారణమున ఒక రాజుకూతుళ్ళను నూర్గురను శపించెను. ఆ కారణమున వారు గూనుపిల్ల లైరి. అప్పటి నుండియు వారు కాపురముండు నగరమునకు కాన్యకుబ్జము—గూను పిల్లల నగరము అను పేరు వచ్చెను.

పొట్టిగా ఉన్నది కాబట్టి కనోజి అను మాటనే మనము వాడుదము. హూణులు కనోజిరాజును చంపి అతని భార్య రాజశ్రీని చెరబట్టిరి. వెంటనే ఆమెసోదరుడు రాజవర్ధనుడు హూణుల నెదుర్కొని తన సోదరిని విడిపించుటకు వెళ్ళెను. అతడు హూణుల నోడించెను కాని అతనిని ద్రోహముచేసి హత్యచేసిరి. అతని తమ్ముడు హర్షవర్ధనుడు తన చెల్లెలు రాజశ్రీని వెదకుటకు వెళ్ళెను. పాప మామె తప్పించుకొని పర్వతములలోనికి పారిపోయి, బాధలు పడలేక ఆత్మహత్య చేసికొనుటకు నిశ్చయించెను. ఆమె చితినెక్కి దేహమును త్యజించబోవుచున్న నిమిషమున హర్షవర్ధను డామెను చూచి రక్షించెను.

తన చెల్లెలిని కనుగొని రక్షించినపిమ్మట హర్షవర్ధనుడు తన యన్నను ద్రోహబుద్ధితో చంపిన రాజును శిక్షించెను. శిక్షించుటయే కాదు, అతడు ఉత్తరహిందూస్థానమునంతయును - ఈసముద్రమునుండి ఆసముద్రమువరకు-దక్షిణమున వింధ్యపర్వతములవరకు జయించెను. వింధ్యకు దక్షిణమున చాళుక్యసామ్రాజ్య ముండుటవలన అంతటితో ఆగెను.

హర్షవర్ధనుడు కనోజిని తన రాజధానిగా జేసికొనెను. అతడు కవి, నాటకకర్త అగుటవలన కవులను, కళాప్రవీణులను తన కొలువులో పెట్టుకొనెను. కనోజి ప్రసిద్ధనగర మాయెను. హర్షుడు బౌద్ధమతావలంబి. బౌద్ధమతము ప్రత్యేకమతముగా ఇండియాలో దుర్బలమయ్యెను. బ్రాహ్మణ మతము దానిని కబళించెను. ఇండియానేలిన బౌద్ధచక్రవర్తులలో కడపటి వాడు హర్షుడనియే తోచును.

హర్షుడు రాజ్యముచేయుచున్న కాలమునందే యువాన్‌ఛాంగ్ ఇండియాకు వచ్చెను, అతడు తిరిగివెళ్ళినపిమ్మట వ్రాసిన యాత్రాగ్రంథ

మునుబట్టి ఇండియానుగురించియు, ఇండియాకు వచ్చు మార్గమున నతడు చూచిన మధ్యఆసియాదేశములనుగురించియు అనేకవిషయములు మనకు తెలియుచున్నవి. అతడు భక్తిపరుడగు బౌద్ధుడు. బౌద్ధమతముతో సంబంధమున్న పుణ్యక్షేత్రములను దర్శించుటకును, బౌద్ధమతగ్రంథములను తనతో కూడ తీసికొనిపోవుటకును అతడు వచ్చెను. గోబీఎడారి కడ్డుపడి యాతడు వచ్చెను. త్రోవలో తాష్ఖండము, సమరఖండము, బాక్, ఖోటాన్, యార్ఖండము మున్నగు ప్రసిద్ధపట్టణముల నాతడు చూచెను. ఇండియా దేశమునంతను అతడు చూచెను. బహుశా సింహళమునుకూడ చూచి యుండవచ్చును. తాను దర్శించిన దేశములనుగూర్చిన యథార్థాభిప్రాయములు, ఇండియాలోని వివిధభాగములందు నివసించు జాతుల విశిష్ట లక్షణములు (నేటికిని ఈలక్షణములు వారికి సరిపోవుచున్నవి), అతడు వినిన అభూతకల్పనలు గల కథలు, బుద్ధునియొక్కయు బోధిసత్వుల యొక్కయు మహత్తును ప్రకటించు అనేకకథలు—అతడు వ్రాసిన మనోహరమగు గ్రంథమునింద వింతగా కలిసిపోయియున్నవి. రాగిరేకులను కడుపుచుట్టు బిగించుకొని తిరుగాడు మిక్కిలి తెలివైనవాని కథ నిదివరలో నీకు చెప్పియుంటిని.

అత డనేకసంవత్సరము లిండియాలో - ముఖ్యముగా పాటలీపుత్రమునకు సమీపమందున్న నలందామహావిశ్వవిద్యాలయములో గడపెను. నలందా విశ్వవిద్యాలయము మాత్రమే కాదు. అది బౌద్ధభిక్షుకుల మఠముకూడ. అతడు దర్శించినప్పు డందులో 10,000 మంది విద్యార్థులును, సన్యాసులును ఉండిరి. బ్రాహ్మణవిద్యలకు వారణాసి ఆటపట్టైనట్లే బౌద్ధవిద్యలకు నలందా ఆటపట్టుగా నుండెను.

పూర్వకాలమున ఇండియాను ఇందుభూమి, అనగా చంద్రుని భూమి అని అనెడివా రని ఇదివరలో నీకు వ్రాసియుంటిని. యువాన్ చాంగ్ కూడ ఇట్లే వ్రాసెను. ఆపే రెట్లు తగియున్నదోకూడ చర్చించెను. చీనా భాషలోకూడ ఇం—టు అనగా చంద్రుడని యర్థము. నీకు చీనావారి పేరు*

* ఇందిర ముద్దుపేరు ఇందు.

వచ్చిన దన్నను విశేషము లేదు. క్రీ. వె. 629 సంవత్సరమున యువాన్ చాంగ్ ఇండియాకు వచ్చెను. చీనానుండి ఇండియాకు బయలుదేరునాటి కతని వయస్సు 26 సంవత్సరములు. అతడు అందముగా పొడుగుగా నుండెడివాడని ఒక ప్రాచీన చీనాగ్రంథము వాకొనుచున్నది. "అతని వన్నె మృదువుగా నుండెను. కన్నులు మెరిసిపోవుచుండెను. అతని వైఖరి గంభీరముగా నుండెను. అతని ముఖలక్షణములు మనోహరముగా నుండెను. భూమి నావరించిన మహాజలముల గాంభీర్య మతనిలో కలదు. నీటినుండి పైకి లేచు పద్మపుష్పముయొక్క శాంతత, ప్రకాశము అతనిలో కలవు."

బౌద్ధభిక్షువు ధరించు కాషాయవస్త్రములను ధరించి అత డొక్కడే యీ మహాయాత్ర సాగించెను. చీనాచక్రవర్తి అనుమతి నీయకున్నను అతడు లెక్కపెట్టలేదు. గోబీఎడారి నాతడు ప్రాణములు చేతబట్టుకొని దాటెను. ఎడారిఅంచున నున్న టర్ఫాన్‌రాజ్యము నతడు చేరెను. ఈ యెడారిరాజ్యము సంస్కృతికి నిలయమై యుండెను. నే డది నామమాత్రావశిష్టమై యుండెను. పురావస్తుశాస్త్రజ్ఞులు, పురాతనచరిత్రవిచారకులు నేడు శిథిలములకై ఆప్రదేశమును త్రవ్వుచుందురు. కాని ఏడవ శతాబ్దమున, యువాన్‌చాంగ్ దానిని దర్శించినప్పుడు అది కలకలలాడుచుండెను. సంస్కృతి కాలవాలమై యుండెను. ఈ సంస్కృతి ఇండియా, చీనా, పర్షియా, యూరోపుభాగముల సంస్కృతుల సమ్మేళనము. బౌద్ధముచ్చలో నుండెను. సంస్కృతభాషద్వారా హిందూస్థానసంపర్కము అతిశయముగా నుండెను. అయినను చీనా పర్షియాదేశముల జీవితాదర్శములు వా రవలంబించుచుండిరి. వారి భాష మంగోలియన్ అనుకొందు వేమో? కాదు. అది ఇండోయూరోపియన్ భాష. అనేకవిధములుగా నది యూరోపులోని కెల్టిక్‌భాషలను పోలియుండును. ఇంకొక వింత విషయ మేమనగా—వారి కుడ్యములపై చిత్రింపబడిన శిలాప్రతిమలు యూరోపియన్ మనుష్యులమాదిరులవలె నుండెను. ఈ కుడ్యచిత్రములు,

బుద్ధులతో, బోధిసత్వులతో, దేవుళ్ళతో, దేవతలతో మిక్కిలి రమణీయముగా నుండెను. దేవతావిగ్రహములు తరుచు హిందూస్థానవస్త్రములను ధరించినట్లును, లేదా గ్రీకుల తలపాగాలు ధరించినట్లును చిత్రింపబడినవి. మాం. గ్రౌసె అను ఫ్రెంచివిమర్శకుడు చెప్పినట్లు "హిందువుల మార్దవము, గ్రీకుల చాతుర్యము, చైనీయుల సౌందర్యము ఈ వస్తువులలో ముచ్చటగా మిళితమైయుండెను."

టర్ఫన్ ఇంకను ఉన్నది. పటములో దానిని నీవు చూడవచ్చును. కాని దానికి నేడెట్టి ప్రసిద్ధియు లేదు. ఏడవ శతాబ్దికో ఫలవంతమగు సంస్కృతిప్రవాహములు పాయలు పాయలుగా దూరప్రాంతములనుండి వచ్చి, ఇక్కడ కలిసికొని ఏకమై ఏకరసభావము నందుట ఎంతటి యాశ్చర్యకరమగు విషయము !

టర్ఫన్‌నుండి యువాన్‌ఛాంగ్ కూచాకు వెళ్ళెను. ఇది మధ్య ఆసియాలో ఆనాడు ఉత్కృష్టమగు నాగరికతకు ప్రసిద్ధిగన్నది. చక్కని గాయకులకును, సుందరులగు స్త్రీలకును ఇది కీర్తివహించినది. ఇందలి మతమును, కళలును ఇండియానుండి వచ్చినవే. ఇరాన్‌దేశ మిందలి సంస్కృతికి కారణము. దీనితో నది వర్తకమునుకూడ సాగించుచుండెను. అందలి భాష సంస్కృతము, ప్రాచీనపర్షియన్ భాష, లాటిన్, కెల్టిక్ భాషలతో సంబంధముకలది. మరల నెంతటి చక్కని సమ్మేళనమో !

ఈవిధముగా యువాన్‌ఛాంగ్ యాత్రసాగించెను. టర్కీల దేశములగుండ బోయెను. అచ్చటినుండియే బౌద్ధుడగు, ఘనుడగు ఖాన్ మధ్యఆసియాఅధికభాగముపై పరిపాలన చేయుచుండెను. తరువాత నతడు సమరఖండము వెళ్లెను. అప్పటికే అది ప్రాచీననగరమైనది. వేయిసంవత్సరములకు పూర్వము దాని సమీపమునుండి పోయిన అలెగ్జాండరు స్మృతు లందు వాసించుచుండెను. పిమ్మట బాకును దర్శించెను. తరువాత కాబూలునదీలోయను, కాశ్మీరమును, ఇండియాను దర్శించెను.

టాంగ్‌వంశస్థులు చీనాను పరిపాలించుచున్న తొలిరోజు లవి. అప్పుడు వారి రాజధాని సి-అన్-ఫ్యూ. అది కళలకు, విద్యలకు నిలయమై యుండెను. ప్రపంచమంతటిలోను చీనా నాడు నాగరీకమున అగ్రస్థానము వహించియుండెను. యువాంగ్‌ఛాంగ్ ఇట్టి ఉత్కృష్టనాగరీకదేశము నుండి మన దేశము వచ్చెనన్న మాట జ్ఞాపకముంచుకోవలెను. కావుననే అతనికి ఒకపాటివిషయములు నచ్చవు. సాదృశ్యములు గమనించుట కత డుపయోగించు కొలతబద్ద ఉన్నతమైనది. ఇండియాలోని పరిస్థితులనుగూర్చి అతడు వ్రాసిన విషయము లాకారణమున ముఖ్యమైనవియు, విలువగలవియు. అతడు హిందూదేశప్రజలను, పరిపాలనమును మెచ్చుకొనెను. అతడు చెప్పుచున్నాడు—"సామాన్యజనులు అనాలోచితముగా పనిచేయువారైనను వారు మర్యాదస్థులును, ఋజువర్తనులును. ధన విషయమున వారికి కుతంత్రములు లేవు. న్యాయపరిపాలనమున వారు నిదానము చూపుదురు. వారి ప్రవర్తనలో మోసముగాని, ద్రోహముగాని లేవు. అన్నప్రకారము మాట చెల్లింతురు. శపథములు చెల్లింతురు. వారి పరిపాలనము మిక్కిలి న్యాయసమ్మతముగా నుండును. వారు శాంతస్వభావులు. వారి నడవడిక మనోహరముగా నుండును. నేరములు చేయువారియొక్కయు, తిరుగుబాటు చేయువారియొక్కయు సంఖ్య బహు స్వల్పము. వారివల్ల తొందర లెప్పుడోగాని యుండవు."

అత డింకను చెప్పుచున్నాడు—"ప్రభుత్వపరిపాలనా సూత్రములు దయాసమేతము లగుటచేత చట్టముల నమలులో పెట్టుట సులువుగా జరుగుచుండెను....ప్రజలచే బలాత్కారముగా పనిచేయించుకొను పద్ధతి లేదు."...."ప్రజలపై విధించు పన్నులు తేలికగా నుండెను. దొరతనము కొరకు ప్రజలు స్వయముగా చేయవలసిన సేవ కొద్దిమాత్రమే. ఎట్టి భయమును లేకుండ ప్రజలు నెమ్మదిగా తమ ఆస్తులను పెట్టుకొని యుండవచ్చును. జీవనమునకై అందరును భూమి దున్నుకొందురు. రాజుగారి భూములను దున్నువారుమాత్రము పంటలో ఆరవ భాగమును

పన్నుగా చెల్లింతురు. వర్తకులు రాకపోకలు సాగించుచు వర్తకమును నడపించుకొందురు.''

ప్రజావిద్యకు ప్రభుత్వ మేర్పాట్లు చేసెననియు, అవి చిన్నతనమందే ప్రారంభమగుచుండెననియు యువాన్‌ఛాంగ్ వ్రాసియున్నాడు. బాలబోధ ముగించినపిమ్మట బాలబాలికలు శాస్త్రపంచకము నేడవయేట నభ్యసించెడు వారట. శాస్త్రము లనగా మతగ్రంథములని ఇప్పు డనుకొనుచున్నారు. ఆరోజులలో శాస్త్రము లన్నివిధములుగా జ్ఞానమును ఉపదేశించు విద్యల క్రింద భావించుచుండిరి. శాస్త్రపంచకము—(1) వ్యాకరణము, (2) శిల్ప శాస్త్రము, (3) వైద్యము, (4) తర్కశాస్త్రము, (5) తత్వశాస్త్రము. ఈ శాస్త్రాభ్యాసము విశ్వవిద్యాలయములలో జరుగుచుండెను. విద్యార్థికి ముప్పదిసంవత్సరముల వయస్సు వచ్చుసరికి చదువు పూర్తియగు చుండెను. అంత వయస్సువరకు చదువు నేర్చుకొనువారి సంఖ్య అధికముగా నుండదని తోచును. కాని ప్రారంభవిద్య చక్కగా వ్యాప్తినంది యుండెను. ఆకాలమున ఉపాధ్యాయులకు కొరతలేదు. మతాచార్యులును, సన్యాసులును ఉపాధ్యాయులై యుండిరి. హిందూదేశస్థుల విద్యాప్రీతి చూచి యువాన్‌ఛాంగ్ ఎంతో ఆశ్చర్యమునందెను. ఆతని గ్రంథము నందంతటను దీని ప్రశంసయే.

ప్రయాగలో జరిగిన మహాకుంభమేళమును యువాన్‌ఛాంగ్ వర్ణించి యుండెను. ఈమారు నీ వీమేళమును చూచినప్పుడు యువాన్‌ఛాంగ్ 1300 సంవత్సరముల క్రితము దీనిని దర్శించెనన్నమాట స్మరించుకొనుము. అప్పటికిసైతము ఈమేళము ప్రాచీనమైయుండెననియు, వేదకాలము నుండియు అది వచ్చుచుండెననియు జ్ఞాపకముంచుకొనుము. సద్వంశజాత యగు నీ ప్రాచీనపట్టణముతో పోల్చిచూచిన మన అలహాబాదు నిన్న మొన్నటి నగరమే యగును. 400 సంవత్సరముల లోపుననే అక్బరు దీనిని ప్రతిష్ఠచేసెను. ప్రయాగ మిక్కిలి ప్రాచీననగరము; అంతకన్న ప్రాచీనమైనది గంగాయమునా సంగమస్థానమునకు వేలకొలది సంవత్సరములపాటు ఏటేట లక్షలకొద్ది ప్రజలను ఆకర్షించు శక్తి.

అచ్చముగా హిందువులదైన ఈ తిరునాళ్ళకు, బౌద్ధుడైనప్పటికిని హర్షుడు వెళ్ళెనని యువాన్‌ఛాంగ్ చెప్పుచున్నాడు. అర్థులును, బీదలును యావన్మందియు మేళసందర్భమున తన యాధిపత్య మంగీకరింపవలసినదని అతని తరపున ఒక ఫర్మానా జారీచేయబడెను. చక్రవర్తి యన్నవానికిసైతము అట్టి ఆహ్వానము చేయుట కెంతో ధైర్య ముండవలెను. అనేకు లాతని యాహ్వానము ప్రకారము వచ్చిరని చెప్పనక్కరలేదు. లక్షజనము ప్రతిదినము హర్షుని యతిథులై భుజించిపోవుచుండిరి. 5 సంవత్సరముల కొకమారు జరుగు ఈ మేళమున హర్షుడు తన బొక్కసములో సదనముగా నున్నదంతయు—బంగారము, నగలు, పట్టు, ఇది యది యననేల, ఉన్నదంతయు—పంచిపెట్టువాడు. అతడు తన కిరీటమును, అమూల్యవస్త్రములను కూడ ఇచ్చివేసెను. తన చెల్లెలు రాజశ్రీ చేతినుండి సామాన్యమగు ప్రాతబట్టలను గ్రహించి కట్టుకొనెను.

భక్తిపరుడగు బౌద్ధుడుగాన హర్షుడు భోజనార్థము జంతువులను చంపుట మానిపించెను. బ్రాహ్మణులు బుద్ధుని కాలమునుండియు క్రమక్రమముగా శాకాహారు లగుచుండిరిగాన ఇందుల కభ్యంతర పెట్టియుండరు.

యువాన్ పుస్తకములో ఒక చిన్న తమాషావిషయ ముండెను. ఇండియాలో ఎవనికైనను జబ్బుచేసినయెడల వెంటనే అతడు వారము రోజులు లంకణముండును. చాలమంది కీకాలములో జబ్బు నయమగును. నయముకానిచో అప్పుడు ఔషధము పుచ్చుకొందురు. ఆకాలములో రోగము లంతగా ఉండెడివి కావు. వైద్యుల సహాయ మంతగా నభిలషించెడువారు కారు.

ఆ కాలమున ఒక గొప్ప విశేష మేమనగా—సంస్కారులగు పండితులను పాలకులును, క్షత్రియులును గౌరవాభిమానములతో చూచుచుండిరి. ఇండియాలోను, చీనాలోను సంస్కృతికిని, విద్యకును గౌరవస్థాన ముండునట్లు గొప్పప్రయత్నములు జయప్రదముగ జరిగినవి. పశుబలమునకును, ధనమునకును అట్టిస్థానము లేదు.

ఇండియాలో పలుసంవత్సరములు గడపి యువాన్‌చాంగ్ ఉత్తర పర్వతములనుదాటి ఇంటికితిరిగివెళ్ళెను. సింధునదిలో అతనికి జలగండము తప్పినది. అతని అమూల్య గ్రంథము లనేక మానదిలో కొట్టుకొనిపోయి నవి. అయినను అతడు వ్రాతగ్రంథముల ననేకము తీసికొనిపోగలిగెను. పిమ్మట చాల సంవత్సరములపాటు అత డాగ్రంథములను చీనాభాషలోనికి మార్చుచుండెను. టాంగ్‌చక్రవర్తి సి-అన్-ఫ్యూ రాజధానిలో తిరిగి వచ్చిన అతనికి అనురాగపూర్వకముగా స్వాగతము చెప్పెను. ఈ చక్ర వర్తియే తన యాత్రాచరిత్రను వ్రాయుమని అతనిని పురికొల్పెను.

యువాన్ మధ్యఆసియాలోని టర్కులనుగురించికూడ వ్రాసెను— ఈ క్రొత్తతెగ పిదపకాలములో పశ్చిమముగా పోయి అనేకరాజ్యములను కూలద్రోసెను. మధ్యఆసియాలో నుండ యుండిన బౌద్ధమఠములనుగూర్చి యాతడు చెప్పెను. బౌద్ధమఠములు నిజమునకు పర్షియా, ఈరాకు (మెసపొటేమియా), ఖొరాసాన్, మోసుల్‌దేశములలో సిరియాపొలిమేరల పర్యంతము కానవచ్చుచుండెను. పరిషియన్ ప్రజలనుగూర్చి అత డిట్లు వ్రాసెను—"వారికి చదువన్న లక్ష్యములేదు. శిల్పకళలన్న చెవికోసి కొందురు. వారు తయారుచేసిన వస్తువులను పొరుగుదేశములు కొని యాడుదురు." ఆకాలమునాటి యాత్రికులు అసాధారణపురుషులు : ఆఫ్రికా మధ్యభాగమునకును, ఉత్తరదక్షిణధ్రువములకును ఈమధ్యలో చేసిన ప్రయాణములు పూర్వకాలమున చేసిన బ్రహ్మాండయాత్రలతో పోల్చి చూచిన స్వల్పప్రయాణములవలె కనిపించును. సంవత్సరములకాలము పాటు పర్వతముల నెక్కుచు, ఎడారులను దాటుచు, స్నేహితులకు దూరమై వారు ప్రయాణములను సాగించుచునేయుండిరి. అప్పుడప్పుడు బహుశా వారికి ఇంటిపై ధ్యాస కలుగుచుండెనుకాబోలు. కాని అభిమానపూరితు లగుటచే వా రామాట చెప్పరు. ఇట్టి యాత్రికులలో నొకడుమాత్రము తన హృదయమును మనకు వెల్లడిచేసెను. దూరదేశమునం దున్నప్పు డతని మనస్సు ఇంటిపైపోయినది. అతడు ఇంటిమీద బెంగపెట్టుకొనెను.

అతని పేరు సంగ్‌యూన్. యువాన్‌చాంగ్ వచ్చుటకు 100 సంవత్సరములకు ముందు అత డిండియాకు వచ్చెను. అతడు ఇండియాకు వాయవ్యమున నున్న గాంధార మను పర్వతమయప్రదేశమునం దుండెను. అతడు చెప్పిన మాట లేమనగా—“పిల్లవాయువులు వీచుచుండెను. పక్షుల కలరుతములు వినవచ్చుచుండెను. వసంత కాలమున వనలక్ష్మి శృంగారించుకొని యుండెను. వివిధపుష్పములపై వ్రాలి సీతాకోకచిలుకలు రెక్కల నాడించుచుండెను. ఈ మనోహరదృశ్యములను దూరదేశమునందు చూచుచున్న సంగ్‌యూన్‌మనస్సు ఇంటిమొగము పట్టెను. నిరంతరము ఇంటిపై ఆలోచనలు పోవుటచే విచారగ్రస్తు డాయెను. తత్కారణమున తీవ్రవ్యాధిగ్రస్తు డాయెను.

## 44

# దక్షిణఇండియాలో అనేకులు రాజులు, యోధులును, ఒక మహాపురుషుడును ఉదయించుట

మే 13, 1932.

క్రీ. వె. 648 సంవత్సరమున శ్రీహర్షుడు కీర్తిశేషు డాయెను. అతని మరణమునకు పూర్వమే ఇండియావాయవ్యపొలిమేరయందు బెలూచిస్థానములో చిన్నమబ్బు కనిపించెను. పశ్చిమఆసియాలోను, ఉత్తర ఆఫ్రికాలోను, దక్షిణయూరోపులోను పుట్టుచున్న తీవ్రమగు తుపాను నిది సూచించుచుండెను. అరేబియాలో ఒక నూతనప్రవక్త తలయెత్తెను. అతని పేరు మహమ్మదు. అతడు ఇస్లాం అను పేరు గల నూతనమతమును బోధించెను. నూత్నమతావేశముతో, ఆత్మవిశ్వాసముతో అరబ్బులు ఖండఖండములను జయించుకొనుచుపోయిరి. అది యత్యద్భుతకార్యము.

ప్రపంచమున ప్రవేశించి, అందు మార్పుల గలుగజేసిన ఈ నూతనశక్తిని గురించి మనము తెలిసికొనవలెను. కాని అంతకుముందు మన మొక దక్షిణహిందూస్థానమును దర్శింతము. ఆ రోజులలో అవి ఎట్లుండెనో తెలిసికొందము. హర్షుని కాలముననే మస్లిముఅరబ్బులు బెలూచిస్థానమును చేరిరి. వెంటనే వారు సింధుదేశమును వశపరచుకొనిరి. వా రచ్చటనే నిలిచిపోయిరి. మరి 300 సంవత్సరములవరకు హిందూస్థానముమీద మస్లిముదండయాత్ర లేమియు జరుగలేదు. ఈ దండయాత్రలు పిదపకాలములో చేసినది అరబ్బులు కారు. ఇస్లాంమతమును స్వీకరించిన కొందరు మధ్యఆసియా తెగలవారు.

కాన మన మిప్పుడు దక్షిణమునకు పోదము. పశ్చిమమునందును, మధ్యభాగమునందును చాళుక్యరాజ్య ముండెను. ఇది చాలవరకు మహారాష్ట్రదేశము. దీని రాజధాని బాదామి. యువాన్‌చాంగ్ మహారాష్ట్రులను ప్రశంసించెను. వారి ధైర్యము నతిమాత్రముగ మెచ్చుకొనెను. వారు "శూరులు, అభిమానధనులు, ఉపకారమును పొంది కృతజ్ఞత చూపుదురు. అపకారమును పొందిన కక్ష వహింతురు." ఉత్తరమున హర్షుని, దక్షిణమున పల్లవులను, తూర్పున కళింగమును (ఒరిస్సా) చాళుక్యులు ఆపవలసియుండెను. వారు నానాటికి ప్రబలులై ఈ సముద్రమునుండి ఆ సముద్రమువరకు వ్యాపించిరి. పిమ్మట రాష్ట్రకూటులు వారిని ఓడించిరి.

దక్షిణమున పెద్ద రాజ్యములు, సామ్రాజ్యములు వృద్ధిలోనుండెను. ఒక్కొక్కమారు వా రొకరితోనొకరు సరితూగుచుండిరి. ఒక్కొక్కప్పుడు అం దొక రాజ్యము వృద్ధియై మిగతరాజ్యములను మించిపోవుచుండెను. పాండ్యరాజులు ఏలు కాలమున మధుర సంస్కృతికి గొప్ప నిలయమైయుండెను. తమిళకవులు, గ్రంథకారులు ఆ పట్టణము నాశ్రయించిరి. తమిళమందలి ఉద్గ్రంథములు పెక్కులు క్రీస్తుశకారంభమునందు పుట్టినవి. కాంచీపురము (కంజీవరము) ను రాజధానిగా చేసికొన్న

పల్లవులుకూడ ఒకప్పు డుచ్చులోనుండిరి. మలయాద్వీపములు హిందువుల వలసభూము లగుటకు వీరే ప్రధానకారకులు.

కొంతకాల మైనపిమ్మట చోళసామ్రాజ్యము శక్తివంతమయ్యెను. తొమ్మిదవ శతాబ్ది మధ్యప్రాంతమున దక్షిణమునంతయు నది తన ఏలుబడిలోనికి తెచ్చుకొనెను. అది సముద్రాధికారము గల సామ్రాజ్యము. దానికి పెద్ద నౌకాదళ ముండెను. దాని సాహాయ్యమున నది బంగాళాఖాతమును, అరేబియాసముద్రమును శత్రురహితముగ చేసికొనెను. దాని ప్రధానరేవుపట్టణము కావేరీపట్టణము. ఇది కావేరీముఖద్వారమున నున్నది. చోళుల మొట్టమొదటి గొప్పరాజు విజయాలయుడు. వా రుత్తర దిక్కుగా వ్యాపించుకొనుచుపోయిరి. రాష్ట్రకూటులు హఠాత్తుగా వారి నోడించిరికాని రాజరాజునాయకత్వమున వారు మరల తేరుకొనిరి. చోళ సామ్రాజ్యము నతడు మరల నిలిపెను. ఇది పదవ శతాబ్దాంతమున జరిగెను. ఈ కాలమునందే ఉత్తరహిందూస్థానమున మస్లిముదండయాత్రలు జరుగుచుండెను. ఎక్కడో ఉత్తరమున జరుగుచున్న సంఘటనల ప్రసక్తి రాజరాజుకు పట్టలేదు. అతడు తన సామ్రాజ్య వ్యాప్తికి పనిచేయుచుండెను. అతడు సింహళమును జయించెను. 70 సంవత్సరముల కాలము చోళులు సింహళము నేలిరి. అతని కుమారుడు రాజేంద్రుడుకూడ శూరుడే. జయశీలుడే. అతడు దక్షిణబర్మాను జయించెను. ఆ యుద్ధమునకై ఆతడు ఏనుగులను నావలపై తీసికొనిపోయెను. అతడు ఉత్తరఇండియాకుకూడ వచ్చి బెంగాలురాజు నోడించెను. చోళ సామ్రాజ్య మీవిధముగా నెంతో విస్తరించినది. గుప్తులతరువాత పెద్ద సామ్రాజ్యము వీరిదే. కాని అది నిలువలేదు. రాజేంద్రుడు మహావీరుడే కాని క్రూరుడట. తాను జయించిన రాజ్యముల సద్భావము నార్జించుటకత డెట్టి కృషియు చేయలేదు. క్రీ. వె. 1013 నుండి 1044 వరకు అతడు రాజ్యముచేసెను. అతని మరణానంతరము చోళసామ్రాజ్యము సామంతరాజులు తిరుగబడుటచే చీలిపోయెను.

యుద్ధవిజయముల మాట అటుండగా చోళులు సముద్రవర్తకమునకు చిరకాలమునుండి ప్రసిద్ధికెక్కిరి. వారి సున్నితమగు వస్త్రములకు గిరాకీ ఎక్కువగా నుండెను. వారి రేవుపట్టణమగు కావేరీపట్టణము దూరదేశములనుండి సరుకులను తెచ్చునట్టియు, దూరదేశములకు సరుకులను గొనిపోవునట్టియు ఓడలతో ఎప్పుడును రద్దీగా నుండెను. యవనులు (గ్రీకులు) కావేరీపట్టణమున నొక భాగమున నివాసము లేర్పరచుకొనిరి. మహాభారతమందును చోళప్రశంస కలదు.

అనేకవందల సంవత్సరముల దక్షిణహిందూదేశచరిత్రమును సంక్షేపముగా చెప్ప ప్రయత్నించితిని. ఇంత సంక్షేపముగా చెప్పుటవలన నీకు ఇది యంతయు గందరగోళముగా నుండవచ్చును. కాని వివిధ రాజ్యములు, రాజవంశములు అను వ్యూహములో చిక్కుకొని బయట పడుటకు మనకు సావకాశము లేదు. మనము సమీక్షచేయదలచినది ప్రపంచము నంతయును. అందలి చిన్నభాగముపై—అది మనము నివసించు భాగమైనప్పటికిని—మనము పెద్దకాలము మనసునిలిపిన మిగత విషయములను చెప్పుటకు సావకాశముండదు.

రాజులకన్నను, వారి విజయములకన్నను ఎక్కువ ప్రధానమైన విషయము—ఆకాలమునాటి కళకు, సంస్కృతికి సంబంధించిన కార్యములు. ఉత్తరమునకన్న దక్షిణమున శిల్పచాతుర్యమును ప్రచురముచేయు విషయము లనేకమున్నవి. ఉత్తరాదిని వెలసిన భవనములు, జ్ఞాపకసౌధములు, ప్రతిమాదులు చాలవరకు యుద్ధకాలములందును, మస్లిముదండయాత్రల సందర్భమందును ధ్వంసముచేయబడినవి. మస్లిములు దక్షిణాదికి వచ్చినప్పటికిని భవనాదులు ధ్వంసముకాలేదు. ఉత్తరాదిని అందమైన అనేక జ్ఞాపకసౌధములు ధ్వంసముచేయబడుట దురదృష్టమే. అక్కడికి వచ్చిన మస్లిములు — వీరు అరబ్బులు కారుసుమా, మధ్యఆసియా తెగలవారుసుమా — మతావేశముతో విగ్రహములను విధ్వంసము చేయగోరిరి. వారు ధ్వంసము చేయుటకు వేరొక కారణము

బహుశా ఆకాలపు హిందువులు దేవాలయములను కోటలుగా వాడుచు అచ్చటినుండి శత్రువులను ప్రతిఘటించుచుండిరి. నేడుకూడ దక్షిణాది దేవాలయములు చూచుటకు కోటలవలె కనబడును. శత్రువులు పైబడినప్పు డందుండి యుద్ధము చేయవచ్చును. ఆలయము లారాధనకేకాదు, ఇతర విధములుగాకూడ వాని నుపయోగించుచుండిరి. గ్రామపాఠశాల ఈ ఆల యమే. గ్రామస్థులు సమావేశమగు స్థానముకూడ ఆలయమే. పంచాయ తీలు జరుగుట ఆలయమందే. అవసరము వచ్చినప్పుడు శత్రువులను ప్రతి ఘటించుట కనువగు కోట ఆలయమే. ఈవిధముగా గ్రామజీవితము ఆలయముపై నాధారపడియుండెను. ఆలయములం దధికారము చెలా యించువారు పూజారులో, బ్రాహ్మణులో అయియుండుట సహజమేకదా. ఆలయములను కోటలుగా అప్పుడప్పుడు వినియోగించుటవలననే దండ యాత్రలు జరిపిన మస్లిములు వాటిని ధ్వంసముచేసియుందురు.

ఈ కాలమునాటి అందమగు దేవాలయ మొకటి తంజావూరులో కలదు. దానిని నిర్మించినవాడు చోళరాజైన రాజరాజు. బాదామీవద్దకూడ చక్కని దేవాలయము లున్నవి. కంజీవరములోను ఉన్నవి. ఆనాటి దేవాలయము లన్నిటికన్న మిన్నయగు దేవాలయము ఎల్లోరాలోని కైలాసాలయము. ఏకశిలనుండి మలచిన అద్భుతావహమగు శిల్పశోభ ఇందు గాననగును. దీనిని ఎనిమిదవ శతాబ్దిఉత్తరార్ధమున నిర్మింప ప్రారంభించిరి. శిల్పచాతుర్యమును ప్రకటించు అందమగు కంచువిగ్ర హములుకూడ ఉండెను. అందు ప్రసిద్ధిగాంచినది నటరాజవిగ్రహము— శివుడు నృత్యమును ప్రదర్శించుచున్నట్లు చూపు విగ్రహము.

ప్రథమరాజేంద్రచోళుడు చోళాపురమువద్ద 16 మైళ్ళ పొడుగు గల కరకట్టను సున్నముతోను, రాళ్ళతోను నిర్మింపజేసెను. నీటి పారుదల కొరకై ఇట్టి జలాధారవసతుల ననేకము నతడు కల్పించెను. నూరు సంవత్సరము లైనపిమ్మట అల్బెరూని అను అరబ్బీయాత్రికుడు ఆ కట్టడ ములను చూచుట తటస్థించెను. ఆశ్చర్య మగ్నమానసుడై వానిని గురించి

ఆత డిట్లు చెప్పెను: "వాటిని చూచినప్పుడు మా దేశస్థులు ఆశ్చర్య మందుదురు. వాటిని వర్ణింపజాలరు. వాటిని బోలిన కట్టడముల నెన్నటికిని నిర్మింపజాలరు."

ఈజాబులో కొందరు రాజుల పేర్లను, కొన్ని రాజవంశముల పేర్లను ఉదాహరించియుంటిని. వా రొక వెలుగు వెలిగి గతించిరి. వారిని ప్రజలు మరచిపోయిరి. రాజులకన్నను, చక్రవర్తులకన్నను అధికముగా హిందూదేశమునకు మేలుచేయనున్న మహాపురుషు డొకడు దక్షిణమున నుదయించెను. ఆ పురుషుని పేరు శంకరాచార్యులు. బహుశా అతడు ఎనిమిదవ శతాబ్దాంతమున పుట్టియుండవచ్చును. అత డఖండప్రతిభాశాలి. హిందూమతమును, అనగా హిందూమతశాఖయగు హేతుబద్ధమగు శైవమును ఆత డుద్ధరింప బూనుకొనెను. బౌద్ధమతముతో నాతడు పోరాడెను — బుద్ధితోను, వాదముచేసియు పోరాడెను. బౌద్ధసంఘమువంటిదే యగు ఒక సన్యాసిసంఘమును అతడు స్థాపించెను. నాలుగు వర్ణముల వారును అందు చేరవచ్చును. హిందూదేశపు నాలుగుమూలలందును— ఉత్తరము, పడమర, దక్షిణము, తూర్పు—అతడు నాలుగు పీఠములను స్థాపించెను. అతడు హిందూస్థానమునంతయు పర్యటనము చేసెను. ఎచ్చటికి పోయినను దిగ్విజయము గాంచెను. విజయములతో నాతడు వారణాసికి వచ్చెను. విజ్ఞానరంగమున సాధించిన విజయము లివి. వాద సహాయమున సాధించిన విజయము లివి. చివర కాతడు హిమాలయము లందలి కేదారనాథమును దర్శించెను. నిత్యహిమావృతము కేదార నాథము. ఆత డచ్చట దేహమును చాలించెను. శంకరాచార్యులు చేసిన పని బ్రహ్మాండమైనది. ఉత్తరమునుండి దక్షిణమునకు తరుమఁగొట్టబడిన బౌద్ధము ఈకాలమున హిందూదేశములో అదృశ్యమయ్యెను. హిందూ మతమును, దాని శాఖయగు శైవమును హిందూదేశమున ప్రబలమాయెను. శంకరుడు తాను రచించిన గ్రంథములవల్లను, వ్యాఖ్యానములవల్లను, జేసిన వాదములవల్లను హిందూదేశమునందంతటను బుద్ధికి చురుకు

పుట్టించెను. బ్రాహ్మణజాతి కతడు మహానాయకు డగుటయే కాదు, అతడు ప్రజాసామాన్యదృష్టినికూడ ఆకర్షించెను. అసమానబుద్ధిబలము ప్రధాన కారణముగా ఒకడు మహానాయకుడగుట అసాధారణము. అట్టివాడు కోట్లకొలది ప్రజల హృదయముల నాకర్షించుట కూడ అసాధారణమే. చరిత్రలో నాతని పేరు నిలుచుటకూడ అసాధారణమే. గొప్ప సైనికులు, విజయములను సాధించినవారు చరిత్రలో ముఖ్యపాత్రలుగా కనిపింతురు. వారు జనసమ్మతి నందుదురు. లేదా జనులచే ద్వేషింపబడుదురు. వారు చరిత్రను క్రొత్తదారిని పట్టింతురు. గొప్ప మతనాయకులు కోట్లకొలది జనుల మనస్సులు కదుపుదురు. వారిని ఉత్సాహవంతులనుగా చేయుదురు. ప్రజల విశ్వాసము నాధారముగా చేసికొని ఇట్లు చేయుదురు. ప్రజల మనోభావములను కదలించుటవలన ఇట్లు జరుగును.

అనేకులు స్వతంత్రముగా ఆలోచించలేరు. అందుచేత మనస్సును గాని, బుద్ధినిగాని తృప్తిపరుచు మాటలవల్ల ప్రయోజనము స్వల్పము. కాని శంకరుడు మనస్సును, బుద్ధిని తృప్తిపరుచుటకు ప్రయత్నించెను. అతని వాదము హేతుబద్ధము. ఒక ప్రాచీనగ్రంథమందలి హేతుబద్ధము కాని మతసిద్ధాంతము నేకరువుపెట్టుటవంటిది కా దతని వాదము. అతని వాదము సరియైన దవునా, కాదా యను విషయముతో మనకు ప్రసక్తిలేదు. మతసమస్యలను పరిష్కరించుటకు హేతువాదమును అతడు ప్రయోగించుట గమనించదగిన యంశము. ఇట్టి పద్ధతి నవలంబించినను అతనికి విజయము చేకూరుటకూడ గమనించదగును. ఆనాటి పాలకుల హృదయ సంపద దీనినిబట్టి మనము గ్రహించవచ్చును.

హిందూతత్త్వశాస్త్రజ్ఞులలో చార్వాకు డను నాస్తికు డుండెడివాడు. అతడు దేవుడు లేడని వాదించుచుండెను. భగవంతునిపై నమ్మకములేని వారు మనకాలమున పలువురు—ముఖ్యముగా రష్యాలో కలరు. నాస్తిక్యముతో మన కిప్పుడు ప్రసక్తిలేదు. ప్రాచీనకాలమున యోచించుటకు స్వాతంత్ర్యము, యోచించిన విషయములను వ్రాసి ప్రకటించుటకు స్వాతం

త్ర్యము హిందూస్థానమున నుండె నన్న యంశము గమనింపదగినది. అంతరాత్మ చెప్పినప్రకారము చేయుటకు స్వాతంత్ర్యము అనున దింకొకటి కలదు. మొన్న మొన్నటివరకు యూరోపులో నిది లేదు. నేడు కూడ ఇందు కొన్ని చిక్కులున్నవి.

ఎడతెరపి లేకుండ పనిచేసిన శంకరుని జీవితమునుబట్టి మనము గ్రహించవలసిన వేరొక విషయము—సంస్కృతివిషయమున ఇండియా ఏకమని. ప్రాచీనచరిత్ర పొడుగునను ఇదియే వెల్లడియగుచుండును. భూగోళరీత్యా చూచిన ఇండియా కొంచె మెచ్చుతగ్గుగా ఏకమనియే చెప్ప వలెను. రాజకీయముగా ఇండియా తరుచు చీలికలైనది. అప్పుడప్పుడు ఏకచ్ఛత్రాధిపత్యముక్రిందకు కూడ వచ్చినట్లు మనము చూచితిమి. కాని మొట్టమొదటినుండియు సంస్కృతివిషయమున ఇండియా ఒక్కటియే. ఎందువల్ల? ఒకే సంప్రదాయములు, ఒకే మతములు, ఒకే వీరులు వీర కాంతలు, ఒకే పురాణములు, ఒకే సంస్కృతభాష, దేశమందంతట నొకే పుణ్యక్షేత్రములు, ఒకే గ్రామపంచాయతులు, ఒకే రాజనీతి. ఒకే విధమగు ఆలోచనలు దేశమందంతట వ్యాపించియుండెను. సాధారణ హిందూదేశస్థునకు హిందూస్థానము పుణ్యభూమి. మిగతప్రపంచమంతయు మ్లేచ్ఛుల, అనాగరికుల నివాసభూమి. ఈవిధముగా హిందూదేశస్థుల మను జ్ఞానము అందరికిని ఉండెను. అది ప్రాముఖ్యము వహించి, రాజ కీయముగా దేశము చీలికలైనసంగతిని కొంతవరకు ఉపేక్షించునట్లు చేసెను. పంచాయతీల పరిపాలన మున్నంతవరకు, పైని ఎట్టి మార్పులు జరుగుచున్నప్పటికిని, ఈజ్ఞాన మిట్లే నిలిచియుండెను.

శంకరుడు హిందూస్థానమున నాల్గుదిక్కులను నాల్గుపీఠములు స్థాపించుటనుబట్టి చూడ అతడు ఇండియాను సంస్కృతివిషయమున ఒక్క దేశముగా భావించెననియే స్పష్టమగుచున్నది. కొద్దికాలములో అతడు దిగ్విజయమును సాధించుటచూడ దేశములో ఒక మూలనుండి ఒకమూలకు సంస్కృతి ప్రవాహరూపమున శీఘ్రముగా పోవుచుండెనని తేటపడుచున్నది.

శంకరుడు శైవమును బోధించెను.* ఇది ముఖ్యముగా దక్షిణాదిని వ్యాపించెను. అచ్చటి ప్రాచీనదేవాలయములన్నియు శివాలయములే. గుప్తుల కాలమున ఉత్తరాదిని వైష్ణవమును, కృష్ణారాధనమును పునరుజ్జీవితమయ్యెను. హిందూమతముయొక్క ఈ రెండు శాఖలకు సంబంధించిన ఆలయములు భిన్నముగా నుండును.

ఈ జాబు పెరిగినది. మధ్యయుగములలోని ఇండియాస్థితిగతులను గూర్చి ఇంకను చెప్పవలసినది చాల మిగిలినది. తరువాతి జాబులో ఆ విషయమును వ్రాయుదును.

## 45

## మధ్యయుగములలో ఇండియా

మే 14, 1932.

అశోకుని తాత చంద్రగుప్తమౌర్యుని ప్రధానామాత్యుడగు చాణక్యుడు (కౌటిల్యుడు) రచించిన అర్థశాస్త్రగ్రంథమును గురించి నీకు చెప్పియుంటిని. ఈ గ్రంథమున అనేకవిషయములు చెప్పబడినవి—ఆ కాలమునాటి ప్రజలనుగురించియు, నాటి పరిపాలనాపద్ధతులనుగురించియు చెప్పబడినవి. క్రీస్తుపూర్వము నాల్గవ శతాబ్దిలో ఇండియాపరిస్థితులెట్లున్నవో తెలిసికొనుట కీగ్రంథము మిక్కిలి ప్రయోజనకరము. కిటికీ తెరచినట్లు ఇండియాస్థితిగతులు ఈ గ్రంథమువల్ల వెల్లడియగుచున్నవి. రాజులనుగురించియు, వారి విజయములనుగురించియు వ్రాసిన అతిశయోక్తులకన్న పరిపాలనావిశేషములను తెలుపు నిట్టి గ్రంథములు మన కెక్కువ సహాయకారులు.

మధ్యయుగములలోని ఇండియా స్వరూపమును కొంత గ్రహించుటకు పనికివచ్చు గ్రంథము వేరొకటి కలదు. అది శుక్రాచార్యుని నీతి

* శంకరాచార్యులు ప్రతిష్ఠాపనచేసిన మతము శైవము కాదు. అద్వైతము. —అనువాదకుడు.

సారము. ఇది అర్థశాస్త్రమంత మంచిగ్రంథము కాదు. అంత సహాయ కారియు కాదు. కాని దాని సహాయముతోను, కొన్ని శాసనముల సహాయముతోను, ఇతర వృత్తాంతముల సహాయముతోను క్రీస్తువెనుక తొమ్మిది పదిశతాబ్దులలో ఇండియాస్వరూపము గమనింతము.

"వర్ణమువలనగాని, పుట్టుకవలనగాని బ్రాహ్మణత్వము సిద్ధించదు" అని నీతిశాస్త్రము చెప్పుచున్నది. దీనినిబట్టి చూడ వర్ణవిభజనము పుట్టుకనుబట్టి చేయరా దనియు, సామర్థ్యమునుబట్టి చేయవలసియుండు ననియు తేలినది. మరల నీతిసార మిట్లు చెప్పుచున్నది: "ప్రభుత్వోద్యోగము లిచ్చునప్పుడు పనివానితనము, శీలము, సామర్థ్యములనే చూడవలెనుగాని కులమును, కుటుంబమును చూడరాదు." రాజు తన యభిప్రాయముల ప్రకార మాచరించుటకు వీలులేదు. ప్రజాభిప్రాయము ననుసరించియే నడువవలెను. "రాజుకన్నకూడ బలవత్తరమైనది ప్రజాభిప్రాయము. గడ్డిపోచలతో పేనిన వెంటి సింహమును బంధించగలదుగదా."

ఇవి యన్నియు చక్కని సిద్ధాంతములే. నేడుసైత మివి మంచి సిద్ధాంతములే. కాని ఆచరణలో పెట్టవలసివచ్చినప్పుడు మాత్ర మివి ప్రయోజనకరముగా నుండవు. సామర్థ్యమువల్లను, గుణమువల్లను ఒకడు వృద్ధిలోనికి రావచ్చును. కాని అత డాసామర్థ్యమును, గుణమును సంపాదించు టెట్లు? ఒక బాలుడుగాని, బాలికగాని చురుకుగా నుండవచ్చును. ఉచితవిద్యాశిక్షణ లున్నచో వారు తెలివితేటలు గలవారై సమర్థులగుదురు. అట్టి విద్యగాని, శిక్షణగాని ఇచ్చుటకు ఏర్పాటులు చేయకున్నచో ఆ బాలుడుగాని, బాలికగాని ఏమి చేయగలరు?

ఇట్లే ప్రజాభిప్రాయ మననేమి? ఎవరి అభిప్రాయము ప్రజాభిప్రాయముగా పరిగణింపబడును? తమ యభిప్రాయములను వెల్లడిచేయుటకు అధికసంఖ్యాకులగు శూద్రుల కర్హత యున్నదని నీతిసారకర్త బహుశా తలచలేదేమో? వారు గణనకు రాలేదు. ప్రజాభిప్రాయ మనగా బహుశా ఉన్నతవంశస్థులయొక్కయు, పాలకజాతులయొక్కయు అభిప్రాయముమాత్రమే.

అయినప్పటికిని హిందూదేశస్థుల రాజనీతిలో, మధ్యయుగము లందు, ఇదివరలోవలెనే నిరంకుశత్వమునకుగాని, రాజులు దైవాంశ సంభూతు లను భావనకుగాని స్థానము లేదు.

తరువాత రాజుయొక్క ఆలోచనసభనుగురించియు, కట్టడములు, ఉద్యానవనములు, వనములు పాలించు ఉన్నతోద్యోగులనుగురించియు, నగర జీవితనిర్మాణమునుగురించియు, గ్రామజీవితనిర్మాణమును (Organisation of town & village life) గురించియు, వంతెనలు, రేవులు, ధర్మసత్రములు, తోటలు, అన్నిటికంటెను పల్లెలకు, పట్టణములకు ప్రధానమైన మురుగుకాలువలను గురించియు ఈ గ్రంథమున చెప్పబడినది.

గ్రామవ్యవహారములపై సంపూర్ణాధికారము గ్రామపంచాయతీకుండెను. రాజుగారి ఉద్యోగస్థులు పంచాయతీసభ్యుల నధికముగా గౌరవించుచుండిరి. భూములను పంచిపెట్టుట, పన్నులను వసూలుచేయుట, గ్రామముతరపున ప్రభుత్వమునకు పన్నులు కట్టుట — ఈ పనులన్నియు పంచాయతీ చేయుచుండెను. ఈ పంచాయతీల పనులను తనిఖీచేయుటకు ఒక పెద్ద పంచాయతీ, లేదా మహాసభ ఉండెడివట. అవసరమైనప్పుడు పంచాయతీల వ్యవహారములలో జోక్యముకలుగజేసికొను హక్కు ఈ మహాసభ కున్నది. ఈ పంచాయతీలకు న్యాయవిచారణ చేయుటకును, ప్రజలను విచారించుటకును అధికారముండెను.

దక్షిణహిందూస్థానమందలి కొన్ని ప్రాచీనశాసనములలో పంచాయతీసభ్యుల నెన్నుకొను పద్ధతియును, వారి యోగ్యతలును, అనర్హతలును ఉదాహరింపబడినవి. ఏసభ్యుడైనను ప్రజాధనమునకు జమాఖర్చులు సరిగా చూపకున్న అతడు సభ్యుడుగా నుండదగడు. మరియొక చక్కని నిబంధన ఏమనగా—పంచాయతీసభ్యుల దగ్గరిబంధువు లెవ్వరును ఉద్యోగస్థులుగా నుండరాదు. ఈ నిబంధన మన శాసనసభలలోను, పురపాలక సంఘములలోను ప్రవేశపెట్టినచో ఎంత బాగుండును?

ఒక సంఘములో ఒక స్త్రీ సభ్యురాలుగా నున్నదట. దీనినిబట్టి

చూడ పంచాయతీలలోను, తత్సంఘములలోను స్త్రీలు సభ్యురాండ్రుగా నుండవచ్చునని తెలుచున్నది.

పంచాయతీలనుండి ఎన్నుకోబడిన సభ్యులతో సంఘము లేర్పరచు చుండిరి. ప్రతిసంఘమును ఒక సంవత్సరము పనిచేయును. ఒక సభ్యుడు అక్రమముగా ప్రవర్తించిన నతనిని వెంటనే తొలగించవచ్చును.

ఇట్టి గ్రామపరిపాలనాపద్ధతి ఆర్యరాజ్యపరిపాలనాపద్ధతికి పునాది. దీనివల్లనే దానికి బలము చేకూరెను. ఈ గ్రామసభలు తమ స్వాతంత్ర్య మును పట్టుదలతో కాపాడుకొనుచుండెను. పైనికు దెవ్వడును రాజిచ్చిన అనుమతిపత్రము లేనిదే గ్రామములో కాలుపెట్టరాదు. నీతిసారము చెప్పు వేరొక విషయ మేమనగా—ఒక ఉద్యోగస్థునిపై ఫిర్యాదుచేసినపక్షమున "రాజు ప్రజల పక్ష మవలంబించవలెనుగాని ఉద్యోగస్థుల పక్ష మవలం బించరాదు." అనేకమంది ఒక ఉద్యోగస్థునిపై ఫిర్యాదు చేసినచో అతనిని వెంటనే ఉద్యోగమునుండి తొలగించవలెను. ఈసందర్భమున నీతిసార మీవిధముగా చెప్పుచున్నది: "ఉద్యోగమదము తలకెక్కిన మత్తెక్కనివా రెవరు?" ఎంతటి వివేకముతో కూడిన మాటలు! నేడు మన దేశములో దుష్పరిపాలన చేయుచు, అక్రమముగా సంచరించు ఉద్యోగస్థుల మందలకు ముఖ్యముగా ఈమాట లన్వయించునని తోచుచున్నది.

శిల్పులు, వర్తకులు నివసించు పెద్ద పట్టణములలో వారు సంఘ ములుగా నేర్పడుచుండిరి. శిల్పసంఘములు, వడ్డీవ్యాపారసమితులు, వర్తకకూటములు ఈవిధముగా ఏర్పాటయ్యెను. మతసంఘములుకూడ ఏర్పాటైనవి. ఈ సంఘము లన్నియు తమ పట్టణవ్యవహారములందు జోక్యము కలిగియుండెను.

ప్రజలపై రాజువేయు పన్నులు తేలికగా నుండవలెనని నీతిసారము చెప్పుచున్నది. లేకున్న ప్రజ లా పన్నులు భరించలేకపోవచ్చును. లేదా చితికిపోవచ్చును. మాలకరి పుష్పములను, పత్రములను కోయుమాడ్కిని రాజు ప్రజలనుండి పన్నులు గ్రహించవలెను. "బొగ్గులకు బోలె మొద లంట ప్రజలను బొడువదగదు."

6

మధ్యయుగములలో ఇండియానుగురించి మనకు దొరికిన విషయము లింతే. ఇవి అసంపూర్ణముగా నున్నవి. గ్రంథములలో చెప్పిన సిద్ధాంతములప్రకారము ఆచరణలో పెట్టుచుండిరో, లేదో తెలిసికొనుట కష్టము. గ్రంథములలో చక్కని సిద్ధాంతములను, చక్కని అభిప్రాయములను వెల్లడిచేయుట సులభమే. వాటిని ఆచరణలో పెట్టుట కష్టము. ఆకాలమున ఆగ్రంథమునందలి సిద్ధాంతములను ఆచరణలో పూర్తిగా పెట్టకపోయినను గ్రంథములనుబట్టి ఆకాలపు అభిప్రాయము లెట్లుండెడివో తెలిసికొనవచ్చును. ఆ కాలమున రాజులును, పాలకులును ఎంతమాత్రము నిరంకుశులు కారని మనకు తెలియుచున్నది. ఎన్నుకోబడిన పంచాయతీలు వారి యధికారమును ఒక హద్దులో నుంచెను. ఆకాలమున పట్టణములలోను, పల్లెలలోను పరిపక్వమైన స్వపరిపాలనాపద్ధతి అమలులో నుండెననియు, కేంద్రప్రభుత్వము వీరి వ్యవహారములలో జోక్యము కలుగజేసికొనుచుండుట లేదనియు మనకు తెలియుచున్నది.

ప్రజల అభిప్రాయము లనియు, స్వపరిపాలన మనియు అంటిని. అనగా నా యభిప్రాయ మేమి? ఇండియాలో సంఘనిర్మాణము వర్ణవ్యవస్థపై ఆధారపడియుండెను. నీతిసారములో చెప్పినట్లు వర్ణవ్యవస్థ బిగిసియుండకపోవచ్చును. సామర్థ్యమును, గుణమును బట్టి అది నిర్ణీతము కావచ్చును. కాని ఆచరణలో అట్లు జరుగుట లేదు. పాలకజాతులు, లేదా వర్ణములు బ్రాహ్మణులును, క్షత్రియులును. యాజమాన్యమునకై వా రప్పుడప్పుడు కలహించుచున్నను తరుచుగా వారు సర్దుకొని, కలిసి పనిచేయుచుండిరి. ఇతరులను వా రణచిపెట్టిరి. కాలక్రమమున, వర్తకవ్యాపారములు వృద్ధియగుచుపోగా వర్తకజాతి ధనవంతమయ్యెను. పలుకుబడి సంపాదించెను. దానికి ప్రాముఖ్యము వచ్చుటతోడనే కొన్ని హక్కు లీయబడెను. వర్తకసంఘ (guilds) వ్యవహారములను దిద్దుటకు దానికి స్వేచ్ఛ కలిగెను. అయినప్పటికిని రాజ్యపరిపాలనమందు దానికి నిజమగు అధికార మెట్టిదియు లభించలేదు. శూద్రులన్ననో వారు మొదటి

షుండియు అడుగునపడియుండి సేవావృత్తి చేయుచుండిరి. వీరిక్రింద కూడ ఇతరు లుండిరి.

క్రిందివర్ణములవా రప్పుడప్పుడు పైకివచ్చుచుండిరి. శూద్రులు రాజు లగుటకూడ కద్దు. కాని ఇది అరుదుగా జరుగుచుండెను. సంఘములో పైకిలేచుటకు తరుచు జరుగు పద్ధతి ఏమనగా, ఒక అంతర్వర్ణమంతయును ఒక అడుగు ముందుకు నెట్టుకొనిపోవుట. తరుచుగా క్రొత్తతెగలు వచ్చి హిందూమతములో కలిసిపోవుచుండిరి. వారు కడవర్ణములో తొలుత చేరుదురు; వారు మెల్లమెల్లగా పైకిలేచుటకు పని చేయుచుందురు.

పడమటిదేశములలో నున్నట్లు ఇండియాలో కూలిపనులకు బానిసల నుపయోగించు పద్ధతి లేనప్పటికిని మన సంఘనిర్మాణమంతయు సోపానక్రమమున నుండెను. అనగా, ఒక వర్ణముమీద నొక వర్ణముండుట. అడుగుననున్న లక్షలాది జనులను పైతెగలవారు తమ లాభమునకై ఉపయోగించుకొనుచుండిరి. పైనున్నవారి బరువంతయును వీరు మోయవలసివచ్చుచుండెను. పైవర్ణములవా రీపద్ధతి చెక్కుచెదరకుండ చూచుచుండిరి. అడుగుననున్న ఈ అభాగ్యులకు విద్యాశిక్షణల నిచ్చి బాగుచేయుటకు బదులు తామే అధికారమునంతయును తమ చేతులలో పెట్టుకొనిరి. గ్రామపంచాయతీలలోమాత్రము రైతుమాట వినుచుండిరి. అతనిని ఉపేక్షించుటకు వీలులేకుండెను. కాని తెలివితేటలుగల బ్రాహ్మణులు కొందరు ఈ పంచాయతీలనుకూడ తమవశములో పెట్టుకొనియుండవచ్చును.

ఆర్యు లిండియాకు వచ్చి ద్రావిడులతో కలిసినది మొదలు మనము ప్రసంగించుకొనుచున్న మధ్యయుగములవరకు ప్రాచీనఆర్యరాజ్య పరిపాలనాపద్ధతియే సాగుచున్నట్లు తోచును. కాని ఈ పద్ధతి క్రమక్రమముగా నీరసించి చెడిపోవుచున్నట్లు కనిపించును. బహుశా దానికి వార్ధకము వచ్చుచున్నదికాబోలు. బహుశా బయటనుండి వచ్చిపడుచున్న దండ

యాత్రలు దానిని పేరసపెట్టియుండవచ్చును.

ప్రాతరోజులలో హిందూస్థానమున గణితశాస్త్రము (Mathematics) ఘనతవహించె నన్న మాట నీ కుత్సాహము కలిగించవచ్చును. గణితమున ఖ్యాతివహించినవారిలో నొక స్త్రీకూడ కలదు. ఆమెపేరు లీలావతి. లీలావతియు, ఆమెతండ్రి భాస్కరాచార్యలును, బహుశా బ్రహ్మ గుప్త దను మరియొకడును కలిసి దశాంశభిన్నపద్ధతి కనిపెట్టిరట. బీజగణితమునకుకూడ జన్మభూమి హిందూస్థాన మనియే చెప్పుదురు. ఇండియానుండి బీజగణిత మరేబియాకును, అచ్చటినుండి యూరోపునకును వెళ్ళెను. అల్జిబ్రా (బీజగణితము) అను మాట అరబ్బీభాషనుండి వచ్చినది.

## 46

# దివ్యమైన అంగ్‌కోరు: శ్రీవిజయు

మే 17, 1932

మన మిప్పుడు దూరహిందూస్థానమును—అనగా దక్షిణఇండియా ప్రజలు వలస(colonies)లేర్పరుచుకొన్న మలేసియా, ఇండోచీనాలను ఒకమారు దర్శింతము. ఈ వలసలు ఏవిధముగా ముందుగానే ఏర్పాటు చేయబడినవో ఇదివరలో చెప్పియుంటిని. ఏదో యొకవిధముగా వాటంతట అవి పెరిగినవి కా వీ వలసలు. ఒకేమారు అనేకస్థలములలో కావలెనని వలస లేర్పాటుచేసికొనుటకు ఆకాలపువారు అనేకపర్యాయములు సముద్రముపై ప్రయాణములు చేసియుండవలెను. సముద్రముపై ఓడలను నడుపు శక్తి ఆకాలపువారి కుండవలెను. క్రీస్తుశకము మొదటి, రెండవ శతాబ్దులలో నీవలసల స్థాపన ప్రారంభమైనదని నీ కిదివరలో చెప్పియుంటిని. అవి హిందూవలసలు. వాటికి దక్షిణహిందూస్థానముయొక్క పేర్లున్నవి. కొన్నిశతాబ్దు లైనపిమ్మట బౌద్ధము క్రమముగా వ్యాపించెను. చివరకు హిందూమలేసియాదేశము దాదాపు అంతయు బౌద్ధమయ్యెను.

మొదట ఇండోచీనాకు పోదము. మొట్టమొదటి వలసకు చంపా నామ ముంచబడినది. అది అన్నాములో నున్నది. మూడవ శతాబ్దిలో నచ్చట పాండురంగ మను నగరము వృద్ధినందుచుండెను. రెండువందల సంవత్సరముల తరువాత కాంభోజమహానగరము అభివృద్ధినందియుండెను. ఆ నగరమునిండ గొప్ప భవనములు, రాతితో కట్టిన ఆలయములు వెలసి యుండెను. ఈ హిందూస్థానీయుల వలసలందంతట దివ్యమైనసౌధములు లేచుచుండెను. శిల్పులు, వాస్తుశాస్త్రజ్ఞులును ఇందుకొరకై ఇండియానుండి పోయియుందురు. అక్కడ భవనములను నిర్మించునప్పుడు వారు హిందూ సంప్రదాయములనే అవలంబించుచుండిరి. వేర్వేరు రాజ్యములును, ద్వీపములును భవననిర్మాణవిషయమున పోటీలుపడుచుండిరి. దీనికి పర్యవసానము చక్కని శిల్పకళాభివృద్ధి.

ఈ వలసలలో నివసించు ప్రజలు సహజముగా సముద్రసంచారులు (Seafarers). ఈ ప్రదేశములను చేరుటకు వారో, వారి పూర్వులో సముద్రమును దాటివచ్చిరి. వారిచుట్టును సముద్ర మున్నది. సముద్ర సంచారులు తరుచుగా వర్తకములో దిగుదురు. కాబట్టి వీరును వర్తకులైరి. తమ సరుకును సముద్రమును దాటించి వేర్వేరు ద్వీపములకును, పడమటనున్న ఇండియాకును, తూర్పున నున్న చీనాకును కొంపోవుచుండిరి. మలేసియాలోని వివిధరాజ్యముల నీ వర్తకు లధికముగా తమ పలుకుబడిలో నుంచుకొనిరి. తరుచుగా ఈ రాజ్యములు తమలో తాము కలహించుకొనుచుండెను. యుద్ధములు చెలరేగుచుండెను. హత్యలు జరుగుచుండెను. ఒక్కొక్కప్పుడు ఒక హిందూరాజ్యము ఒక బౌద్ధరాజ్యముతో యుద్ధమునకు దీకొనుచుండెను. అయితే ఆ కాలములో ఈ యుద్ధములు జరుగుటకు నిజమగు కారణము వర్తకపు పోటీ లనియే తోచుచున్నది. ఈ రోజులలో పెద్దజాతులు తాము తయారుచేయుచున్న వస్తువు లమ్ముకొనుటకు మార్కెట్టులను సంపాదించుటకై ఒకరితో నొకరు యుద్ధమునకు దిగుచున్నట్లే.

ఎనిమిదవ శతాబ్దివరకు, అనగా సుమారు 300 సంవత్సరములు కాలముపాటు ఇండోచీనాలో హిందూరాజ్యములు మూడుండెను. తొమ్మిదవ శతాబ్దిలో, జయవర్మ యను గొప్ప పాలకుడు ఈ మూటిని ఏకముచేసి ఒక సామ్రాజ్యమును నిర్మించెను. అతడు బహుశా బౌద్ధుడు. అతడు అంగ్‌కోరువద్ద తన రాజధానిని నిర్మించ ప్రారంభించెను. అతని తరువాత వచ్చిన యశోవర్మ దానిని పూర్తిచేసెను. ఈ కంబోడియా సామ్రాజ్యము సుమారు 400 సంవత్సరము లుండెను. అది మిక్కిలి శక్తివంతము, వైభవోపేతము అయియుండెనని చెప్పుదురు. అంగ్‌కోరు థామ్ అను పేరు గల రాజధానీనగరము తూర్పుప్రాంతమునం దెల్లెడల "దివ్యమైన అంగ్‌కోరు" అను పేరు వడసెను. ఆ నగరమున పదిలక్షలకు పైగా ప్రజలు నివసించుచుండిరి. సీజరుల రోమునగరముకంటెను అది పెద్దది. దాని సమీపమున అంగ్‌కోరువాట్ అను పేరు గల దివ్యమగు ఆలయ ముండెను. పదమూడవ శతాబ్దిలో కంబోడియాను అన్నివైపుల నుండి శత్రువులు ముట్టడించుచుండిరి. తూర్పున అన్నామ్‌ప్రజలు దాని నెదుర్కొనిరి. పడమట అచ్చటి తెగలవారే ఎదుర్కొనిరి. ఉత్తరమున మంగోలులచే తరుమగొట్టబడిన షాన్‌ప్రజలు తప్పించుకొనిపోవుటకు వేరుమార్గము లేక కంబోడియాపై బడిరి. ఆత్మరక్షణకొరకునిరంతరము ఈ శత్రువులతో యుద్ధములు చేసిచేసి ఈ రాజ్యము విసిగిపోయినది. అయినప్పటికిని అంగ్‌కోరునగరము తూర్పుప్రాంతమున మహావైభవోపేతమగు నగరములలో నొకటిగా విలసిల్లుచుండెను. 1297 సంవత్సరమున కంబోడియారాజుకొలువును దర్శించిన చీనారాయబారి యొకడు అంచలి అద్భుతభవనములను అతిమాత్రముగ ప్రశంసించెను.

ఉన్నట్లుండి అంగ్‌కోరుకు ఒక మహావిపత్తు వాటిల్లెను. క్రీ. పె. 1300 ప్రాంతమున మీకాంగ్‌నదీముఖము, విలిచిన బురదమన్నుచేత మూసికొనిపోయెను. నదీజలము ముందుకు ప్రవహించలేకపోయెను. అది వెనుకకు పొర్లి మహానగరముచుట్టు నున్న ప్రదేశము నంతయు ముంచి

వేసెను. ఫలవంతమగు భూము లన్నియు పనికిమాలిన ఊషరక్షేత్రము లైనవి. నగరవాసులకు తిండి దొరకక మాడిపోయిరి. వా రచ్చట నిలువ లేక, నగరమును వదలి దేశాంతరము పోవలసివచ్చెను. ఈవిధముగా దివ్యమైన అంగ్‌కోరు ప్రజలచే విడిచిపెట్టబడినది. నగరమంతయు అడవి క్రమ్మినది. కొంతకాలముపాటు దివ్యభవనములు వన్యమృగముల కాశ్రయమిచ్చెను. తుదకు అరణ్య మా భవనములను దుమ్ముచేసెను. అరణ్యమే అప్రతిహతముగ తన ప్రభుత్వమును సాగించెను.

కంబోడియారాజ్య మీ విపత్తునుండి ఎంతకాలమునకును తేరుకొన లేకపోయెను. కాలక్రమమున నది కూలిపోయినది. అది ఒక రాష్ట్రము మాత్ర మైనది. ఒకప్పుడు సయామును, ఒకప్పుడు అన్నామును దానిని పాలించుచుండెను. అంగ్‌కోరు మహాదేవాలయశిథిలములు నేడుకూడ గత కాలవైభవమును ప్రకటించుచున్నవి. ఆకాలమున దాని సమీపమున వైభవోపేతమగు మహానగర ముండెను. దూరదేశములనుండి వర్తకులు తమ సరకులను దానివద్దకు కొనితెచ్చుచుండిరి. అందలి ప్రజలును, శిల్పులును తయారుచేసిన చక్కని వస్తువుల నది ఇతరదేశములకు పంపుచుండెను.

సముద్రమున కావల ఇండోచీనాకు సమీపమందే సుమత్రాద్వీప ముండెను. క్రీ. వె. మొదటి శతాబ్దిలోనో, రెండవ శతాబ్దిలోనో దక్షిణ ఇండియానుండి వచ్చిన పల్లవులే తొలివలసల నచ్చటకూడ ఏర్పాటు చేసికొనిరి. ఇవి క్రమముగా పెరిగెను. మలయాద్వీపకల్పము తొలి రోజులలోనే సుమత్రారాజ్యభాగమైనది. తరువాత చాలకాలమువరకు సుమత్రాచరిత్రయు, మలయాద్వీపకల్పచరిత్రయు మిక్కిలి సన్నిహిత ముగా నుండెను. ఈ రాజ్యమునకు రాజధాని శ్రీవిజయమహానగరము. ఇది సుమత్రాద్వీపములో పర్వతములమధ్య నున్నది. దీనికి పాలంబాంగు నదీముఖమున నొక రేవుపట్టణ ముండెను. అయిదవ, లేదా ఆరవ శతా బ్దిలో సుమత్రాద్వీపమున ప్రధానమతము బౌద్ధము. సుమత్రాద్వీపము

బౌద్ధమతప్రచారమును చురుకుగా చేయుచుండెను. తత్ఫలముగా తుదకు హిందూమలేసియా దాదా పంతయు బౌద్ధమతమును స్వీకరించెను. ఈ సుమత్రాసామ్రాజ్యమునే పై కారణమువల్ల శ్రీవిజయబౌద్ధసామ్రాజ్య మనిరి.

శ్రీవిజయ వృద్ధినందుచుపోయెను. ఆ సామ్రాజ్యమున సుమత్రా మలయాద్వీపములే కాదు. బోర్నియో, ఫిలిప్పయినుద్వీపములు, సెలబీస్, జావాలో సగము, ఫార్మోజాద్వీపములో (ఇది ఇప్పుడు జపానువారిది) సగము, సింహళము, దక్షిణ చీనాలో కాంటనువద్ద ఒక రేవుపట్టణము సమేతము చేరియుండెను. బహుశా సింహళమున కెదురుగా దక్షిణ ఇండియాఅగ్రమున నున్న రేవుపట్టణముకూడ అందులో చేరియుండ వచ్చును. దీనివిబట్టి చూడ అది మలేసియానంతయు నాక్రమించి విస్తరించిన సామ్రాజ్యమని తెలిసికొనవచ్చును. ఈ హిందూస్థానపువలసలలో ప్రధానవృత్తులు—వర్తకవ్యాపారములును, నౌకానిర్మాణమును. ఆ కాలమునాటి చీనాఅరబ్బీగ్రంథకర్తలు సుమత్రాప్రభుత్వమున కొదిగియున్న రేవుపట్టణములయొక్కయు, వలసలయొక్కయు పేర్లు పెద్ద పట్టికలుగా వ్రాసియుండిరి. ఆ పట్టికలు పెరుగుచుపోయెను.

నేడు బ్రిటిషుసామ్రాజ్యము ప్రపంచమందంతట వ్యాపించినది. ప్రతిచోటను దానికి రేవుపట్టణములును, ఓడలలోనికి బొగ్గునెక్కించుకొనుట కుపయోగించు పట్టణములును గలవు. జిబ్రాల్టరు, సూయజ్ కాలువ (ఇది అధికముగా బ్రిటిషుస్వాధీనమున నున్నది),ఏడెన్, కొలంబో, సింగపూరు, హాంకాంగు మున్నగునవి. గత 300 సంవత్సరముల నుండియు బ్రిటిషువారు వర్తకజాతిగా నుండిరి. వారి వర్తకమును, బలమును సముద్రాధిపత్యముపై నాధారపడియుండెను. కావున ప్రపంచమందంతటను అనుకూలస్థలములందు వారికి రేవుపట్టణములును, బొగ్గు నింపుకొనుట కుపయోగించు పట్టణములును. కావలసివచ్చెను శ్రీవిజయ సామ్రాజ్యముకూడ వర్తకముపై ఆధారపడిన సముద్రాధిపత్యము గల జాతి. కావుననే దానికి కాలునిలుపగల తావులందెల్ల రేవుపట్టణము లుండెను.

ఇంతే కాదు. సుమత్రారాజ్యమందలి వలసల విశిష్టలక్షణము ఏమనగా.—చుట్టుపట్టుల నున్న సముద్రము అందుబాటులో నుండుతావులలో ఆ వలసలు జాగ్రత్తగా ఏర్పాటుచేయబడినవి. సముద్రముపై ఆధిపత్యము సడలకుండ ఒకరికొకరు సహాయముచేసికొనుటకై ఈ వలసలు తరుచు జంటలుగా కూడ నుండెను.

ఇప్పుడు మహానగరమైన సింగపూరు తొలుత సుమత్రాకు వలస పోయిన జనుల నివాసభూమియే. సింగపూ రను పేరు అచ్చముగా మన దేశపు పేరు—సింగపురము. సింగపూరుకు ఎదురుగా నున్న జలసంధికి ఆవలితట్టునకూడ సుమత్రాప్రజలు వేరొక వలస నేర్పరచుకొనిరి. ఒక్కొక్కతూరి వారు జలసంధి కడ్డముగా ఇనుపగొలుసును లాగిపట్టి, పన్నులిచ్చువరకు నావలను పోనిచ్చువారు కారు.

శ్రీవిజయసామ్రాజ్యము బ్రిటిషుసామ్రాజ్యముకన్న చిన్నదైనను దానివంటిదే. కాని బ్రిటిషుసామ్రాజ్యము బ్రతుకబోవు కాలమునకన్న నది ఎక్కువకాలము బ్రతికినది. అది పదకొండవ శతాబ్దిలో మహోచ్చస్థితి నందెను. సరిగా ఈకాలమునందే దక్షిణహిందూస్థానమున చోళసామ్రాజ్యము వర్ధిల్లుచుండెను. కాని చోళసామ్రాజ్యముకన్న నది ఎక్కువ కాలము జీవించెను. చాలకాలమువరకు ఈ రెండు సామ్రాజ్యములును అన్యోన్యముగా నుండెను. కాని రెండును సాహసులగు సముద్రసంచారులే. ఉభయులకును బలమగు నౌకాదళము లుండెను. దూరదేశములవరకు వ్యాపించిన వర్తకసంబంధము లుండెను. పదకొండవ శతాబ్దితొలిరోజులలో వారిద్దరికి వివాదము సంభవించెను. యుద్ధము తటస్థించెను. చోళరాజగు ప్రథమరాజేంద్రుడు సముద్రముమీద దండయాత్ర సాగించెను. శ్రీవిజయ సామ్రాజ్యము ఓడిపోయెను. కాని ఈ ఓటమినుండి వెంటనే తేరుకొనెను. పదకొండవ శతాబ్దాదియందు చీనాచక్రవర్తి సుమత్రారాజుకు కొన్ని కంచుగంటలను కానుకగా సమర్పించెను. తిరిగి సుమత్రారాజు ముత్యములను, దంతమును, సంస్కృతగ్రంథములను చీనాచక్రవర్తికి కానుకగా

నంపెను. ఆ పంపిన వాటిలో హిందూదేశలిపితో బంగారుపళ్లెముమీద చెక్కబడిన ఒక లేఖకూడ కలదని చెప్పుదురు.

శ్రీవిజయసామ్రాజ్యము చిరకాలము వర్ధిల్లెను. రెండవ శతాబ్దిలో ప్రారంభమై, అయిదారుశతాబ్దులవరకు వర్ధిల్లి, తరువాత బౌద్ధమతమును స్వీకరించెను. పిమ్మట పదకొండవ శతాబ్దివరకు క్రమముగా అవిచ్ఛిన్నముగా పెరిగెను. మరి 300 సంవత్సరములవరకు మలేసియావర్తక వ్యాపారములను తన స్వాధీనమునం దుంచుకొని మహాసామ్రాజ్యమై నిలిచెను. క్రీ. వె. 1377 సంవత్సరమున తుద కది వేరొక ప్రాచీనపల్లవ వలసరాజ్యముచే కూలద్రోయబడెను.

శ్రీవిజయసామ్రాజ్యము సింహళమునుండి చీనాలోని కాంటన్ వరకు విస్తరించిన దని చెప్పియుంటిని. మధ్యనున్న ద్వీపములు పెక్కులు అందు చేరియుండెను. కాని ఒక చిన్నభాగమునుమాత్ర మది స్వాధీనము చేసికోలేకపోయెను. అది జావాతూర్పుభాగము. అది స్వతంత్రరాజ్యము గానే నిలిచిపోయెను. హిందూమతమునే అవలంబించియుండెను. అది బౌద్ధమతము స్వీకరించుట కంగీకరించలేదు. జావాపశ్చిమభాగము శ్రీవిజయసామ్రాజ్యమునకు చెందియుండ తూర్పుభాగము స్వతంత్రముగా నుండెను. తూర్పుజావాలోని ఈ హిందూరాజ్యముకూడ వర్తకరాజ్యమే. దాని యైశ్వర్యము వర్తకముమీదనే ఆధారపడియుండెను. సింగపూరును చూచి అది అసూయచెందియుండవచ్చును. ఏలయన దాని చక్కని ఉనికివిబట్టి అది గొప్ప వర్తకకేంద్ర మైనది. ఈవిధముగా శ్రీవిజయకును, తూర్పుజావాకును స్పర్ధలు పుట్టెను. ఇవి క్రమముగా శత్రుత్వములోనికి దిగెను. 12 వ శతాబ్దిమొదలు తూర్పుజావా శ్రీవిజయసామ్రాజ్యము నపహరించుచు వృద్ధినందెను. నే నిదివరలో చెప్పినట్లు 14 వ శతాబ్దిలో— క్రీ. వె. 1377 సంవత్సరమున—శ్రీవిజయసామ్రాజ్యము నది పూర్తిగా ఓడించెను. ఆ యుద్ధము మిక్కిలి క్రూరమైనది. జననష్ట మధికముగా నుండెను. శ్రీవిజయ అను నగరమును, సింగపూరును ధ్వంసముచేయ

బడినవి. ఈవిధముగా మలేసియామహాసామ్రాజ్యములలో రెండవ సామ్రాజ్యము—శ్రీవిజయసామ్రాజ్యము—అంతరించెను. దాని శిథిలములపై మూడవ సామ్రాజ్యము లేచెను. దాని పేరు మజ్జాపహిత్ సామ్రాజ్యము.

తూర్పుజావాప్రజలు శ్రీవిజయతో యుద్ధము చేసినప్పుడు మిక్కిలి క్రూరముగాను, అనాగరికముగాను ప్రవర్తించినప్పటికిని, ఆకాలమునకు సంబంధించిన జావాలోని పెక్కు గ్రంథములనుబట్టి చూడగా ఈ హిందూ రాజ్యము నాగరీకమున నత్యున్నతస్థితి నందియుండె నని తెలియుచున్నది. అది నౌకానిర్మాణమునందును, ముఖ్యముగా ఆలయములను నిర్మించుటయందును పేరుపొందినది. 500 పైగా ఆలయము లందుండెను. వీటిలో రాతి చెక్కడపు పనితనమును ప్రదర్శించు మాదిరులు ప్రపంచమందలి ఉత్తమశిల్పముతో సరితూగుచున్నట్లు చెప్పుదురు. ఈ మహాదేవాలయములు పెక్కులు ఏడవ శతాబ్దిమధ్యకాలమునకును, పదవ శతాబ్ది మధ్యకాలమునకును నడుమనున్నకాలములో, అనగా క్రీ. వె. 650, 950 సంవత్సరముల మధ్యలో నిర్మింపబడినవి. ఇట్టి ఉన్నతదేవాలయములను నిర్మించుటకు శిల్పులను, వాస్తుశాస్త్రజ్ఞులను ఇండియానుండియు, తత్సమీపదేశములనుండియు జావాపాలకులు పిలిపించియుండవలెను. తరువాత వచ్చు ఒక జాబులో జావాయొక్కయు, మజ్జాపహిత్‌యొక్కయు చరిత్రల ననుసరింతము.

ఈ సందర్భమున నొక విషయమును చెప్పవలెను. తొలి పల్లవ వలసలద్వారా బోర్నియో, ఫిలిప్పయినులు లిపినేర్చుకొనెను. దురదృష్టవశమున ప్రాచీనలిఖిత గ్రంథము లనేకములను స్పెయినుదేశస్థులు నాశనముచేసిరి.

ఇస్లాం పుట్టుటకుముందు తొలిరోజులలో ఈ ద్వీపములం దంతటను అరబ్బులు వలసలేర్పరచుకొనిరన్న మాట మరువకుము. వారు మంచి వర్తకులు. ఎక్కడ వర్తకముండునో అక్కడికి వారు పోవుచుండిరి.

# రోము మరల అంధకారములో మునుగుట

మే 19, 1932

ప్రాచీనచరిత్రచిక్కుదారులగుండ నిన్ను సరిగా తీసికొనిపోవునేర్పు నాకు లేదేమో అని తరుచు అనిపించుచున్నది. నేనే దారితప్పినప్పుడు నిన్నెట్లు సరిగా తీసికొనిపోగలను? నీకు కొద్దిగానైన సహాయకారిగా నుండగలనేమో అని మరల అనుకొందును. అందువల్ల ఈ జాబులను వ్రాయుచునేయుంటిని. నాకేమో ఈ జాబులు వ్రాయుట లాభకరముగానే ఉన్నది. అమ్మా, ఈ జాబులు వ్రాయుచు నిన్ను తలచుకొనుచున్నప్పుడు నేను కూర్చున్నగదిలో నీడలో ఉష్ణోగ్రత (Temperature in the shade) 112 డిగ్రీలనియు, వేడిగాడ్పులు వీచుచున్నవనియు మరచిపోదును. బారెల్లీ జిల్లాచెరసాలలో నేనుంటినన్న సంగతికూడ అప్పుడప్పుడు మరచుచుందును.

క్రిందటిజాబు నిన్ను మలేసియాలోనికి పదునాల్గవ శతాబ్దాంతము వరకు తీసికొనిపోయినది. కాని ఉత్తరహిందూస్థానములో మనము శ్రీహర్షునికాలము—అనగా ఏడవశతాబ్ది—దాటిపోనేలేదు. యూరోపులో మన మింకను వెనుకబడియున్నాము. ప్రతియొక ప్రదేశమునుగురించియు కాలమానముతప్పకుండ చెప్పుట చాల కష్టము. అట్లు చేయుటకే ప్రయత్నించుచుంటినికాని ఒక్కొక్కమారు అంగ్‌కోరు శ్రీవిజయలను గూర్చి చెప్పుచున్నప్పుడువలె వాటి కథ పూర్తిచేయవలె నను ఉద్దేశముతో కొన్ని వందలసంవత్సరములకాలముముందుకుత్రోసికొనిపోవుదును. కంబోడియా సామ్రాజ్యము, శ్రీవిజయసామ్రాజ్యము తూర్పున వర్ధిల్లుచున్నకాలమున ఇండియా, చీనా, యూరోపులలో అనేకవిధములగు మార్పులు కలుగుచుండె నన్నమాట మరువకుము. నా వెనుకటిజాబులో ఇండోచీనా, మలేసియాల వేయిసంవత్సరముల చరిత్ర ఇమిడ్చితి నన్నమాటకూడ

మరువకుము. ఈ దేశములు ఆసియా, యూరోపుచరిత్రలకు సంబంధము లేకుండ వేరుపడియుండుటచేత వాటి చరిత్రలను ఎవరును ప్రస్తావించరు. కాని వాటి చరిత్రలు ఫలవంతమైనవి; దీర్ఘమైనవి. ఎట్లు ఫలవంతమనగా-పరాక్రమకార్యములను సాధించుటయందు, వర్తకమునందు, కళలలో, వాస్తుశాస్త్రము (Architecture) నందు అవి ప్రధానముగా ప్రసిద్ధిగన్నవి. అట్టిచరిత్రలు చదువదగినవే. హిందూదేశస్థుల కాచరిత్రలు ప్రీతికరములు. ఆ దేశము లిండియాలో ఒక భాగమన్నమాటే. ఇండియానుండి పురుషులును, స్త్రీలును తూర్పుసముద్రములను దాటి హిందూసంస్కృతిని, నాగరికతను, కళలను, మతమును ఆ దేశములకు కొనిపోయిరికదా.

కాన మనము మలేసియాలో ముందుకుపోయినప్పటికిని ఏడవ శతాబ్దిలోనే యున్నాము. మన మింకను అరేబియా పోవలసియున్నది. ఇస్లాం ఆగమనమునుగూర్చి విచారింపవలసియున్నది. యూరోపు ఆసియాలలో ఇది తెచ్చిన గొప్పమార్పులను చూడవలసియున్నది. మరియు యూరోపులో ఏమి జరుగుచున్నదియు తెలిసికోవలెను.

ఇంకొకమారు యూరోపును చూతము. అందుకై కొంచెము వెనుకకు పోవుదము. బోస్ఫరస్‌తీరమున, బైజాంటియం ఉండు చోట రోమను చక్రవర్తియగు కాన్‌స్టాంటైను కాన్‌స్టాంటినోపు లను నగరమును ప్రతిష్ఠించె నన్నమాట జ్ఞాపకమున్న దనుకొందును. క్రొత్తరోము అని పేర్కొనబడు ఈ నగరమున కతడు ప్రాతరోమునుండి తన రాజధానిని మార్చెను. త్వరలోనే రోమకసామ్రాజ్యము రెండు చీలిక లయ్యెను. రోము రాజధానిగా గల పడమటి సామ్రాజ్యము ఒకటి; కాన్‌స్టాంటినోపిల్ రాజధానిగా గల తూర్పుసామ్రాజ్యము ఒకటి. తూర్పుసామ్రాజ్యమెన్నియో కష్టములను, ఎందరో శత్రువులను ఎదురుకొనవలసివచ్చెను. అయినను, ఆశ్చర్యమేమన, అది 1100 సంవత్సరముల కాలము శతాబ్ది తరువాత శతాబ్దిచొప్పున తన జీవితమును పొడిగించుకొనుచుపోయెను. తుదకు దానిని తురుష్కులు తుదముట్టించిరి.

పడమటిసామ్రాజ్య మావిధముగా బ్రతుకలేదు. రోమకనామమున కెంతో ప్రభావమున్నను, పశ్చిమప్రపంచమునం దంతటను రాజధానియగు రోము ఎంతోకాలము ప్రబలమైయున్నప్పటికిని అది అతిశీఘ్రముగా కూలిపోయినది. ఉత్తరతెగల దాడుల నది తట్టుకొనలేకపోయినది. క్రీ వె. 410 సంవత్సరమున, గాతుల తెగకు చెందిన అలరిక్ అనువాడు ఇటలీకి దండులతో వచ్చి రోమును స్వాధీనముచేసికొనెను. తరువాత "వాండలులు" వచ్చి రోమును కొల్లగొట్టిరి. వాండలులు జర్మానిక్ తెగవారు. వారు ఫ్రాన్సు, స్పెయినుదేశములను దాటి, ఆఫ్రికా ప్రవేశించి, కార్తేజి శిథిలములపై నొక రాజ్యము స్థాపించిరి. ప్రాచీనకార్తేజినగరమునుండి వారు సముద్రములు దాటి రోమును స్వాధీనముచేసికొనిరి. ప్యూనిక్ యుద్ధములలో విజయముకాంచిన రోముపై, ఆలస్యముగానయిననేమి, కక్ష సాధించినట్లయినది.

ఈ కాలముననందే మధ్యఆసియానుండియో, మంగోలియానుండియో తొలుత వచ్చిన హూణులు ప్రబలులైరి. వారు దేశద్రిమ్మరులు. వారు డాన్యూబ్ నదికి తూర్పునను, తూర్పురోమకసామ్రాజ్యమునకు ఉత్తరమునను, పశ్చిమమునను నివాసము లేర్పరచుకొనిరి. వారి నాయకుడగు "అట్టిలా" క్రింద వారు కయ్యమునకు కాలుద్రవ్వుచుండిరి. కాన్స్టాంటినోపుల చక్రవర్తియు, అతని ప్రభుత్వమును వారిని చూచి ఎప్పటికప్పుడు భయపడుచుండిరి. "అట్టిలా" వారిని బెదరించి తొందరపెట్టి పెద్ద మొత్తములను లాగుచుండెను. తూర్పుసామ్రాజ్యమును పరాభవముపాలుచేసిన పిమ్మట "అట్టిలా" పశ్చిమసామ్రాజ్యముపై దెబ్బతీయవలె నని నిశ్చయించెను. అతడు గాలుదేశముపై దాడివెడలి దక్షిణఫ్రాన్సులోని పలు పట్టణములను విధ్వంసముచేసెను. సామ్రాజ్యసేన లతనితో సరితూగలేవు కాని, జర్మానిక్ తెగలు (రోమనులు బర్బరు లని పేర్కొనువారు) హూణుల దండయాత్రకు భయపడి సామ్రాజ్యసేనలతో చేరిరి. ఇట్లు ఫ్రాంకులు, గాతులును సామ్రాజ్యపక్షమున చేరి "అట్టిలా" నాయకత్వము

క్రిందనున్న హూణులతో ట్రోయస్‌వద్ద గొప్పయుద్ధము చేసిరి. 150,000కు పైగా ఈ యుద్ధమున జననష్ట మయ్యెను. "అట్టిలా" ఓడిపోయెను. మంగోలియన్ హూణులు తిరుగగొట్టబడిరి. ఇది క్రీ. వె. 451 సంవత్సరమున జరిగెను. ఓడిపోయినప్పటికిని "అట్టిలా" యుద్ధాసక్తితోనే ఉండెను. అతడు ఇటలీకి వెళ్ళి ఉత్తరముననున్న అనేకపట్టణములను దోచుకొని తగులబెట్టెను. త్వరలోనే అతడు మరణించెను. క్రౌర్యము, నిర్దయ అతనిలో మూర్తీభవించెనని కలకాలము చెప్పుకొందురు. నేటికి కూడ, దయాదాక్షిణ్యములు లేని వినాశనము అతనిలో మూర్తీభవించినట్లు చెప్పుకొందురు. అతని మరణానంతరము హూణులు వెమ్మదిపదిరి. తరువాత దేశములో స్థిరపడి అక్కడ నివసించు ఇతర జనులతో కలిసిపోయిరి. సుమారు ఈ కాలమునందే ఇండియాకు శ్వేతహూణులు వచ్చి రన్నమాట నీకు జ్ఞాపకమున్న దనుకొందును.

నలువది సంవత్సరములైన పిమ్మట థియోడొరిక్ అను పేరు గల గాత్ రోముకు రాజయ్యెను. అప్పుడే పశ్చిమసామ్రాజ్యము దాదాపు అస్తమించినది. కొద్దికాలమైన పిమ్మట జస్టినియన్ అను తూర్పుచక్రవర్తి తన సామ్రాజ్యములో ఇటలీని కలుపుకొనుటకు ప్రయత్నించి సఫలుడాయెను. ఇటలీని, సిసిలీని అతడు జయించెను. కాని కొద్దికాలములోనే అవి వీడిపోయెను. తూర్పుసామ్రాజ్యము ఆత్మరక్షణ చేసికొనుటలో పూర్తిగా నిమగ్నమాయెను.

ఏ తెగవారైనను త న్నెదిరించుటతోడనే రాజధానీనగరమగు రోమును, దాని సామ్రాజ్యమును అంతసులభముగా, అంత శీఘ్రముగా కూలిపోవుట ఆశ్చర్యము కాదా? రోము నిర్వీర్యముగా నైన నుండవలెను; లేదా వట్టి గుల్లవంటిదిగానైన నుండవలెను. బహుశా ఇదియే నిజమై యుండవచ్చును. చిరకాలమువరకు రోముయొక్క బలము దాని ప్రతిష్ఠలోనే ఉండెను. దాని గతచరిత్రనుబట్టి ఇతరజాతు లన్నియు అది ప్రపంచ నాయకత్వము వహించెనని తలచిరి. దానిని గౌరవముతో చూచుచుండిరి.

అంతే కాదు. ఒకవిధముగా మూఢవిశ్వాసముతోకూడిన భయముతోకూడ చూచుచుండిరి. ఈవిధముగా రోము పైకిచూచుటకు బలవత్తరమగు సామ్రాజ్యమునకు యజమానురాలుగాను, యథార్థమునకు ఎట్టిశక్తియు లేకుండను కాలక్షేపముచేసెను. పైకిచూచుటకు రో మెంతో శాంతముగా నుండెను. నాటకశాలలలో, ఆటస్థలములలో, బజార్లలో మనుష్యులు కిటకిటలాడు చుండిరి. కాని అది పతనోన్ముఖ మయియేయుండెను. అందుకు కారణము దుర్బలత్వము కాదు. సామాన్యజనుల బానిసత్వము, దుఃఖము పునాదిగా ధనవంతుల నాగరికత నది నిర్మించుటయే ఇందుకు కారణము. బీదల తిరుగుబాటునుగురించియు, అధికారము నెదుర్కొనుటనుగురించియు ఇదివరలో నీకు వ్రాసియుంటిని. క్రూరముగా అణచివేయబడిన ఒక బానిసతిరుగుబాటునుగురించికూడ వ్రాసియుంటిని. ఈ తిరుగుబాట్లనుబట్టి రోములోని సంఘనిర్మాణ మెంత కుళ్లిపోయినదో తెలియుచున్నది. దా నంతట అదే శిథిలమైపోవుటకు సిద్ధముగా నున్న కాలములో ఉత్తర తెగలవారు, గాతులు మున్నగువారు ఇందుకు సహాయభూతు లైరి. అందువల్లనే వారి నెదిరించి నిలుపుట కెవరును సిద్ధముగా లేకుండిరి. రోమను రైతు తన దుర్భరస్థితికి కుమిలిపోవుచుండుటచే ఎట్టి మార్పు వచ్చినను అతనికి సమ్మతముగానే ఉండెను. బీదకూలీలు, బానిసలు అంతకన్న నీచస్థితిలో నుండిరి.

పశ్చిమరోమకసామ్రాజ్య మంతరించుటతోడనే పడమట నున్న క్రొత్తజాతులు ముందుకు రాదొడగెను. వారు గాతులు, ఫ్రాంకులు మున్నగువారు. ఈ పేర్లతో నిన్ను ఇబ్బందిపెట్టను. నేటి పాశ్చాత్యయూరోపియనుల, అనగా జర్మనులు, ఫ్రెంచివారు మున్నగువారి పూర్వీకులే వీరు. మెల్లగా ఈ దేశములు యూరోపులో స్వరూపము దాల్చుచుండెను. కాని అప్పటి నాగరీకము తగ్గుస్థాయిలో నుండెను. సామ్రాజ్యరాజధానియగు రోము అంతరించుటతోడనే దానితోకూడ రోము భోగభాగ్యములుకూడ అంతరించినవి. పైమెరుగులతో నొప్పిన రోమునాగరికత ఒక్కదినములో

అదృశ్యమయ్యెను. అప్పటికే దాని వేళ్లు ఎండుకువచ్చినవి. ఈవిధముగా మానవజాతి వృద్ధిజెందుటకు బదులు వెనుకకుపోయిన వింతదృశ్యము మనకు కన్నులకు కట్టినట్లు కనిపించుచున్నది. ఇండియాలో, ఈజిపులో, చీనాలో, గ్రీసులో, రోములో, ఇతరప్రదేశములలో ఈవిధముగానే సంభవించినది. ఎంతో కష్టముతో జ్ఞానమును, అనుభవమును సంపాదించి, సంస్కృతిని, నాగరికతను నిర్మించుకొన్నపిమ్మట అవి ఆగిపోవలసివచ్చు చున్నది. ఆగిపోవుటయే కాదు, వెనుకకు పోవుటకూడ తటస్థించుచున్నది. గతకాలముపై తెర మూసికొనివచ్చినట్లు తోచును. జ్ఞానానుభవములు అప్పుడప్పుడు లీలగా కనిపించుచున్నను, జ్ఞానానుభవము లను పర్వత మును మరల ఎక్కవలసియున్నది. బహుశా ప్రతిపర్యాయమును మానవుడు మొదటికంటె ఒక్కింత ఎత్తుగా పోవునేమో. ఇందుచే తరువాత ఎక్కు వారికి కొంచెము సులభముగానుండును. ఎవరెస్టుశిఖరమును చేరుటకు ఒకదాని వెనుక నొకటిగా ఎన్నోయాత్రలు చేసిరి. మొదటి యాత్రకన్న రెండవ యాత్రలో శిఖరమునకు మరికొంత సమీపమునకు పోదురు. అచిరకాలముననే అత్యున్నత శిఖరమును చేరగల్గుదురు. ఇట్లే నాగరిక విషయమునకూడ జరుగునని తోచును.

యూరోపులో ఇట్లు అంధకారము ప్రవేశించినది. అంధకారయుగ ములు ప్రారంభమయ్యెను. జీవితము మోటుగాను, అనాగరికముగాను ఉండెను. విద్య లేదనియే చెప్పవలెను. కలహమే ప్రధానవృత్తియు, వినోదమును అయినది. సోక్రటీసు, ప్లేటోల కాలములు సుదూరమైపోయి నట్లు తోచుచుండెను.

ఇంతవరకును పశ్చిమసామ్రాజ్యమునుగురించి చెప్పితిని. ఇప్పుడు తూర్పుసామ్రాజ్యమును చూతము, కాన్స్టాంటైను చక్రవర్తి క్రైస్తవ మతమును అధికారరీత్యా రాజమతముగా అంగీకరించెను. అతని తరువాత వచ్చిన చక్రవర్తులలో జూలియన్ అనువాడు క్రైస్తవము నంగీకరించక తిరస్కరించెను. వెనుకకు బోయి ప్రాచీనదేవులను, దేవతలను పూజింప

గోరెను. కాని అతడు కృతకృత్యుడు కాలేదు. ప్రాతదేవుళ్ళ, దేవతల కాల మైపోయినది. క్రైస్తవము చాల బలవత్తరముగా నుండుటచే ప్రాతదేవుళ్ళ నంగీకరించ వీలులేకుండెను. క్రైస్తవులచే జూలియన్ "స్వమతత్యాగియగు జూలియన్" అను పేరు సంపాదించెను. చరిత్రలో ఈ బిరుద మాతనికి నిలిచిపోయెను.

జూలియన్‌తరువాత కొద్దికాలములోనే వేరొక చక్రవర్తివచ్చెను. అతడు జూలియనును పోలియుండలేదు. అతని పేరు థియోడోసియసు. అతనిని ఘను డందురు. ప్రాచీన దేవాలయములను, దేవుళ్ళయొక్కయు, దేవతలయొక్కయు ప్రతిమలను వినాశనముగావించుటచే నితడు ఘనుడయ్యె ననుకొందును. క్రైస్తవులు కానివారితో నతడు కక్షకట్టుటయే కాదు, అతని అభిప్రాయముప్రకారము శాస్త్రసమ్మతముగా నడచుకొనని క్రైస్తవులతోకూడ నతడు కక్షకట్టెను. అతడు ఇష్టపడని మతమునుగాని, అభిప్రాయమునుగాని అతడు సహించియుండడు. థియోడోసియసు పశ్చిమ తూర్పురోమకసామ్రాజ్యములను రెంటిని కలిపి రెంటికిని తాను చక్రవర్తి అయ్యెను. ఇది క్రీ. వె. 392. సంవత్సరములో రోముపై బర్బరులు దాడులు సలుపకముందే జరిగెను.

క్రైస్తవమతము వ్యాపించుచునే యుండెను. దాని కిప్పుడు పోరాటము అక్రైస్తవులతో కాదు. క్రైస్తవమతశాఖలు ఒకటితో నొకటి పోరాడుకొనుచుండిరి. వారు వెల్లడిచేసిన అసహనము విస్మయముకలిగించుచుండెను. ఉత్తర ఆఫ్రికా పడమటిఆసియా అంతటిలోను, యూరోపులోను అనేక రణరంగములు వెలసెను. ఇందు క్రైస్తవులు తమ సోదరక్రైస్తవులకు మతముయొక్క నిజస్వరూపమును నచ్చజెప్పుటకై దెబ్బలు, కర్రలు మున్నగు శాంతమార్గముల నవలంబించిరి.

క్రీ. వె. 527 మొదలు 565 వరకు జస్టినియను కాన్‌స్టాంటినోపులులో చక్రవర్తిగా నుండెను. నే నిదివరలో చెప్పినట్లు అతడు ఇటలీనుండి గాథులను తరిమివేసెను. కొంతకాలమువరకు ఇటలీ, సిసిలీలు తూర్పు

సామ్రాజ్యభాగము లై యుండెను. కొన్నాళ్ల పిమ్మట గాతులు ఇటలీని తిరిగి స్వాధీనము చేసికొనిరి.

శాంక్ట సోఫియా అను అందమగు క్రైస్తవాలయమును జస్టినియన్ కాన్స్టాంటినోపులులో కట్టించెను. బైజాంటియన్ ఆలయములలో ఇది మిక్కిలి చక్కనిదని నేటికి కూడ పరిగణింపబడుచున్నది. అప్పుడున్న శాసనముల నన్నింటిని సమర్థులగు న్యాయవాదులచే ఒక్కచో చేర్పించి వాటి నొక పద్ధతిలో పెట్టించెను. తూర్పుసామ్రాజ్యమునుగురించిగాని, అందలి చక్రవర్తులనుగురించిగాని నాకు తెలియుట కెంతో ముందు నేను చదువవలసివచ్చిన "ఇన్స్టిట్యూట్సు ఆఫ్ జస్టీనియన్" అను న్యాయ శాస్త్రగ్రంథమునుబట్టి జస్టీనియన్ పేరు నాకు తెలియవచ్చినది. కాన్స్టాంటినోపులులో జస్టీనియన్ ఒక విశ్వవిద్యాలయమును స్థాపించెను. కాని ప్లేటో స్థాపించినట్టియు, వేయిసంవత్సరములు పనిచేసినట్టియు పరిషత్తును-అనగా ఏథెన్సులోని తత్వశాస్త్రపాఠశాలలను మూయించెను. తన సిద్ధాంతములే సత్యమని చెప్పు మతమునకు తత్వశాస్త్రము (Philosophy) ప్రమాదకరము. అది మనుష్యులను స్వతంత్రాలోచనలు చేయునట్లు పురికొల్పును.

మన మిప్పుడు ఆరవ శతాబ్దివద్దకు వచ్చితిమి. రోమును, కాన్స్టాంటినోపులును క్రమక్రమముగా ఒకదానికొకటి దూరముగా పోవుచుండెను. ఉత్తరజర్మానిక్ తెగలవారికి రోము స్వాధీనమయ్యెను. రోమనుసామ్రాజ్య మను పేరు ధరించిన గ్రీకుసామ్రాజ్యమునకు కాన్స్టాంటినోపులు కేంద్ర మయ్యెను. రోము క్రమముగా శిథిల మగుచుండెను. రోము ఉచ్చగా నున్న రోజులలో బర్బరులని ఎవరిని తిట్టెనో వారే దానిని జయించిరి. ఆ బర్బరుల నాగరీకమే వీరి కబ్బుటచే వీరు అధఃపతనమగుచుండిరి. కాన్స్టాంటినోపులు ఒకవిధముగా ప్రాచీనసంప్రదాయముల ననుసరించి పోవుచున్నను నాగరీకవిషయమున పతనమగుచుండెను. క్రైస్తవతెగలు ఆధిక్యమునకై పోరాడుచుండిరి. తురుష్కస్థానము, చీనా, అబిసీనియాల

పర్యంతము వ్యాపించిన తూర్పుక్రైస్తవమునకు కాన్‌స్టాంటినోపులుతోను, రోముతోను సంబంధము జారిపోవుచుండెను. అంధకారయుగములు ప్రారంభమయ్యెను. ఇంతవరకు విద్య ప్రాచీనభాషాగ్రంథములను చదువుటయే—అనగా గ్రీకుగ్రంథములనుబట్టి వ్రాసిన ప్రాచీనలాటిన్‌గ్రంథములను చదువుటయే. కాని గ్రీకు, ప్రాచీనగ్రీకుగ్రంథములలో దేవుళ్ల యొక్కయు, దేవతలయొక్కయు ప్రశంసకలదు. తత్వశాస్త్రప్రశంసలు కలవు. భక్తిపరులు, అసహిష్ణులు అగు తొలినాటి క్రైస్తవులు పఠించుటకీ వాఙ్మయ మనుచితముగా నున్నట్లు భావింపబడినది. కాన అట్టి చదువులకు ప్రోత్సాహము లేకుండెను. కాన విద్య వెనుకబట్టెను. దానితోపాటు కళలును వెనుకబట్టెను.

కాని విద్యను, కళను నిలుపుటకు క్రైస్తవము కొంత కృషి చేసెను. బౌద్ధసంఘమువంటి మఠములు స్థాపించబడినవి. అవి శీఘ్రముగా వ్యాప్తిజెందెను. ఈ మఠములలో నొక్కొక్కప్పుడు ప్రాచీనవిద్యలు పోషింపబడెను. ఎన్నో శతాబ్దుల తరువాత సౌందర్యముతో వికసించ నున్న కళకు పునాదు లీమఠములలో వేయబడెను. ఈ మఠమందలి సన్యాసులు విద్యాజ్యోతిని, కళాజ్యోతిని ఆరిపోకుండ మందముగా వెలుగ నిచ్చుచుండిరి. అవి అంతరించకుండ వా రిట్లు కృషిచేసిరి. కాని ఆ జ్యోతి ఇరుకుప్రదేశమునకుమాత్రము వెలుగు నిచ్చుచుండెను. బయట నున్నది అంధకారమే.

క్రైస్తవమతము తొలిరోజులలో వింతభావ మొకటి ప్రజలలో ప్రబలియుండెను. మతావేశముచే పలువురు ఎడారులకును, నిర్జనప్రదేశములకును, మనుష్యసంచారము లేని తావులకును పోయి అక్కడ వన్యస్థితిలో నివసించుచుండిరి. వారు తమ దేహములను హింసలపాలు చేయుచుండిరి. స్నానము చేయుట మానిరి. ఎంత బాధ సహించుటకు వీలున్నదో అంత బాధ సహించుటకు ప్రయత్నించుచుండిరి. ముఖ్యముగా ఈజిప్టులో ఇట్టి పరిస్థితులు ఉండెను. అచ్చట పలువురు ఇట్టి తాపసులు

ఎడారిలో నివసించుచుండిరి. వారి అభిప్రాయము బహుశా ఎంత బాధపడి, ఎంతగా స్నానాదులు మానివేసిన అంతగా పవిత్రత అబ్బునని. అం దొక తపస్వి స్తంభముమీద అనేకసంవత్సరములు కూర్చుండెనట! కాలక్రమమున నీ తాపసుల సంఖ్య తగ్గిపోయెను. భోగము లనుభవించుట పాపకార్యమని పెక్కురు భక్తులగు క్రైస్తవులు చిరకాలమునుండి నమ్ముచుండిరి. బాధలు పడుట యను భావన క్రైస్తవమన స్తత్వము నంటియుండెను. నేటి యూరోపులో ఇట్టి మన స్తత్వము లేదనియే చెప్ప వచ్చును. సరిగదా ఆక్కడ ప్రతివారును ఇక్కడికిని, అక్కడికిని పిచ్చిగా పరుగెత్తుచు కులాసాగా కాలముగడపుటకు తంటాలుపడుదురు. ఇట్లు పరుగెత్తుటవల్ల కలుగు ఫలితము అలసట, నిస్త్రాణయేగాని కులా సాగా కాలక్షేపము చేయుట ఉండదు.

ఇండియాలో నేడుసైతము ఈజిప్టులోని క్రైస్తవతాపసులు ప్రవర్తించినప్రకారము ప్రవర్తించువా రుండుట మనము చూచుచున్నాము. కొందరు ఒకచేతిని పైకెత్తి అట్లే ఉంచుదురు. అది క్రమముగా శుష్కించి పోవును. కొందరు మేకులమీద కూర్చుందురు. ఇట్టి తెలివితక్కువపను లనేకము చేతురు. కొందరు బహుశా అమాయకులను మోసగించి ధనము సంపాదించుటకు అట్లు చేతు రనుకొందును. మరికొందరు ఆవిధముగా చేసిన తమకు పవిత్రత వచ్చునని భావింతు రనుకొందును. మంచిపని చేయుటకు పనికిరాకుండ దేహమును బాధపెట్టుట కోరదగినపని కాదుకదా.

బుద్ధునిగురించి చెప్పిన ఒక కథ నాకు జ్ఞాపకము వచ్చుచున్నది. ఈ కథకూడ మన యువాన్‌ఛాంగ్ గ్రంథమునుండియే తెలిసికొంటిని. బుద్ధుని శిష్యుడు-యువకు డొకడు తపస్సు చేయుచుండెను. బుద్ధు డతని నడిగెను: "నాయనా, నీవు గృహస్థుగా నున్న రోజులలో వీణవాయించుట నేర్చుకొంటివా?" అని. "నేర్చుకొంటి" నని అతడు బదులుచెప్పెను. బుద్ధు డిట్లనెను: "అయితే, వీణను పురస్కరించుకొని నీ కొక ఉపమానమును చెప్పెదను వినుము. తీగలు మిక్కిలి బిగువుగా నున్నచో స్వరము సరిగా

పలుకదు. తీగలు చాల వదులుగా నున్నచో స్వరము శ్రావ్యముగాను, మనోహరముగాను ఉండదు. బిగువుగాక, వదులుగాక సరిగా నున్నచో స్వరములు శ్రావ్యముగా పలుకును. ఆవిధముగానే దేహముకూడ. దేహమును బాధపెట్టినయెడల దానికి అలసట వచ్చును. మనస్సుకు స్తిమితము తప్పును. దేహమును లాలించిన చిత్తవృత్తులు కట్టుతప్పును. సంకల్పము సన్నగిల్లును."

# 48

# ఇస్లాం ఆగమనము

మే 21, 1932.

అనేకదేశముల చరిత్రయును, అనేకరాజ్యములయొక్కయు సామ్రాజ్యములయొక్కయు ఒడుదొడుకులను మనము గమనించియున్నాము. ప్రపంచమున దూరప్రాంతములకు నావికులను,వర్తకులను పంపిన దేశము అరేబియా యని తెలిసికొంటిమిగాని ఇతరత్ర దాని కథ మనము స్పృశించలేదు. దేశపటములో చూడుము.పడమర ఈజిప్టు ఉన్నది.ఉత్తరమున సిరియా ఇరాకు లున్నవి. దీనికి కొంచెము తూర్పుగా పర్షియా, ఇరాను లున్నవి. కొంచెము ఎగువను వాయవ్యముగా ఆసియామైనరు, కాన్స్టాంటినోపులు లున్నవి. గ్రీసు దూరములో లేదు. ఇండియాసముద్రమున కావల ఆ తట్టున నున్నది. చీనా, దూరప్రాచ్యములను మినహాయించినచో ప్రాచీన నాగరికతలకు సంబంధించినంతమట్టుకు అరేబియా మధ్యస్థముగా నున్నది. ఇరాకులో టైగ్రీసు, యూఫ్రటీసు నదీతీరములయందు గొప్ప నగరములు లేచినవి. ఈజిప్టులో అలెగ్జాండ్రియా, సిరియాలో డమాస్కసు, ఆసియామైనరులో ఆంటియోక్ పట్టణములు లేచినవి. అరబ్బీ దేశస్థుడు మంచి బాటసారి, వర్తకుడు. ఈ పట్టణముల కతడు తరుచు పోయియుండవలెను. అయినను చరిత్రలో అరేబియా ప్రసిద్ధికెక్కలేదు.

పొరుగుదేశములలో నున్నట్లు అచ్చట నాగరికము హెచ్చుస్థితిలో లేదని తోచును. ఇతరదేశములను జయించుట కది పూనుకొనలేదు. దానిని లొంగదీయుటయును సులభముకాదు.

అరేబియా ఎడారిదేశము. ఎడారులందును, పర్వతములందును జనించినవారు కష్టము లోర్చుకొను దార్ఢ్యవంతులు. వారు స్వేచ్ఛను ప్రేమింతురు. వారిని లొంగదీయుట సులభము కాదు. అది ధనవంత మగు దేశము కాదు. సామ్రాజ్యకారులను, విజయశీలులగు పరదేశ వీరులను ఆకర్షించుట కా దేశమున నేమియు లేదు. రెండు చిన్నపట్ట ణములు మాత్రము అందున్నవి: సముద్రతీరమున నున్న మక్కా, యత్రిబ్ పట్టణములు. ఇక మిగిలినవి ఎడారిలో కట్టిన ఇండ్లు. ఆ దేశ ప్రజలు అధికముగా "బెడోయిన్సు." వీరినే బద్దూ లందురు—అనగా "ఎడారి నివాసు"లని అర్థము. నిరంతరము వారి ననుసరించియుండు సహచరులు—శీఘ్రగాములగు ఒంటెలను, అందమగు గుర్రములును, ఎంత కష్టమునైనను ఓర్చుకొనగల శక్తియున్న గాడిదలుసైతమును, ఇతరదేశములలోవలెగాక ఆ దేశములో గాడిదతో పోలికగాంచుట స్తోత్రముగానే భావింతురు. ఎడారిదేశములో జీవితము కష్టములతో కూడియుండును. ఇతరప్రదేశములందుకన్న ఆ ప్రదేశములలో బలము, ఓర్పు ఎక్కువగా అవసరము.

ఆ దేశజనులు అభిమానులు. ఇంతలో వారికి కోపము వచ్చును. ఈ ఎడారిజనులు కలహప్రియులు. వారు తెగలుగాను, కుటుంబములు గాను నివసించుచుండిరి. ఈ తెగలును, కుటుంబములును ఒకదానితో నొకటి పోరాడుచుండెను. సాలు కొకమారు వారు సంధిచేసికొని అంద రును కలిసి మక్కాకు యాత్రార్థమై పోవుచుండిరి. మక్కాలో వారి దేవుళ్ళ ప్రతిమ లనేక ముండెను. ఆ ప్రతిమలను వారు పూజించుచుండిరి. అంతేకాదు. అక్కడ నున్న ఒక పెద్ద నల్లరాతినికూడ వారు కొలుచు చుండిరి. ఆ రాతి పేరు కాబా.

వారిది దేశద్రిమ్మరిబ్రతుకు. వారికి కులపెద్దలుకూడ ఉండెడివారు. మధ్య ఆసియాలోను, ఇతరప్రదేశములందును గల ఆదిమతెగలు నగర వాసము, నాగరీకము అలవరుచుకొనుటకు పూర్వము ఎట్టి బ్రతుకు బ్రతుకు చుండిరో వీరుకూడ అట్లే బ్రతుకుచుండిరి. అరేబియాచుట్టును లేచిన సామ్రాజ్యములు అరేబియాను తమ సామ్రాజ్యములో చేర్చుకొనుచుండిరి. కాని అది నామమాత్రమే. దేశద్రిమ్మరి ఎడారితెగలను లొంగదీయుట కష్టము. పాలించుటయును కష్టమే.

ఒకమారు, నీకు జ్ఞాపకమున్నదో లేదో, చిన్న అరబ్బీరాజ్యము సిరియాలోని పాల్మైరాలో తలయెత్తెను. క్రీస్తువెనుక మూడవశతాబ్దిలో కొద్దికాల మది ఒక వెలుగు వెలిగెను. ఇదైనను అరేబియాకు బయటనే జరిగినది. తరములపాటు బెడోయినులు ఎడారిబ్రతుకులు బ్రతుకుచుండిరి. అరబ్బుల నావలు వర్తకమునకు పోవుచుండెను. ఎట్టిమార్పులు లేకుండ అరేబియా సాగిపోవుచుండెను. కొందరు క్రైస్తవులైరి. కొందరు యూదులైరి. కాని పెక్కురు తమ 360 ప్రతిమలను, మక్కాలోని నల్ల రాతిని కొలుచుచు అట్లే ఉండిరి.

ఇతరదేశములలో నేమి జరుగుచున్నదో తెలిసికొనుటకు వీలులేని స్థితిలో నుండి, దీర్ఘయుగములపాటు నిద్రమత్తులో నున్న ఈ అరబ్బీ జాతి ఒక్కసారి హఠాత్తుగా మేల్కొని, ప్రపంచము ఉలిక్కిపడి తబ్బి బ్బగురీతిగా దారుణశక్తిని ప్రదర్శించుట ఒక పెద్ద వింత. అరబ్బుల చరిత్ర, వారు త్వరత్వరగా ఆసియా, యూరోపు, ఆఫ్రికాదేశములలో వ్యాపించుట, వారు గొప్ప సంస్కృతి నాగరీకముల నభివృద్ధిపరచుట చరిత్రలోని ఆశ్చర్యకరమగు విషయములలో నొకటి.

అరబ్బులను మేల్కొల్పినది ఇస్లాం అను నూతనశక్తి, లేదా భావన. అది వారిని ఆత్మవిశ్వాసముతోను, శక్తితోను నింపినది. క్రీ. వె. 570 సంవత్సరమున మక్కాలో జన్మించిన మహమ్మదను నూతన ప్రవక్తచే స్థాపించబడిన మతము ఇస్లాం. అతడు శాంతజీవనము గడపు

చుండెను. తోటివారి కత దన్న ఇష్టమును, నమ్మకమును. కావుననే అతనిని "అల్—అమీన్" అనగా విశ్వాసపాత్రుడు అందురు. అతడు తన నూతనమతమును బోధించనారంభించినపుడు—ముఖ్యముగా మక్కా లోని ప్రతిమాపూజను ఖండించినప్పుడు పెద్ద గోల పుట్టెను. మక్కా నుండి అతడు తరుమగొట్టబడెను. ఎట్లో ప్రాణములతో తప్పించుకొని అతడు బయటపడెను. అన్నిటికంటె ప్రధానముగా అతడు నొక్కి వక్కాణించిన విషయము ఇది—దేవు డొక్కడే; మహమ్మదు దేవుని ప్రవక్త.

తనవారిచేతనే మక్కానుండి తరుమగొట్టబడి యత్రిబ్‌పట్టణమున కొందరు మిత్రుల, ఉపకారుల యొద్ద తలదాచుకొనెను. మక్కానుండి చేసిన యీ పలాయనమునకు అరబ్బీభాషలో హిజ్రట్ అందురు. మస్లిం సంవత్సరము ఈ తేదీనుండి — క్రీ. వె. 622 — ప్రారంభించుచున్నది. హిజరీపంచాంగము చాంద్రమానము ననుసరించును. అనగా చంద్ర గతినిబట్టి దానిని గుణింతురు. కాన నది సౌరమానసంవత్సరముకన్న 5, 6 దినములు తగ్గిపోవును. హిజరీనెలలు సంవత్సరమందలి వేర్వేరు కాలము లలో ఎప్పుడును ఒకేసారి రావు. ఒక నెల ఈసంవత్సరమున శీతకాలములో పడిన అదేనెల కొన్నిసంవత్సరము లైనపిమ్మట నడువేసంగిలో పడును.

ఇస్లాంమతము హిజ్రట్‌పలాయనముతో, క్రీ. వె. 622 సంవత్స రమున ప్రారంభించెనని చెప్పవచ్చును. ఒకవిధముగా అది అంతకు పూర్వమందే ప్రారంభమాయెను. యత్రిబ్‌పట్టణము మహమ్మదు నాహ్వా నించెను. అతని రాకకు గౌరవసూచకముగా దాని పేరు "మదీనట్—ఉన్—నబీ" (ప్రవక్తనగరము)గా మార్చబడినది. ఇప్పు డా నగరమును మదీనా, లేదా మెదీనా అని అందురు. మహమ్మదు కుపకారముచేసిన మదీనాప్రజలను అన్సార్—అనగా ఉపకారులు అందురు. ఈ యుప కారుల సంతతివారు ఈ బిరుదమును చూచి గర్వింతురు. నేడుకూడ వారు దానిని వాడుచున్నారు.

ఇస్లాంయొక్కయు, అరబ్బులయొక్కయు విజయయాత్రలను పరిశీ

లించుటకు ముందు ప్రపంచ మీకాలమున నెట్లున్నదో ఒక్కమారు చూతము. రోము కూలిపోయినదని ఇప్పుడే తెలిసికొంటిమి. ప్రాచీన గ్రీకు—రోమనునాగరికత అంతమొందెను. అది నిర్మించిన సంఘము తారుమారయ్యెను. ఉత్తరయూరోపియన్ తెగలవారు ఇప్పుడిప్పుడే ప్రాముఖ్య మందుచుండిరి. రోమునుండి క్రొత్తవిషయములను నేర్చు కొన యత్నించుచు వారు నిజముగా క్రొత్తమాదిరి నాగరీకమును నిర్మించుచుండిరి. కాని అది ఇంకను ప్రారంభదశయం దుండెను. దాని ఛాయ లింకను కనిపించుటలేదు. ఈవిధముగా "ప్రాత" యంతరించినది. "క్రొత్త" యింకను దానిస్థానము నాక్రమించలేదు. కాన యూరోపులో అంధకారము మిగిలెను. దాని తూర్పుకొనను, వర్ధిల్లుచున్న తూర్పు రోమకసామ్రాజ్య మున్న మాట వాస్తవమే. అప్పటికికూడ కాన్‌స్టాంటి నోపులు వైభవోపేతమగు మహాపట్టణము. యూరోపులో పట్టణము లన్నింటికన్న గొప్పది. క్రీడారంగములో ఆటలు, సర్కసులు జరుగు చుండెను. ఆడంబరము, పటాటోపము అధికముగా నుండెను. అయి నప్పటికిని సామ్రాజ్యము నీరసపడుచుండెను. పర్షియాలోని సస్సనీదు లతో నిరంతరయుద్ధములు జరుగుచుండెను. పర్షియారాజగు రెండవ ఖుస్రూ కాన్‌స్టాంటినోపులునుండి దాని రాజ్యభాగమును కొంత గ్రహించెను. నామమాత్ర మతడు అరేబియాపై ఆధిపత్యమును ప్రక టించెను. ఖుస్రూ ఈజిప్టునుకూడ జయించి కాన్‌స్టాంటినోపులువరకు తన సేనలను నడిపించుకొనిపోయెను. కాని గ్రీకుచక్రవర్తి హిరాక్లియస్ అతని నచ్చట ఓడించెను. పిమ్మట తన పుత్రుడు "కవాధ్"చే ఖుస్రూ హత్యచేయబడెను.

దీనినిబట్టి పడమట యూరోపును, తూర్పున పర్షియాయును దుస్థితిలో నున్నట్లు నీవు గ్రహించియుందువు. దీనికి సాయము క్రైస్తవ శాఖల అన్యోన్యకలహములు నిరంతరము చెలరేగుచుండెను. పడమ టను, ఆఫ్రికాలోను భ్రష్టమగు జగడగొండి క్రైస్తవము వర్ధిల్లుచుండెను. పర్షియాలో జొరాష్ట్రియనుమతము రాజ్యభాగమై యుండెను. ప్రజలపై

నది బలవంతముగా పులుమబడినది. కాన యూరోపులోను, ఆఫ్రికా లోను, పర్షియాలోను ఉన్న సామాన్యప్రజలకు నాటిమతములన్న మొగముమొత్తినది. సరిగా ఈకాలమునందే, ఏడవ శతాబ్ది తొలిరోజులలో యూరోపులో మహామారి ప్రవేశించి లక్షలకొద్ది ప్రజలను తన పొట్ట బెట్టుకొన్నది.

ఇండియాలో హర్షవర్ధనుడు పరిపాలన సాగించుచుండెను. ఇతని కాలమునందే యువాన్‌ఛాంగు ఇండియాను దర్శించెను. హర్షుని కాలమున ఇండియా శక్తివంతమగు జాతిగా నుండెను. కాని వెంటనే ఉత్తర హిందూస్థానమున విభేదములు పుట్టుటచే దుర్బలమయ్యెను. ఇంకను తూర్పున చీనాలో గొప్పదియగు టాంగ్‌రాజవంశ మిప్పుడే పరిపాలనకు దొరకొనెను. క్రీ. వె. 627 సంవత్సరమున టాయిచుంగ్ అను గొప్ప చక్రవర్తి సింహాసన మెక్కెను. అతని కాలమున చీనాసామ్రాజ్యము పడమట కాస్పియన్‌సముద్రమువరకు విస్తరించియుండెను. మధ్య ఆసియాలోని పట్టణము లనేక మాతని సార్వభౌమత్వ మంగీకరించి కప్పములు చెల్లించెను. ఈ మహాసామ్రాజ్యమున కంతకును కేంద్రప్రభుత్వ మున్నట్లు తోచదు.

ఇస్లాం జన్మించినప్పుడు ఆసియా యూరోపు లిట్టి స్థితిలో నుండెను. చీనా శక్తివంతముగా నుండెనుగాని దూరముగా నుండెను. ఇండియా కొంతకాలముపాటు శక్తివంతముగానే ఉండెను. కాని చాలకాలమువరకు ఇండియాతో ఎవరును కలహములు పెట్టుకోలేదని ముందుముందు తెలిసి కొందము. యూరోపును, ఆఫ్రికాయును నీరసించి దుర్బలముగా నుండెను.

పలాయనము చేసిన ఏడుసంవత్సరములలో మహమ్మదు మక్కాకు దాని యజమానిగా తిరిగివచ్చెను. ఇంతకుముందే మదీనానుండి అతడు ప్రపంచమందలి రాజులకును, పాలకులకును ఒక్క దేవుని, అతని ప్రవక్తను అంగీకరించమని ఆజ్ఞాపత్రముల నంపెను. కాన్‌స్టాంటినోపులు చక్రవర్తి హిరాక్లియస్ సిరియాలో పర్షియనులపై దాడులు సాగించు చున్నకాలమున ఈ ఆజ్ఞాపత్రము నందుకొనెను. పర్షియారాజు అందుకొనెను.

చీనాలోని టాయిమంగుకూడ అందుకొనెనని చెప్పుదురు. త మ్మాజ్ఞాపించ సాహసించిన ఈ అజ్ఞాతపురుషు డెవడా యని ఈ రాజులును, పాలకులును ఆశ్చర్యమందియుండురు. ఈ ఆజ్ఞాపత్రములను పంపుటనుబట్టి మహమ్మదుయొక్క సంపూర్ణఆత్మవిశ్వాసమును, తన ప్రచారముపై అతనికున్న విశ్వాసమును మనము తెలిసికొనవచ్చును. ఈ విశ్వాసమును, శ్రద్ధను తన వారి కాత డీయగలిగెను. వీటితో వారి నావేశపరుల జేసెను. వారికి అనునయమిచ్చెను. అంత ప్రసిద్ధులు కాని ఈ ఎడారిప్రజలు అప్పటికి తెలిసిన సగముప్రపంచమును జయించగలిగిరి.

శ్రద్ధయు, ఆత్మవిశ్వాసమును గొప్ప గుణములు. ఇస్లాం వారికి భ్రాతృత్వసందేశమునుకూడ నిచ్చెను. ముస్లిములైనవారందరును సమానులని ఆ సందేశము. ప్రజాస్వామికలక్షణము కొంత ప్రజలకు తెలియవచ్చెను. ఆనాటి భ్రష్టమగు క్రైస్తవముతో పోల్చిచూచిన ఈ భ్రాతృత్వసందేశము అరబ్బులకే కాదు, వారు దర్శించిన అనేకదేశములలోని ప్రజలకు బాగుగా నచ్చియుండును.

క్రీ. వె. 632 సంవత్సరమున హిజ్రట్‌కు పదిసంవత్సరముల తరువాత. మహమ్మదు మరణించెను-అంతఃకలహములు పెట్టుకొని పోరాడు అరబ్బీతెగలవారిని అత డొక జాతిగా చేయగలిగెను. ఒక సత్కార్యమును గూర్చి ఉత్సాహపూరితు లగునట్లు చేసెను. అతనితరువాత అతని కుటుంబములోనివాడగు అబుబకిర్ అనునతడు నాయకుడయ్యెను. ఈ నాయకునకే కాలీఫా, కాలిఫ్ అని పేరు. సభచేసి ఒకవిధమగు ఎన్నికల ద్వారా పరంపరగా వచ్చు నాయకుల నెన్నుకొనుచుండిరి. రెండుసంవత్సరము లైనపిమ్మట అబుబకిర్ చనిపోయెను. అతనితరువాత ఓమరు వచ్చెను. ఓమరు పదిసంవత్సరములపాటు కాలీఫాగా నుండెను.

అబుబకిరును, ఓమరును గొప్ప పురుషులు. అరబ్బులయొక్కయు, ఇస్లాంయొక్కయు గొప్పతనమునకు వారు పునాదులు వేసిరి. కాలీఫాలుగా నున్న కాలములో వారు మతాధికారులును, రాజకీయనాయకులునుకూడ— అనగా ఒకరే రాజును, పోపును అన్నమాట. ఉన్నతస్థితియం దున్నప్పటి

కిని, వారి రాజ్యము నానాటికి శక్తివంత మగుచున్నప్పటికిని వా రెంతో నిరాడంబరముగా జీవించుచుండిరి. ఆడంబరమును, భోగములను వారు గర్హించుచుండిరి. ఇస్లాంలోని ప్రజాస్వామికమును వారు అక్షరాలా పాలించు చుండిరి. కాని వారిక్రింద పనిచేయు ఉద్యోగులును, అమీరులును పట్టు వస్త్రములు ధరించుచు భోగలాలసులై యుండదొడగిరి. అబుబకీరును, ఓమరును ఇట్టి ఉద్యోగులను చీవాట్లువేసినట్లును, శిక్షించినట్లును, వారి దూబరాకు విచారించినట్లును తెలుపు కథ లెన్నో ప్రచారములో నున్నవి. నిరాడంబరముగా కష్టపడి జీవనము చేయుటలోనే వారి బలమున్నదని వారి ఉద్దేశము. పర్షియన్ రాజాస్థానములందును, కాన్‌స్టాంటినోపులు రాజాస్థానములందును గల భోగజీవితముల నలవరచుకొన్నచో అరబ్బులు భ్రష్టులై, చ్యుతు లగుదురని వారు తలచిరి.

అబుబకిర్, ఓమరులు పరిపాలించిన 12 సంవత్సరముల కొద్ది కాలములోనే అరబ్బులు తూర్పురోమక సామ్రాజ్యమును, పర్షియాలోని సస్సనీదురాజును ఓడించిరి. క్రైస్తవులయొక్కయు, యూదులయొక్కయు పవిత్రక్షేత్రమగు జెరూసెలమును అరబ్బు లాక్రమించుకొనిరి. సిరియా అంతయును, ఇరాకును, పర్షియాయును నూతన అరేబియా సామ్రాజ్య భాగము లయ్యెను.

## 49

# స్పెయినునుండి మంగోలియావరకు అరబ్బులు జయించుట

మే 23, 1932

కొన్ని యితరమతములను స్థాపించినవారివలెనే మహమ్మదుకూడ తాత్కాలికసాంఘికాచారములపై తిరుగుబాటు చేసెను. నిరంకుశులగు రాజుల క్రిందను, అధికారమును చెలాయించు నిరంకుశులగు పురోహితులక్రిందను

క్రమ్గుచున్న పొరుగుదేశములలోని ప్రజలకు మహమ్మదు బోధించిన మతము నిరాడంబరముగాను, ఋజువుగాను ఉండుటవల్లను, ప్రజా స్వామికము, సమత్వము అందుండుటవల్లను బాగుగా నచ్చినది. ప్రాత పద్ధతులపై వారికి వెగటు పుట్టినది. మార్పు నంగీకరించు పరిపక్వస్థితి యందు వా రుండిరి. ఇస్లాంమతము అట్టిమార్పును వారి కిచ్చెను. అది కోరదగిన మార్పే. ఏలయన, వారిని అనేకవిధములుగా నది బాగుచేసెను. ప్రాచీనదురాచారములను పెక్కింటిని నాశనముచేసెను. ఇస్లాం తనతోకూడ ఎట్టి గొప్ప సాంఘికవిప్లవమును తేలేదు. అట్లు తెచ్చియుండినచో ప్రజాసామాన్యమును అధికారులు తమ లాభమునకై వినియోగించు దురభ్యాసమును కొంతవరకు తగ్గించియుండెడిది. కాని మస్లిములవిషయ మునమాత్రము ఇట్టి దురభ్యాసమును తగ్గించినది. వారందరును ఒకే గొప్పభ్రాతృవర్గమునకు చెందినవారని అనుకొనునట్లు చేసినది.

అరబ్బులు విజయపరంపరలు సాధించుచుపోయిరి. తరుచు వారు యుద్ధముచేయకుండనే విజయము నందిరి. వారి ప్రవక్త గతించిన 25 సంవత్సరములలో అరబ్బులు ఒకవైపు పర్షియానంతయును, సిరియాను, ఆర్మీనియాను, మధ్యఆసియాలో చిన్నభాగమును, పడమర ఈజిప్టును, ఉత్తర ఆఫ్రికాలోని చిన్నభాగమును జయించిరి. ఈజిప్టు బహుసులభముగా వారి వశమయ్యెను. అది రోమకసామ్రాజ్యమునకు లొంగియుండి ఎన్నో బాధలు పడుచుండుటయును, క్రైస్తవమతశాఖల కలహములును అందుకు కారణము. అరబ్బులు అలెగ్జాండ్రియాలోని ప్రసిద్ధపుస్తకభాండారమును తగులబెట్టి రను వదంతి కలదుకాని అది అసత్యమని నేడు తేలినది. అరబ్బులకు పుస్తకములన్న ప్రీతికాన వీ రట్టి దురాగతమును చేసియుండరు. కాన్‌స్టాంటినోపులుచక్రవర్తియగు థియోడోసియసునుగురించి ఇదివరలో కొంత చెప్పియుంటిని. ఆ భాండాగారమును కొంతభాగము తగుల బెట్టుటకు కారకుడతడై యుండును. పూర్వము జూలియస్‌సీజరుకాలమున ఒక ముట్టడిలో భాండాగార మొక భాగము నాశనమయ్యెను. ప్రాచీనగ్రీకు

పురాణగాథలనుగూర్చియు, తత్వశాస్త్రమును గూర్చియు వ్రాయబడిన ప్రాచీనక్రైస్తవగ్రీకుగ్రంథము లన్ని అతనికి కిట్టదు. అత డెంతో భక్తి గల క్రైస్తవుడు. ఈ గ్రంథముల నాతడు నీళ్లపొయ్యిక్రింద పెట్టించెనని చెప్పుదురు.

అరబ్బులు తూర్పుదిక్కుగాను, పడమరదిక్కుగాను విజయములను సాధించుచు పోవుచుండిరి. తూర్పున హిరాట్, కాబూలు, బాక్ వారికి వశమయ్యెను. వారు సింధునదిని, సింధుదేశమును చేరిరి. ఇవి దాటి వారిండియాకు పోలేదు. అనేకవందల సంవత్సరములవరకు వారు హిందూస్థానపాలకులతో అత్యంతమైత్రితో నుండిరి. పడమట వారు ముందుకు సాగిపోయిరి. వారి సేనాని ఓక్బా ఉత్తరఆఫ్రికాకు అడ్డముగా, నేడు మొరాకో అని చెప్పబడు దేశపు పడమటితీరమున నున్న అట్లాంటిక్ మహా సముద్రమువరకు వెళ్లెనని చెప్పుదురు. అతనికి సముద్రము అడ్డుగా వచ్చినందున ఆశాభంగము కలిగెను. అతడు వెళ్లగలిగినంతదూరము సముద్రములోనికి గుర్రము నెక్కి వెళ్లి పిమ్మట తన విచారమును భగవంతునిముందు వెళ్లబోసికొనెను. భగవంతుని పేరుతో జయించుటకు దిక్కున నిక దేశము లేదే యని విచారము.

మొరాకో ఆఫ్రికాలనుండి అరబ్బులు వెడల్పు తక్కువగానున్న సముద్రమును దాటి స్పెయిను, యూరోపు ప్రవేశించిరి. ప్రాచీనగ్రీకు లీ జలసంధిని "హెర్క్యులీసు స్తంభములు" అనెడివారు. యూరోపును చేరుటకు జలసంధిని దాటిన అరబ్బీసేనాని జిబ్రాల్టరులో దిగెను. ఈ పేరు అతనిని స్మృతికి తెచ్చునదే. అతని పేరు టరీక్. జిబ్రాల్టరు అసలు పేరు జబల్-ఉట్-టరీక్. అనగా టరీక్ శిల అని యర్థము. స్పెయిను అచిరకాలముననే వారి వశమయ్యెను. పిమ్మట అరబ్బులు దక్షిణ ఫ్రాన్సులోనికి వచ్చిపడిరి. ఇట్లు మహమ్మదు గతించిన సుమారు నూరు సంవత్సరములలో అరబ్బీసామ్రాజ్యము దక్షిణఫ్రాన్సు, స్పెయినునుండి ఉత్తరఆఫ్రికా కడ్డముగా సూయజ్‌వరకును, అరేబియా, పర్షియా, మధ్య

ఆసియాం కడ్డముగా మంగోలియాపొలిమేరలవరకును వ్యాపించెను. సింధుదేశమును మినహాయించినచో ఇండియా ఆ సామ్రాజ్యములో చేర లేదు. రెండువైపులనుండి యూరోపు అరబ్బులచే ఎదుర్కొనబడు చుండెను—కాన్స్టాంటినోపులువద్ద ప్రత్యక్షముగాను,ఆఫ్రికాద్వారా ఫ్రాన్సు లోను. దక్షిణఫ్రాన్సులో నున్న అరబ్బుల సంఖ్య స్వల్పము. వారు స్వదేశమునకు దూరముగా నుండిరి. మధ్యఆసియాను జయించుటలో నిమగ్నమైయున్న అరేబియానుండి వారి కెక్కువగా సహాయము రా వీలులేకుండెను. అయినప్పటికిని ఫ్రాన్సులోని ఈ అరబ్బులు పశ్చిమ యూరోపుప్రజలను బెదరగొట్టిరి. అరబ్బులతో యుద్ధము చేయుటకు వారందరును ఏకమైరి. ఈ ఏకమైన సైన్యమునకు ఛార్లెసుమార్టెలు నాయకుడు. క్రీ. వె. 732 సంవత్సరమున ఫ్రాన్సులోని టూర్సువద్ద అతడు వారి నోడించెను. ఈ యోటమియే యూరోపును అరబ్బులపాలు కాకుండ రక్షించెను. ఒక చరిత్రకారు,డీవిధముగా చెప్పెను: "చేతికి చిక్కనున్న ప్రపంచసామ్రాజ్యమును అరబ్బులు టూర్సుమైదానములపై పోగొట్టుకొనిరి." అరబ్బులు టూర్సువద్ద విజయమునే సాధించియున్న యెడల యూరోపుచరిత్ర బ్రహ్మాండముగా మారెడి దనుటకు సందేహము లేదు. యూరోపులో వారి నాపుటకు మరియెవ్వరును లేరు. వారు తిన్నగా కాన్స్టాంటినోపులు పోయెడువారు. దారిలో రాజ్యములను గ్రసించెడువారు. తూర్పురోమకసామ్రాజ్యము నంతరింపజేసెడివారు, క్రైస్తవమునకు బదులు ఇస్లాం యూరోపుదేశమున ప్రధానమత మయ్యె డిది. ఇతరమార్పు లెన్నో వచ్చెడివి. జరిగిన విషయము—అరబ్బులు ఫ్రాన్సువద్ద ఆపబడిరి. తరువాత అనేకవందల సంవత్సరములకాలము వారు స్పెయినులో నిల్చి దానిని పాలించిరి.

స్పెయినునుండి మంగోలియావరకు అరబ్బులు విజయము సాధించిరి. ఈ దేశద్రిమ్మరులు, ఎడారివాసులు శక్తివంతమగు సామ్రా జ్యమున కధిపులైరి. వారిని సారసను లనెడివారు. ఈపదము సహ్రా,

నషీన్ అను పదములనుండి వచ్చియుండును. దీని కర్థము ఎడారి నివాసులని. కాని ఈ యెడారినివాసులు నగరనివాసమునకును, భోగము లకును అలవాటుపడిరి. వారి నగరములలో సౌధములు లేచెను. దూర దేశములలో వారు విజయము సాధించినప్పటికిని, తమలో తాము పోరాడు కొనుట యను ప్రాతఅలవాటు వారిని వదలలేదు. నేడు పోరాడుటకు తగిన కారణము ఉండకపోలేదు. అరేబియాలో అధిపత్య మనగా మహాసామ్రాజ్యపాలన మన్న మాట. కాన కాలీఫాస్థానమునకు తరుచు వివాదములు చెలరేగుచుండెను. చిన్న తగవులు, కుటుంబకల్లోలములు పుట్టి అంతర్యుద్ధమునకు దారితీయుచుండెను. ఈ కలహములు ఇస్లాం మతము రెండు పెద్దచీలిక లగుటకు కారణమైనవి. సున్నీలని, షియా లని వాటి పేర్లు. అవి నేటికిని నిలిచియున్నవి.

అబూబకిర్, ఓమర్ అను మొదటి యిద్దరు మహాకాలీఫుల పాలనా నంతరము అరబ్బులకు కష్టములు సంభవించెను. ఫతీమా మహ మ్మదుకూతురు. ఆమెభర్త అలీ. ఇతడు కొద్దికాలము కాలీఫాగా నుండెను. కాని పోరాటములు నిరంతరము జరుగుచునేయుండెను. అలీ హత్యచేయబడెను. కొద్దికాలమైనపిమ్మట అతని కుమారుడు హుస్సేన్ సకుటుంబముగా కర్బాలామైదానమున హత్యగావింపబడెను. కర్బాలాలో జరిగిన ఈ ఘోరకృత్యమును తలచుకొని, ప్రతిసంవత్సరము మొహరంనెలలో మస్లిములు—అందు ముఖ్యముగా షియాలు దుఃఖింతురు.

ఇప్పుడు కాలీఫా నిరంకుశప్రభు వయ్యెను. ప్రజాస్వామికము గాని, ఎన్నికలుగాని అతని కాలమున లేవు. ఆనాటి నిరంకుశప్రభువు లెట్లుండిరో అతడును అట్లుండెను. మాటవరుసకు అతడు మతాధికారిగా— మతభక్తుల నాయకుడుగా—ఉండెను. కాని ఈ పాలకులు కొందరు ఇస్లాంమతమునకు ప్రధానసంరక్షకులమని పేరుపెట్టుకొని దానిని ప్రత్య క్షముగా దూషించిరి.

నూరుసంవత్సరములవరకు కాలీఫాలు ఒమ్మియాదీ లను మహా

మ్మదుకుటుంబమునకు చెందిన ఒక శాఖకు చెందియుండిరి. దమాస్కసు వారి రాజధాని యయ్యెను. రాజగృహములతో, మసీదులతో, కేళాకూళు లతో, విలాసభవనములతో ఈ ప్రాచీననగరము మిక్కిలి అందముగా నుండెను. దమాస్కసులో నీటిసరఫరా ప్రసిద్ధిగన్నది. ఈకాలమునందే అరబ్బులు నూతనగృహనిర్మాణపద్ధతిని కనిపెట్టిరి. దీనినే సారసానిక్ వాస్తుపద్ధతి యందురు. ఇం దలంకరణము తక్కువ. అది నిరాడంబ రముగాను, గంభీరముగాను, అందముగాను ఉండును. అరేబియా, సిరియాల లోని అందమగు తాళవృక్షమే ఈ వాస్తుభావనకు మూలము. విలువంపులు (arches), స్తంభములు, గోపురములు, గుమ్మటమువంటి శిఖరములును తాటివనముల విలువంపులను, శిఖరములను తలపునకు తెచ్చును.

ఈ వాస్తుపద్ధతియే ఇండియాకుకూడ వచ్చెను. కాని ఇచట హిందూస్థానభావములచే పరిష్కారమంది మిశ్రమసంప్రదాయ మొకటి వెలువడెను. సారసానిక్ వాస్తుపద్ధతికి చక్కని నిదర్శనములు స్పెయినులో నేటికిని నిలిచియున్నవి.

భాగ్యసామ్రాజ్యములు భోగములను ప్రవేశపెట్టెను. భోగములకు సంబంధించిన ఆటలను, కళలనుకూడ తెచ్చిపెట్టెను. అరబ్బులకు గుర్రపు స్వారీ చేయుట మిక్కిలి సరదా. పోలోఆట, వేట, చదరంగముకూడ వారి కిష్టమే. వారు సంగీతమన్న చెవికోసుకొందురు. ముఖ్యముగా గాత్ర పాట వారి కిష్టము. రాజధానినిండ సంగీతపాటకులును, వారి అనుచరులును ఉండెడివారు.

వేరొక గొప్పమార్పు—అనుచితమగు మార్పు క్రమముగా దేశ ములో ప్రవేశించెను. ఇది స్త్రీలకు సంబంధించినది. అరబ్బులలో స్త్రీలకు ఘోషాపద్ధతి లేదు. వారిని వేరుపరచి దాచివేయు ఆచారము లేదు. వారు బాహాటముగా తిరుగుచుండిరి. మసీదులకు పోవుచుండిరి. ఉపన్యాసములు వినుచుండిరి. ఉపన్యాసములుసైత మిచ్చుచుండిరి. విజయములు చేకూరిన తోడనే వారు తమకు రెండుతట్టుల నున్న ప్రాచీనసామ్రాజ్యముల ఆచార

ములను అధికముగా అనుకరింపజొచ్చిరి—ఇటు తూర్పురోమకసామ్రాజ్యము, అటు పర్షియనుసామ్రాజ్యము. రోమకసామ్రాజ్యమును వారోడించిరి. పర్షియనుసామ్రాజ్యమును తుదముట్టించిరి. కాని ఈ రెండు సామ్రాజ్యములయొక్క దురాచారములను పెక్కింటిని వారలవరచుకొనిరి. కాన్‌స్టాంటినోపులు పర్షియాల ప్రభావమువల్ల ముఖ్యముగా అరబ్బులలో ఘోషాపద్ధతి వచ్చినదని చెప్పుదురు. క్రమముగా రాణివాసము ప్రారంభమయ్యెను. స్త్రీపురుషులు కార్యకరాదులకు అన్యోన్యము కలిసికొనుట నానాటికి సన్నగిల్లెను. దురదృష్టవశమున, స్త్రీలను వేఱుపరచు ఘోషాపద్ధతి ఇస్లాముసంఘమున పరిపాటియైనది. మస్లిములు ఇండియాకు వచ్చినప్పుడు ఈ పద్ధతి వారినుండి ఇండియా నేర్చుకొన్నది. ప్రజ లీక్రూరకృత్యము నెట్లు సహించియుండిరో ఊహించినకొద్ది నా కాశ్చర్యము కలుగుచుండును. ప్రపంచముతో సంబంధము లేకుండ ఘోషాలో నుండు స్త్రీలను తలచుకొన్నప్పుడెల్ల నాకు చెరసాలగాని, జంతుశాలగాని తప్పకుండ జ్ఞాపకమువచ్చును. ఒకవిధమగు చెరసాలలో జనసంఖ్యలో సగమునుందిని దాచిపెట్టినప్పుడు ఆజాతి ఎట్లు వృద్ధిగాంచగలదు?

అదృష్టవశాత్తు ఇండియా ఘోషాతెరను త్వరత్వరగా చింపివేయుచున్నది. మస్లింసంఘముసైతము ఈ దుష్పరభావమును చాలవరకు దింపుకొన్నది. టర్కీలో కమాల్‌పాషా దాని నంతమొందించెను. ఈజిప్టులో అది శీఘ్రముగా అంతరించుచున్నది.

ఇంకొక్క విషయము చెప్పి ఈజాబును ముగింతును. అరబ్బులు ప్రబోధముచెందిన క్రొత్తలో తమ మత మన్న ఉత్సాహము చెందువారు. కాని వారు సహనబుద్ధి కలవారు. ఇట్టి మతసహనమున కెన్నో నిదర్శనము లున్నవి. జెరూసెలమ్‌లో కాలీఫాగా నుండిన ఓమరు ఈ విషయములో పట్టుదలగా నుండువాడు. స్పెయినులో క్రైస్తవజనుల సంఖ్య అధికముగా నుండెను. వారు తమ కిష్టమువచ్చిన మతమును అవలంబించవచ్చును. ఇండియాలో సింధుదేశమునతప్ప అరబ్బులు పరిపాలన

చేయలేను. కాని ఇండియాతో అనేకమార్లు సంసర్గము జరుగుచుండెను. వారు మైత్రితో మెలగుచుండిరి. చరిత్రలో ఈకాలమున గమనించవలసిన విషయము మస్లిముఅరబ్బులకున్న సహనమును, యూరోపులోని క్రైస్తవుల కున్న అసహనమును.

## 50

# బాగ్దాదు: హరునల్ రషీద్

మే 27, 1932.

ఇతరదేశముల నెత్తుకొనుటకు ముందు అరబ్బుల కథను కొన సాగింతము.

వెనుకటి జాబులో నేను చెప్పినట్లు సుమారు 100 సంవత్సరముల కాలము మహమ్మదు ప్రవక్తకుటుంబముయొక్క ఒమ్మియాదీశాఖనుండియే కాలీఫులు వచ్చుచుండిరి. డమాస్కసునుండి వారు పరిపాలన సాగించుచుండిరి. వారి పరిపాలనకాలమున మస్లిముఅరబ్బులు ఇస్లాంపతాకమును దూరదేశములకు కొంపోయిరి. అరబ్బులు దూరదేశములను జయించుచున్న కాలమందే ఇంట అంతఃకలహములు చెలరేగుచుండెను. తరుచు అంతర్యుద్ధములు జరుగుచుండెను. చివరకు మహమ్మదుకుటుంబము యొక్క వేరొక శాఖవారిచే ఒమ్మియాదీలు పదభ్రష్టులైరి. మహమ్మదు పినతండ్రి అబ్బాసుసంతతివారే ఈ శాఖవారు. కావుననే వారికి అబ్బాసీదు లను పేరు వచ్చెను. ఒమ్మియాదీల క్రూరకృత్యములకు ప్రతీకారము చేయుటకు వీరు వచ్చిరి. వారిపై విజయము నందినపిమ్మట వీరు చూపిన క్రౌర్యము, చేసిన హత్యలు వారిని మరపించినవి. కనిపించిన ఒమ్మియాదీల నందరిని వారు కిరాతులవలె వేటాడి చంపిరి.

క్రీ. వె. 750 సంవత్సరమున అబ్బాసీదుకాలీఫుల దీర్ఘపరిపాలనము ప్రారంభమాయెను. సుఖకరము, శుభకరము నగు ప్రారంభము కాక

పోయినను అబ్బాసీదుపరిపాలనకాలము అరబ్బీచరిత్రలో దేదీప్యమానము గానే వెలిగెను. ఇప్పుడు ఒమ్మియాదీల కాలమునకు భిన్నముగా పెద్ద మార్పు లనేకము వచ్చెను. అరేబియాలోని అంతర్యుద్ధము అరబ్బీ సామ్రాజ్యము నంతయు నూటాడించినది. అబ్బాసీదులు ఇంటివద్ద గెలిచిరి. కాని స్పెయినులోని అరబ్బీగవర్నరు ఒమ్మియాదీ యగుటచే అబ్బాసీదు కాలీఫును అధికారిగా సమ్మతించుటకు నిరాకరించెను. ఉత్తరఆఫ్రికా— దీనినే ఇఫ్రికియారాజప్రతినిధిత్వ మందురు—కూడ కొద్దికాలములోనే ఒకవిధముగా స్వతంత్రమాయెను. ఈజిప్టుకూడ అట్లే చేసెను. అంతే కాదు. అది వేరొక కాలీఫునుకూడ ప్రకటించెను. ఈజిప్టు అరేబియాకు దగ్గరనే యున్నందువల్ల దానిని బెదిరించి లొంగదీయుటకు ఉండుండియు ప్రయత్నించిరి. ఇఫ్రికియాజోలికి పోలేదు. స్పెయిను చాలదూరమం దుండుటచే ఏమి చేయుటకును వీలులేకుండెను. అబ్బాసీదులు అధికారము నకు వచ్చినతోడనే అరబ్బీసామ్రాజ్యము చీలికలైపోయెను. మస్లిం ప్రపంచమున కంతకును కాలీఫు అధికారి కాడు. అత డిప్పుడు "మత భక్తులందరి నాయకుడు"ను కాడు. ఇస్లాం ఏకముగా లేదు. స్పెయిను లోని అరబ్బులును, అబ్బాసీదులును అన్యోన్యము ద్వేషించుకొనుచుండిరి. తరుచు ఎదుటివారికి కష్టములు తటస్థించిన తాము సంతోషించుచుండిరి.

అయినప్పటికిని అబ్బాసీదుకాలీఫులు గొప్ప పరిపాలకులు. వారి సామ్రాజ్యము గొప్ప సామ్రాజ్యము. పర్వతములను జయించి అగ్నిజ్వాలలవలె ప్రాకిపోయిన వెనుకటి విశ్వాసము, శక్తిఇప్పుడు కనిపించుట లేదు. నిరాడంబరత్వము లేదు. ప్రజాప్రాతినిధ్యము లేదు. "మతభక్తుల నాయకుడు" పర్షియనురాజాధిరాజుకన్న భిన్నముగా లేడు. ఈ పర్షియన్‌రాజునే తొలిరోజులలో అరబ్బులు ఓడించియుండిరి. మహా మ్మదుప్రవక్తకాలమునాటి అరబ్బులలో ఒక వింత జీవము, శక్తి ఉండెను. రాజసైన్యముయొక్క శక్తివంటి శక్తి కాదది. ఆ కాలమందలి ప్రపంచ మున వారు ప్రముఖులై తలయెత్తి నిలుచుండిరి. తిరుగులేని వారి దండ

యాత్రలముందు సైన్యములును, రాజులును పలాయన మగుచుండిరి. ప్రజా సామాన్యమునకు ఈ రాజు లన్న విసుగుపుట్టెను. వారి పరిస్థితులు బాగు పడుటకు కుచితమగు మార్పులు అరబ్బులు ప్రవేశపెట్టుదురనియు, సాంఘిక విప్లవము తెచ్చిపెట్టుదురనియు వారికి ఆశ కలిగెను.

ఇప్పు డది యంతయు మారిపోయెను. ఎడారిజనులు నేడు ప్రాసాదములలో నివసించుచుండిరి. ఖర్జూరము తినుటకుబదులు మృష్టాన్న భోజనములు చేయుచుండిరి. వారు సుఖజీవనములు చేయుచుండిరి. కాబట్టి, మార్పులగొడవ, సాంఘికవిప్లవముగొడవ వారి కెందు కింక? ప్రాచీనసామ్రాజ్యముల వైభవమును మించిన వైభవముతో వా రుండ గోరిరి. వాటి దురాచారము లనేకము వీరు అనుసరించిరి. ఆం దొక్కటి—నే నిదివరలో చెప్పియుంటిని—ఘోషాపద్ధతి.

రాజధాని నేడు డమాస్కసునుండి ఇరాకులోని బాగ్దాదుకు మార్చ బడెను. రాజధానిని మార్చుటకూడ సాభిప్రాయముగా నున్నది. ఏలయన, పర్షియారాజులు వేసవికాలములో బాగ్దాదునగరమున నివసించెడువారు. డమాస్కసుకన్న బాగ్దాదు యూరోపుకు దూరములో నున్నది. కాన అబ్బాసీదులు నాటినుండి యూరోపుమీదకన్న ఆసియామీద అధికముగా దృష్టిపెట్టుకొనిరి. కాన్స్టాంటినోపులును స్వాధీనముచేసికొనుటకు ఇంకను ఎన్నో ప్రయత్నములు చేయవలసియుండెను. యూరోపుజాతులతో ఎన్నో యుద్ధములు జరుగవలసియుండెను. కాని యీ యుద్ధము లన్నియు ఆత్మ రక్షణకొరకు చేసినవే. దిగ్విజయయాత్రలు చేయు దినములు గతించినవి. అబ్బాసీదుకాలీఫులు తమకు మిగిలిన సామ్రాజ్యమును గట్టిచేసికొనుటకు ప్రయత్నించిరి. స్పెయిను, ఆఫ్రికాలు లేకపోయినప్పటికిని ఈ సామ్రా జ్యము గొప్పదే.

బాగ్దాదుపేరు నీవు వినలేదా? హరునల్‌రషీదు, షాహీరజాదీ, యవనయామినీ కథలును నీకు జ్ఞాపకములేదా? అబ్బాసీదుకాలీఫుల పరి పాలనలో నేడు లేచిన పట్టణమే యవనయామినీకథలలోని పట్టణము.

అది విశాలమగు పట్టణము. దివ్యభవనములతో, ఉద్యోగస్థుల కచేరీలతో, పాఠశాలలతో, కళాశాలలతో, పెద్ద అంగళ్లతో, ఉద్యానములతో, తోటలతో అది కలకలలాడుచుండెను. వర్తకులు తూర్పు, పశ్చిమదేశములతో విరివిగా వర్తకము చేయుచుండిరి. గవర్నమెంటు ఉద్యోగస్థులనేకులు సామ్రాజ్యముయొక్క దూరప్రాంతములతో సంబంధ మేర్పరచుకొని యుండిరి. ప్రభుత్వము నానాటికి అనేకవిషయములను విచారింపవలసి వచ్చుటచే అది అనేకశాఖలుగా విభజింపబడెను. రాజధానితో సామ్రాజ్యమన్ని ప్రాంతములకును పోస్టాఫీసులు సంబంధ మేర్పరచుచుండెను. వైద్యశాల లంతటను ఉండెను. ప్రపంచపు అన్ని ప్రాంతములనుండియు ముఖ్యముగా పండితులు, విద్యార్థులు, కళాప్రియులు బాగ్దాదును దర్శించుచుండిరి. కాలీపు చదువుకొన్నవారి నందరిని, చిత్రకళలలో ప్రావీణ్యము సంపాదించినవారి నందరిని బహూకరించుచుండె నన్న వార్త లోకవిదితమాయెను.

బానిసలచే పరివృతుడై కాలీపు మహాభోగము లనుభవించుచుండెను. అతని రాణివాసము ఘోషాపద్ధతి నవలంబించియుండెను. క్రీ.వె. 786 నుండి 809 వరకు, హరునల్‌రషీదు పరిపాలనమున అబ్బాసీదుసామ్రాజ్యము బాహ్యావైభవముతో మిన్నుముట్టుచుండెను. చీనాచక్రవర్తి నుండియు, పశ్చిమమున ఛార్లీమాన్‌చక్రవర్తినుండియు రాయబారులు హరూను కొలువుకూటమునకు వచ్చుచుండిరి. రాజనీతిశాస్త్రములందును, వర్తకములందును, విద్యాభివృద్ధియందును (అరబ్బీస్పెయినును మినహాయించినచో), బాగ్దాదును, అబ్బాసీదురాష్ట్రములను ఆ రోజులలో యూరోపు నన్నివిధముల మించియుండెను.

అబ్బాసీదుకాలమున విజ్ఞానశాస్త్రవిషయములందు అభిరుచి ప్రారంభమగుట మనము ముఖ్యముగా గమనించవలెను. నేటి ప్రపంచమందు విజ్ఞానశాస్త్రము మిక్కిలి ప్రధానముగా గణింపబడుచున్నది. అది మన కెన్నో ఉపకారములు చేసినది. విజ్ఞానశాస్త్రము కూర్చుండి పనులు

జరుగవలెనని ప్రార్థనలు సలుపదు. కార్యము లట్లు ఏల జరుగునో తెలిసి కొనుటకు ప్రయత్నించును. అది ప్రయోగములు (experiments) చేయును. మరలమరల ప్రయత్నించును. ఒక్కొక్కమారు విఫలత నందును. ఒక్కొక్కమారు కృతకృత్య యగును. ఈవిధముగా కొద్ది కొద్దిగా అది మానవవిజ్ఞానమును వృద్ధిచేయును. నేటి ఈ మన ప్రపంచము ప్రాచీనప్రపంచమునకును, మధ్యయుగములకును చాల భిన్నముగా నున్నది. ఈ గొప్ప తేడాకు ముఖ్యకారణము విజ్ఞానశాస్త్రము. నేటి ప్రపంచము విజ్ఞానశాస్త్రము నిర్మించినదే.

ప్రాచీనులందు ఈజిప్టులోగాని, చీనాలోగాని, ఇండియాలోగాని శాస్త్రీయవిధానము (Scientific method) మనకు గోచరము కాదు. ప్రాతగ్రీసులో ఇది కొద్దిగా నున్నది. రోములో లేదు. అరబ్బుల కీశాస్త్ర విచారోత్సాహము కలదు. కావున నేటి శాస్త్రమునకు వారు పితలవంటివా రని భావించవచ్చును. వైద్యము, గణితము మున్నగు శాస్త్రములవిషయ మున వారు ఇండియానుండి చాలవిషయములు నేర్చుకొనిరి. హిందూదేశ పండితులు, గణితశాస్త్రజ్ఞులు అనేకులు బాగ్దాదు వెడలుచుండిరి. అరబ్బీ విద్యార్థు లనేకులు ఉత్తరహిందూస్థానమందలి తక్షశిలకు వచ్చుచుండిరి. తక్షశిల ఆనాటికికూడ గొప్ప విశ్వవిద్యాలయమే. అందు బోధించు అభి మానశాస్త్రము వైద్యము. వైద్యము మున్నగు శాస్త్రగ్రంథములు సంస్కృతమునుండి ప్రత్యేకముగా అరబ్బీభాషలోనికి తర్జుమాచేసిరి. చీనానుండి అరబ్బులు అనేకవిషయములు గ్రహించిరి. ఒక ఉదాహరణము- కాగితములు తయారుచేయుట. కాని వారు ఇతరులనుండి గ్రహించిన విషయము లాధారముచేసికొని స్వయముగా పరిశోధనలుసల్పి క్రొత్త విషయము లనేకము కనిపెట్టిరి. వారు మొట్టమొదటి దూరదర్శినీయంత్ర మును తయారుచేసిరి. నావికుల కంపాసును తయారుచేసిరి. వైద్యవిష యమున అరబ్బీవైద్యులును, శస్త్రచికిత్స చేయువారును యూరోపునం దంతట ప్రసిద్ధిగాంచిరి.

ఇట్టి విద్యావ్యాసంగము లన్నిటికి బాగ్దాదు గొప్ప కేంద్రమై యుండెను. పశ్చిమమున, అరబ్బుల స్వాధీనమందున్న స్పెయినుకు రాజధాని యగు కార్డోబానగరము వేరొక కేంద్రము. అరబ్బీప్రపంచములో అనేకవిశ్వవిద్యాలయకేంద్రము లింకను ఉండెను. అచ్చటను విద్యావ్యాసంగములు అధికముగా జరుగుచుండెను. కైరో, లేదా అల్-కహిర అను పట్టణమునకు "జయశీల" యను బిరుద ముండెను. ఇది యొక కేంద్రము. బస్రా, కూఫాలుకూడ కేంద్రములే. ఈ ప్రసిద్ధపట్టణముల నన్నిటిని మించి బాగ్దాదు వెలుగుచుండెను. "ఇది ఇస్లాంరాజధాని, ఇరాకుకన్ను, సామ్రాజ్యమునకు నిలయము, సౌందర్యమున కాటపట్టు, సంస్కృతి కాలవాలము, కళల కునికిపట్టు" అని ఒక అరబ్బీచరిత్రకారుడు బాగ్దాదును వర్ణించియున్నాడు. దాని జనసంఖ్య 20లక్షలు. కావున నది నేటి కలకత్తా బొంబాయినగరములకన్న చాల పెద్దది.

మేజోళ్లు తొడుగుకొను అలవాటు మొట్టమొదట బాగ్దాదులో ధనవంతుల ఇండ్లయందు ప్రారంభమైన దట విన్నావా ? వాటిని "మోజాలు" అనువారు. హిందూస్థానీపదము ఈ పదమునుండియే వచ్చియుండవలెను. "షిమీజ్" అను ఫ్రెంచిపదముకూడ "కమీజ్" అను పదమునుండి వచ్చినది. అనగా చొక్కా. ఈ కమీజ్, మోజాపదములు అరబ్బులనుండి కాన్‌స్టాంటినోపులులోని బైజాంటైనులకును, వారి ద్వారా యూరోపుకును ప్రాకెను.

అరబ్బులు గొప్ప ప్రయాణికులని ప్రసిద్ధిపొందిరి. సముద్రముల మీదుగా వారు దీర్ఘయాత్రలు సాగించి, ఆఫ్రికాలోను, ఇండియాతీరము లందును, మలేసియాలోను, చీనాలోపైతము వలసలు స్థాపించిరి. వారిలో ప్రసిద్ధయాత్రికుడు అల్బెరూనీ. ఇతడు ఇండియాకు వచ్చి, తాను చూచిన విషయములను యువాన్‌ఛాంగ్‌వలెనే గ్రంథముగా వ్రాసెను.

అరబ్బులు చరిత్రకారులుకూడ. వారు వ్రాసిన గ్రంథములనుండియు, చరిత్రలనుండియు మనము వారినిగురించి అనేకవిషయములు తెలిసికొన

గలుగుచున్నాము. వా రెంతటి చక్కని కథలు వ్రాయగలిగిరో మన కందరికి తెలియును. అబ్బాసీదుకాలీఫాలనుగురించి వేలకువేల జనములు ఎన్నడును వినియుండరు. వారి సామ్రాజ్యమునుగురించియు వినియుండరు. కాని వారికి "అల్ఫ్‌లైలావాలైలా" (వేయిన్నొక్క రాత్రులు)కు సంబంధించిన బాగ్దాదు సుపరిచితమే. ఆ నగరము రహస్యముల పుట్ట, కథల పుట్టిల్లు. ఊహాసామ్రాజ్యము తరచు యథార్థసామ్రాజ్యముకన్న సత్యమును, స్థిరస్థాయియును.

హరునల్‌రషీదుమరణానంతరము అరబ్బీసామ్రాజ్యము చిక్కులపాలయ్యెను. అల్లరులు చెలరేగెను. సామ్రాజ్యమందలి వివిధభాగములు సామ్రాజ్యమునుండి వీడిపోయెను. రాష్ట్రాధిపతులు వంశపరంపరగా పాలకులైరి. కాలీఫులు క్రమక్రమముగా అధికారమును గోల్పోవుచుండిరి. తుదకు ఒకప్పుడు కాలీఫు బాగ్దాదును, పరిసరగ్రామములనుమాత్రమే ఏలుచుండెను. ఒక కాలీఫును అతని సైనికులే రాజగృహమునుండి బయటకు లాగుకొనివచ్చి చంపిరి. పిమ్మట కొందరు సమర్థులు లేచి బాగ్దామనుండి పరిపాలన చేయదొడగిరి కాలీఫును వారి చెప్పుచేతలలో నుండునట్లు చేసిరి.

ఇస్లాంయొక్క ఐక్యభావము స్మరణీయమయ్యెను. ఈజిప్టు మొదలు మధ్యఆసియాలోని ఖొరాసానువరకు ప్రతిచోటను ప్రత్యేకరాజ్యములు తలచూపెను. మరి తూర్పునుండి దేశద్రిమ్మరితెగలు పడమరకు పోయెను. మధ్యఆసియాలోని టర్కులు మస్లిములైరి. వారు వచ్చి బాగ్దాదును వశపరచుకొనిరి. వారికి సెల్జూకు తురుష్కులని పేరు. వారు కాన్‌స్టాంటినోపులుయొక్క బైజాంటైను సైన్యమును పూర్తిగా ఓడించిరి. ఇది చూచి యూరోపు ఆశ్చర్యపోయినది. అరబ్బులును, తురుష్కులును బలమును కోల్పోయి రనియు, నానాటికి నీరసించిపోవుచున్నా రనియు యూరోపు తలంచెను. అరబ్బులు ఎక్కువగా క్షీణించుచున్నమాట వాస్తవమే. కాని సెల్జూకుతురుష్కులు ఇప్పుడు రంగమున ప్రవేశించి ఇస్లాంపతాకమును నిలిపిపట్టిరి. యూరోపుపై కాలుద్రవ్విరి.

ఈ సవాలుకు యూరోపులోని క్రైస్తవ జాతులన్నియు మతయుద్ధములు పోరాడుటకు నిశ్చయించుకొనెను. మస్లిములతో పోరాడి తమ పవిత్ర క్షేత్రమగు జెరూసెలమును తిరిగి స్వాధీనము చేసికొనుటకై పూనుకొనిరి. నూరుసంవత్సరములపైగా క్రైస్తవమును, ఇస్లామును సిరియా, పాలస్తీనా, ఆసియామైనరులలో యాజమాన్యము సంపాదించుటకు పోరాడెను. ఇద్దరును అలసిపోయిరి. ఈ దేశములలోని ప్రతిఅంగుళమును మానవరక్తముతో తడిసిపోయెను. ఈ ప్రాంతములందభివృద్ధిలో నుండిన నగరములు తమ యౌన్నత్యమును, వర్తకమును గోల్పోయెను. సస్యశ్యామలమగు ప్రదేశములు వనభూములైనవి.

ఇట్లు వారిద్దరును పోరాడిరి. వారి పోరాటము ముగియకముందే, ఆసియాలోని మంగోలియాలో చెంగిజ్‌ఖాన్ తలయెత్తెను. ఇతడు భూమిని గడగడ లాడించిన మంగోలుమనుష్యుడు అని పేరుపొందెను. నిజమునకాతడు ఆసియాను, యూరోపును గడగడలాడించనుండెను. అతడును, అతని వారసులును బాగ్దాదును, దాని సామ్రాజ్యమును అంతమొందించిరి. ప్రసిద్ధినందిన బాగ్దాదుమహానగరమును మంగోలులు పూర్తిగా నాశము చేసినతర్వాత నది బూడిదపోగై పోయెను. దాని జనాభా 20 లక్షల జనము చాలవరకు గతించిరి. ఇది క్రీ. వె. 1258 సంవత్సరములో జరిగెను.

నేడు బాగ్దాద కలకలలాడు పట్టణమైయున్నది. ఇరాకురాజ్యమునకది రాజధాని. కాని అది పూర్వపు బాగ్దాదుఛాయమాత్రమే. మంగోలులు పాడుజేసిన మహానగరము మరల తేరుకొనలేదు.

## 51

# ఉత్తర హిందూస్థానము:
# హర్షుని మొదలు మహమ్మదు వరకు

జూన్ 1, 1932

అరబ్బులు, లేదా సారసనుల కథ ప్రస్తుతము కట్టిపెట్టి ఇతర దేశము లెట్లున్నవో చూతము. అరబ్బులు విజయములు సాధించుచుండగా,

వ్యాపించుచుండగా, క్షీణతనందుచుండగా ఇండియాలో, చీనాలో, యూరోపుదేశములలో నేమి జరుగుచున్నది? ఈవిషయములు మనము కొద్దికొద్దిగా చూచితిమి. క్రీ.వె. 732 సంవత్సరమున, ఛార్లెసు మార్టెల్ నడిపించిన సంయుక్తసైన్యముచే ఫ్రాన్సులోని టూర్సువద్ద అరబ్బులు ఓడిపోవుట, అరబ్బులు మధ్యఆసియాను జయించుట, వారు ఇండియాలోని సింధువరకు వచ్చుట—ఇవి చూచితిమి. మొదట మనము ఇండియా వైపు దృష్టిత్రిప్పుదము.

కనోజినేలిన హర్షవర్ధనుడు క్రీ.వె. 648 సంవత్సరమున తనువు చాలించెను. అతని మరణముతో ఉత్తరహిందూస్థానము రాజకీయముగా అధోగతిపాలు కాజొచ్చెను. అంతకుముందు కొంతకాలమునుండియు క్షీణమగుచునేయుండెను. హిందూబౌద్ధమతముల సంఘర్షణ దీని కనుకూలముగా నుండెను. హర్షుని కాలమున సర్వమును సక్రమముగా నున్నట్లే కనబడెను. కాని అది కొద్దికాలమువరకే. అతని తరువాత చిన్నరాజ్యము లెన్నో ఉత్తరమున తలయెత్తెను. ఇందు కొన్ని కొద్ది కాలము మాత్రమే వెలిగెను. కొన్ని అంతఃకలహములు పెట్టుకొని తమలో తాము పోరాడుచుండెను. హర్షుని తరువాత 300 సంవత్సరముల పైగా కళలును, సారస్వతమును వృద్ధిలో నుండుట ఆశ్చర్యకరమే. ఈకాలమునందే ఎన్నో చక్కని, ప్రజలకుపయోగించు కట్టడములు నిర్మింపబడెను. ప్రసిద్ధినందిన సంస్కృత విద్వాంసులు పెక్కురు-భవభూతి, రాజశేఖరుడు మున్నగువారు ఈకాలమునందే యుండిరి పెక్కురాజులు, రాజకీయముగా వారికి ప్రసిద్ధి లేకున్నను, కళావాఙ్మయములు వారి రాజ్యకమున వృద్ధియగుటచే ప్రసిద్ధిగాంచిరి. వారిలో నొకడు భోజరాజు. అతడు పురాణములలో చెప్పబడిన ఆదర్శప్రాయుడగు రాజుగా పరిగణింపబడెను. నేటికికూడ ప్రజ లాతని నావిధముగా స్మరింతురు.

కాని కాంతివంతమగు పట్టు లిట్టివున్నను ఉత్తరాది క్షీణించుచుండెను. దక్షిణఇండియా మరల పురోగమించుచుండెను. ఉత్తరమును

మరుగుపరచుమండెను. ఈ దినములలో దక్షిణహిందూస్థాన మెట్లుండెనో వెనుకటి ఒకజాబులో (44) కొద్దిగా చెప్పియుంటిని—చాళుక్యులను గురించి, చోళసామ్రాజ్యమునుగురించి, పల్లవులనుగురించి, రాష్ట్రకూటులనుగురించి. శంకరాచార్యులనుగురించికూడ చెప్పియుంటిని. జీవించినది కొద్దికాలమే యైనను అతడు దేశమందలి పండితపామరుల హృదయముల నాకర్షించె ననియు, బౌద్ధమును హిందూదేశములో లేకుండజేసె ననియు చెప్పియుంటిని. అత డిట్లు చేసీచేయుటతోనే ఒక క్రొత్తమతము ఇండియా తలుపు తట్టుటయు, తరువాత విజయపరంపరలు సాధించి, నాటి పరిస్థితులపై కాలుద్రవ్వుటయు తటస్థించుట వింతగా నున్నది.

హర్షుడు బ్రదికియున్న కాలమునందే అరబ్బులు హిందూదేశము యొక్క పొలిమేరలను చేరిరి. అక్కడ కొంతకాలము నిలిచి పిదప సింధుదేశమును స్వాధీనముచేసికొనిరి. క్రీ.వె. 710 సం. రమున 17సం. ల బాలుడొకడు-మహమ్మదు ఇబిన్ కాసిం అనువాడు, అరబ్బుల సైన్యమును నడిపించుకొనిపోయి, పశ్చిమపంజాబులో ముల్తానువరకును ఉన్న సింధు లోయను స్వాధీనము చేసికొనెను. ఇండియాలో అరబ్బులు విజయము సాధించిన దంతయు నింతమట్టుకే. వా రింకను గట్టిగా ప్రయత్నించినచో బహుశా ఇంతకన్న ముందుకు పోయియుందురు. ఉత్తరహిందూస్థానము దుర్బలముగా నున్నదిగాన వారి కది కష్టసాధ్య మనిపించకపోయెడిది. ఈ అరబ్బులకును, తత్ప్రాంతమందలి పాలకులకును నిరంతరయుద్ధములు జరుగుచున్నను విజయము సాధించవలె నని ప్రయత్నము చేయలేదు. రాజకీయముగా చూచిన అరబ్బుల ఈ విజయము అంత ప్రధానమైనది కాదు. మస్లిములు ఇండియాను జయించుట ఇంకను కొన్నివందల సంవత్సరముల తరువాత జరుగనైయున్నది. అరబ్బులకు హిందూ దేశస్థులతో సంసర్గము కలుగుటవలన సంస్కృతిపరముగా గొప్ప ఫలితములు కలిగెను.

దక్షిణదేశపాలకులతో, ముఖ్యముగా రాష్ట్రకూటులతో అరబ్బులు

మైత్రి పాటించియుండిరి. అరబ్బు లనేకులు ఇండియాపశ్చిమతీరమున వివాహము లేర్పరచుకొని తత్తత్ప్రదేశములందు మసీదులు కట్టుకొనిరి. అరబ్బీయాత్రికులును, వర్తకులును హిందూస్థానపు పలుప్రాంతములను దర్శించుచుండిరి. వైద్యవిద్యలో ప్రసిద్ధిగన్న తక్షశిలావిశ్వవిద్యాలయమునకు అరబ్బీవిద్యార్థులు అసంఖ్యాకముగా వచ్చుచుండిరి. హరునల్‌రషీదు కాలములో బాగ్దాదునగరమున హిందూదేశపండితులను గౌరవించుచుండిరనియు, హిందూదేశమునుండి వైద్యు లక్కడికి వెళ్లి వైద్యశాలలను, వైద్యపాఠశాలలను నిర్మింప తోడ్పడువారనియు చెప్పుదురు. గణితజ్యోతిశ్శాస్త్రగ్రంథములు సంస్కృతమునుండి అరబ్బీభాషలోని కనువదింపబడినవి.

ఈవిషయముగా అరబ్బులు హిందూ-ఆర్యసంస్కృతినుండి అధికముగా గ్రహించియుండిరి. పర్షియాలోని ఆర్యసంస్కృతినుండికూడ వారు గ్రహించిరి. గ్రీకు సంస్కృతినుండికూడ వారు కొంత గ్రహించిరి. ఎయస్సులో నుండి దార్ఢ్యముతో నున్న క్రొత్తజాతివలె వారుండిరి. వారు చుట్టును ఉన్న ప్రాచీనసంస్కృతులనుండి లాభములను పొందిరి. వాటినుండి నేర్చుకొనిరి. ఈ పునాదిపై వారు తమ సొంత సంస్కృతిని— సారసానిక్ సంస్కృతిని నిర్మించుకొనిరి. సామాన్యముగా సంస్కృతులు నిలుచునంతకాలము ఈ సంస్కృతి నిలువలేదు. కాని దాని జీవితము పొట్టిదైనను దేదీప్యమానముగా వెలిగినది. యూరోపులోని మధ్యయుగములలో అంధకార మావరించియుండగా ఇది యొక వెలుగు వెలిగెను.

హిందూఆర్యులతో, పర్షియనులతో, గ్రీకులతో సంసర్గకారణముగా అరబ్బులు లాభములు పొందిరికాని హిందూదేశస్థులు, పర్షియనులు, గ్రీకులుమాత్రము అరబ్బులతో సంసర్గకారణముగా హెచ్చుగా లాభములు పొందకుండుట వింతగా నున్నది. ఇందుకు కారణము బహుశా, అరబ్బులు క్రొత్తగా లేచిన జాతి. శక్తి, ఉత్సాహము వారిలో ఎక్కువగా నుండెను. మిగతజాతులవారు వృద్ధజాతులకు చెందినవారు. ప్రాతఘంతలను పట్టు

కాని వారు పోవుచుండిరి. మార్పు నెక్కువగా కోరుచుండుట లేదు. ఒక మానవునిపై వార్ధక మెట్టి మార్పులు గలిగించునో జాతిపై కూడ అట్టి మార్పులే కలిగించునని తోచుచున్నది. వారి గతి మందగించును; వారి మనశ్శరీరములు కరుడుగట్టిపోవును. వారు మార్పుల నిచ్చగించరు; పూర్వాచారపరాయణులై యుందురు.

కాన అరబ్బులతో సంసర్గకారణముగా ఇండియా ఎక్కువగా ఫలితములను పొందలేదు; మార్పుల నందలేదు. ఈ సంసర్గ కొన్నివందల సంవత్సరములకాల ముండెను. ఈ దీర్ఘకాలములో ఇండియా క్రొత్త మతమగు ఇస్లామునుగురించి కొంత తెలిసికొనియుండును. మస్లిం అరబ్బులు వచ్చిరి. వెళ్లిరి. మసీదులుకట్టిరి. అప్పుడప్పుడు తమ మతమును బోధించిరి. ప్రజల నప్పుడప్పుడు తమ మతములో కలుపుకొనిరికూడ. ఈ విషయమును జ్ఞాపకముంచుకొనుట అవసరము. ఎందుకనగా, తరువాతిరోజులలో ఈ రెండుమతములకును సంఘర్షణలు కలిగెను. కష్టములు సంభవించెను. పదకొండవ శతాబ్దమున ఇస్లాంమతము విజయమును సాధించిన వేషముతో, ఖడ్గమును చేబూని ఇండియాలో ప్రవేశించినప్పుడు మాత్రము తీవ్రవైముఖ్యము కలిగెను. ప్రాత మతసహనము అంతరించెను. ద్వేషమును, కలహములును ప్రారంభమయ్యెను.

అగ్నిప్రమాదములను కల్పించుచు, హత్యలు చేయుచు ఇండియాకు వచ్చిన ఖడ్గధారి గజనీమహమ్మదు. ఆఫ్ఘనిస్థానములో గజనీ నే డొక చిన్న పట్టణము. పదవ శతాబ్దిలో గజనీచుట్టును ఒక రాజ్యము లేచెను. పేరునకుమట్టుకు మధ్యఆసియారాజ్యములు బాగ్దాదుకాలీఫు అధికారములో నుండెను. కాని హరునల్‌రషీదుమరణానంతరము కాలీఫు దుర్బలు డయ్యెను. కాలక్రమమున అతని సామ్రాజ్యము అనేకస్వతంత్రరాజ్యములుగా చీలిపోయెను. ఈ కాలమునుగురించి మన మిప్పుడు ప్రసంగించుకొనుచున్నాము. సబక్తజిన్ అను తురుష్కబానిస క్రీ. వె. 975 సంవత్సర ప్రాంతమున గజనీ, కాందహారుపట్టణములచుట్టును ఒక రాజ్యమును

స్థాపించుకొనెను. అతడు ఇండియాపైకూడ దండయాత్రలు సలిపెను. ఆరోజులలో లాహోరుకు రాజు జయపాలు డనువాడు. అతడు మిక్కిలి సాహసోపేతుడు. జయపాలుడు కాబూలులోయకు సబక్తజీనామీదకు సైన్యములతో పోయి పరాజితు డయ్యెను.

సబక్తజీనాతరువాత అతని పుత్రుడు మహమ్మదు గద్దె ఎక్కెను. అతడు చక్కని సేనానాయకుడు. చక్కని అశ్వదళనాయకుడు. ప్రతిసంవత్సరము అతడు ఇండియాపై దండయాత్రలు వెడలి పట్టణములను కొల్లగొట్టి, మనుష్యులను చంపి అమితముగా ధనమును, యుద్ధఖైదీలను తీసికొనిపోయెడువాడు. మొత్తముమీద అతడు 17 దండయాత్రలు చేసెను. అందొక్కటియే—కాశ్మీరముమీఎచేసిన దండయాత్ర యొక్కటియే—విఫలమాయెను. మిగిలిన దండయాత్రలు ఫలవంతములైనవి. ఉత్తరాదివి అతని పేరు భయావహముగ నుండెను. అతడు పాటలీపుత్రము, మధుర, సోమనాధమువరకు దక్షిణముగా పోయెను. స్థానేశ్వరమునుండి అతడు 200,000 మంది బందీలను, అపారధనమును తీసికొనిపోయెను. సోమనాధములో అతనికి అమితముగా ధనముదొరికెను. సోమనాధమున గొప్ప దేవాలయ ముండెను. వేలకొలది సంవత్సరములపాటు భక్తులు చెల్లించిన ముడుపులు అందు నిలువయుండెను. మహమ్మదు వచ్చినప్పుడు వేలకొద్ది జనులు సోమనాధాలయములో తలదాచుకొనిరి. తాము కొలుచు ఈశ్వరుడు తమ్ము రక్షించు ననియు, ఏదో మహత్తు జరుగుననియు వారాసించియుండిరి. కాని మహత్తులు తరచు జరుగవు. భక్తుల ఊహలలోమాత్రము జరుగునేమో. దేవాలయమును బ్రద్దలుకొట్టి మహమ్మదు అందలి ధనమును దోచుకొనెను. 50,000 మంది జనులు మడిసిరి. జరుగునని ఆసించిన మహత్తు జరుగలేదు.

మహమ్మదు క్రీ. వె. 1030 లో మరణించెను. అప్పుడు పంజాబు అంతయును, సింధుదేశమును అతని పాలనమం దుండెను. ఇండియాకు ఇసాంమతవ్యాప్తికొరకై వచ్చిన ఇస్లాంనాయకునిగా అతని నెన్నుదురు.

ముస్లిములనేకు లతని నమితముగా పూజింతురు. హిందువు లనేకు లతనిని ద్వేషింతురు. నిజమున కతడు మతముతో సంబంధ మున్న మనుష్యుడు కాడు. అతడు మహమ్మదీయుడే; కాని అది వేరువిషయము. ఏది ఎట్లున్నను అతడు సైనికుడు—సమర్థుడగు సైనికుడు. అతడు ఇండి యాకు విజయము సాధించుటకును, దోచుకొనుటకును వచ్చెను. సైనికులు ఇట్లేకదా ప్రవర్తింతురు. అతడు ఏమతస్థుడైనను ఆపనులు చేసెడివాడే. ఒక తమాషావిషయ మేమన—అతడు సింధుదేశమును పాలించు ముస్లిం ప్రభువులను బెదిరించెను. అతనికి లొంగిపోయి కప్పము కట్టుటకు సమ్మ తించుటచే వారిని అతడు విడిచిపెట్టెను. బాగ్దాదుకాలీఫునుకూడ అతడు బెదిరించెను. సమరఖండమును తన కీయకున్న తల తీసివేతు ననెను. కాబట్టి మహమ్మదు విజయశీలుడగు సైనికుడుమాత్రమే కాని అంతకన్న అతిశయ మతని కున్నదను భ్రమలో పడకుందుముగాక.

మహమ్మదు తనతోకూడ వాస్తుశాస్త్రజ్ఞు లనేకులను ఇండియానుండి గజనీకి తీసికొనిపోయెను. వారి సహాయమున అక్కడ ఒక చక్కని మసీదును కట్టి దానికి "దివ్యకన్య" యను పే రిడెను. అతనికి తోటలన్న ఇష్ట మెక్కువ.

మధురనుగురించి కొన్నివిషయములు మహమ్మదు ద్వారా మనకు తెలియవచ్చుచున్నవి. దానినిబట్టి అది ఎంత గొప్ప నగరమో మనకు వెల్లడియగును. గజనీలోనున్న తన గవర్నరుకు మహమ్మదు ఈవిధముగా వ్రాయుచున్నాడు: "ఇచ్చట మధురలో వేయిభవనములు కలవు. శ్రద్ధా వంతుల శ్రద్ధవలెనే అవి స్థిరముగా నున్నవి. కోట్లకొలది దీనారములు వ్యయించుటవల్లనే యీ నగర మింత యుచ్ఛ్రలోనికి వచ్చియుండవలెను. 200 సంవత్సరములలో నిట్టి నగరమును నిర్మించుట దుర్లభము."

ఫిర్దౌసీ ఇచ్చిన వృత్తాంతములో మహమ్మదు చేసిన ఈ మధురాపుర వర్ణనము మనము చదువవచ్చును. ఫిర్దౌసీ ఒక గొప్ప పర్షియనుకవి. అతడు మహమ్మదుకాలమున నుండెను. క్రిందటియేడు నీకు వ్రాసిన

జాబులో అతని పేరును. అతడు వ్రాసిన ప్రధానగ్రంథమగు షానామా పేరును ఉదాహరించినట్లు జ్ఞాపకము. మహమ్మదుకోరికపై అతడు షానామా వ్రాసినట్లును, పద్యమున కొక్క బంగారుదీనారము చొప్పున మహమ్మదు అతని కిచ్చెదనని మాటయిచ్చినట్లును ఒక కథ గలదు. కాని ఫిర్దౌసీ కావ్యమును సంక్షేపముగా వ్రాయలేదు. అత డెంతో దీర్ఘ కావ్యము వ్రాసెను. ఎన్నియో వేల పద్యములు గల కావ్యము నతడు మహమ్మదు మ్రోల పెట్టగా అతనిని మహమ్మదు ప్రశంసించెను. తొందరపడి అంత డబ్బు ఇచ్చెదనని మాటయిచ్చితినిగదా యని విచారించెను. అన్నదాని కన్న చాల తక్కువ మొత్తము కవికీయబోయెను. ఫిర్దౌసీ ఆగ్రహముతో ఆ ధనమును తీసికొనుటకు నిరాకరించెను.

హర్షునిమొదలు మహమ్మదువరకును ఒక పెద్ద అంగ వేసితిమి. హిందూదేశచరిత్ర 350 సంవత్సరములో, అంతకుమించిన కాలమో, కొద్ది పరిచ్ఛేదములలో పరామర్శ చేసితిమి. ఈ దీర్ఘకాలమునుగురించి చెప్ప దగిన విషయములు, వినదగిన విషయములు అనేక మున్నవి. కాని నా కవన్నియు తెలియవు. కాబట్టి ఊరకుండుటయే మంచిది. రాజులును, పాలకులును అనేకులు ఒకరితో నొకరెట్లు యుద్ధములు చేసికొనిరో, పాంచాలరాజ్యమువంటి రాజ్యములను సైతము ఉత్తరహిందూస్థానమున నెట్లు స్థాపించుకొనిరో, మహానగరమగు కనోజి ఎట్లు ఒడుదొడుకులపా లాయెనో, దానిని కాశ్మీరరాజులు ఎట్లు వశముచేసికొని కొన్నాళ్లు పాలించిరో, తరువాత బెంగాలురాజును, అటుపిమ్మట దక్షిణాదినుండి వచ్చిన రాష్ట్రకూటులును ఎట్లు వశపరచికొనిరో నీకు కొంత చెప్పగలను. కాని ఇట్లు చెప్పుటవల్ల ప్రయోజనము లేదు. నీకు కంగారుగా నుండును.

హిందూదేశచరిత్రలో ఒక పెద్ద అధ్యాయ మిప్పుడు ముగిసినది. నూతనాధ్యాయము ప్రారంభమగుచున్నది. చరిత్రను గదులుగదులుగా విభజించుట కష్టము మాత్రమేకాదు, తరచు తప్పుకూడను. చరిత్ర ప్రవహించు నదివంటిది. అది పోవుచునేయుండును. అయినను అది మారు

చుండును. ఒక్కొక్కసారి ఒక దశ మారి వేరొక దశ ప్రారంభించును. అట్టి మార్పులు ఒక్కమారు హఠాత్తుగా రావు. అవి ఒకదానిలో ఒకటి లీన మైపోయియుండును. కాన ఇండియాకు సంబంధించినంతవరకు అంతు లేని ఈ చరిత్రనాటకమున ఒక అంకముచివరకు వచ్చితిమి. హిందూ యుగము అని చెప్పబడునది క్రమముగా ముగియుచున్నది. కొన్ని వేల సంవత్సరములపాటు వర్ధిల్లిన హిందూ-ఆర్యసంస్కృతి ఇప్పుడు క్రొత్తగా వచ్చిన మతముతో పోరాడవలసియున్నది. ఈ మార్పు హఠాత్తుగా వచ్చినది కాదని జ్ఞాపకముంచుకొనుము. అది మెల్లమెల్లగా వచ్చినది. ఉత్తరాదికి ఇస్లాం మహమ్మదుతో వచ్చెను. చాలకాలమువరకును దక్షిణాది ఇస్లాందండయాత్రలకు పాలుకాలేదు బెంగాలుసైతము సుమారు మరి 200 సంవత్సరములవరకు దండయాత్రలపాలు కాలేదు. ఉత్తరాదిని చిత్తూరు పిదపకాలపు చరిత్రలో ప్రాణములకుతెగించిన సాహసమునకు ఎంతో ప్రసిద్ధి నందనున్నది. రాజపుత్రవంశము లన్నియు చిత్తూరులో సమావేశమైనవి. కాని నిస్సందేహముగా ఎట్టి యాటంకములను లెక్క గొనక మస్లింవిజయపరంపరలు వ్యాపించదొడగెను. వ్యక్తిసాహస మెంతయైనను దాని నాపలేదు. ప్రాచీన హిందూ - ఆర్యహిందూస్థానము క్షీణదశనందుచున్నందుకు సందేహము లేదు.

పరదేశీయుడు విజయములు సాధించుచుండ వాని నాపలేక హిందూ-ఆర్యసంస్కృతి ఆత్మసంరక్షణకు పూనుకొనెను. ఆత్మసంరక్షణకై అది తన గుల్లలోనికి దూరెను అంతవరకును మృదువై, పరిస్థితులనుబట్టి సర్దుకొనుచున్న వర్ణసంస్థ కర్కశమై స్థిరభావము చెందెను. అది స్త్రీలకు స్వేచ్ఛను తగ్గించెను. గ్రామపంచాయతులుసైతము మెల్లగా చెడిపో జొచ్చెను. అయినను తమకన్న వీర్యవంతులగు జనుల దాడికి తట్టుకొన లేక క్షీణించుచున్నప్పుడుకూడ అది వారిలో పరివర్తన కలిగించజొచ్చెను. తన మార్గములకు వారిని త్రిప్పవలెనని ప్రయత్నించెను. అంతర్గతము చేసికొని తనలో లీనముచేసికొనగల దాని శక్తిప్రభావముచేత కొంతవరకు

తమ్ము జయించినవారిపై తాను సంస్కృతిసంబంధమగు విజయమును సాధించెను.

ఈ పోరాటము హిందూ-ఆర్యనాగరికతకును, గొప్పగా నాగరికత జెందిన అరబ్బులకును కాదని నీవు జ్ఞాపక ముంచుకొనుము. ఈ పోరాటము నాగరికతనంది క్షీణించుచున్న ఇండియాకును, క్రొత్తగా ఇస్లాం మత మవలంబించి, నాగరికత పూర్తిగా లేక అప్పుడప్పుడు దేశద్రిమ్మరులై యుండు మధ్యఆసియాతెగలవారికిని. దురదృష్టవశాత్తు నాగరికత లేమి యను కళంకము మహమ్మదుదండయాత్రల భీతావహము కారణముగా ఇండియా ఇస్లాముకు ముడిపెట్టినది. అందువల్ల సద్భావము చెడినది.

# 52

# యూరోపులోని దేశములు ఆకారము పొందుట

జూన్ 3, 1932

తల్లీ, మన మిప్పు డొకమారు యూరోపును దర్శింతమా? క్రిందటిమారు చూచినప్పు డది దుస్థితిలో నుండెను. రోము కూలబడుటచే పడమటియూరోపులోని నాగరికత కూలబడినట్లే అయినది. కాన్స్టాంటినోపుల్ప్రభుత్వముక్రిందనున్న భాగమును మినహాయించిన తూర్పు యూరోపులోని పరిస్థితులు మరీ పాడుగా నుండెను. యూరోపుఖండము యొక్క అనేకప్రాంతములను హూణుడగు "అట్టిలా" నాశనముచేసెను, కాని తూర్పురోమకసామ్రాజ్యము క్షీణించుచున్నను చిరకాలము నిలిచెను. మధ్యమధ్య జవసత్వములుకూడ చూపుచుండెను.

రోముపతనానంతరము పశ్చిమదేశములు సంక్షుభితమయ్యెనుగాని క్రొత్తవిధముగా పరిస్థితులు కుదుటబడజొచ్చెను. అవి కుదుటబడుటకు చాలకాలము పట్టెను. నూతనస్వరూపము క్రమక్రమముగ స్పష్టమగు

పొందెను. భక్తుల సహాయమువల్లను, శాంతస్వభావుల సహాయమువల్లను, ఒక్కొక్కతూరి వీరులగు క్రైస్తవరాజుల ఖడ్గసహాయమువల్లను క్రైస్తవము వ్యాపింపదొడగెను. క్రొత్తరాజ్యములు తలయెత్తెను. ఫ్రాన్సు, బెల్జియం, కొంతభాగము జర్మనీదేశములలో ఫ్రాంకులు (వీరును, ఫ్రెంచివారును ఒక్కరే అనుకొందువేమో, ఇంకను కారు) ఒక రాజ్యమును స్థాపించిరి. వారి పాలకుడు క్లోవిస్ అనువాడు. అతడు క్రీ. శె. 481 నుండి 511 వరకు రాజ్యముచేసెను. దీనినే మెరోవింజియన్ వంశ మందురు. క్లోవిస్ తాతపేరునుబట్టి ఈపేరు వచ్చినది. కాని ఈ రాజులు వారి కొలువులోని ఒక ఉద్యోగస్థునివల్లనే మరుగుపరచబడిరి. అతడు రాచనగరునకు అధ్యక్షుడు (Mayor). ఈ మేయర్లు సర్వాధికారులై వంశపరంపరగా మేయర్లగుచుండిరి. వారే నిజమునకు పాలకులు. రాజనామము దాల్చినవారు వట్టి కీలుబొమ్మలే.

వీరిలో రాజనగరాధ్యక్షుడగు • నొక మేయరు—ఛార్లెసు మార్టెల్ అనువాడు క్రీ. శె. 732 సంవత్సరమున ఫ్రాన్సులో టూర్సువద్ద జరిగిన గొప్పయుద్ధములో సారసనుల నోడించెను. ఈ విజయమువలన సారసనువిజయయాత్రల కవరోధము కలిగినది. అతడు యూరోపును రక్షించెనని క్రైస్తవులు తలచిరి. ఇందుచే అతని ప్రతిష్ఠయు, కీర్తియు వృద్ధినందెను. శత్రువుల బారినుండి క్రైస్తవప్రపంచమును రక్షింపగలిగిన యోధుడతడని ప్రజలు భావింపదొడగిరి. రోములోని పోపులు కాన్స్టాంటి నోపుల్ చక్రవర్తితో అన్యోన్యముగా లేరు. కాన వారు ఛార్లెసుమార్టెల్ సహాయము నాసించియుండిరి. అతని కొడుకు—పెపిన్ అనువాడు తాను రాజనామము ధరించ నిశ్చయించి, కీలుబొమ్మగా నున్న రాజును తొలగించెను. పోపు సంతోషముతో ఆ కార్యము నంగీకరించెను.

పెపిన్‌కుమారుడు ఛార్లిమాన్. పోపు మరల కష్టములలో చిక్కుకొనెను. తన సహాయార్థము ఛార్లిమాను నర్థించెను. ఛార్లెసు సహాయమునకై వెళ్లి పోపుశత్రువులను తరిమివేసెను. క్రీ. శె. 800 సంవత్సర

మున క్రిస్టమసుదినమున క్రైస్తవాలయమున గొప్ప యుత్సవము జరిగెను. అప్పుడు పోపు ఛార్లిమానును రోమకచక్రవర్తిగా పట్టము గట్టెను. ఆ దినమునుండి పవిత్రరోమకసామ్రాజ్యము ప్రారంభమయ్యెను. దీనినిగురించి ఇదివరలో నీకు వ్రాసియుంటిని.

అది వింత సామ్రాజ్యము. దానితరువాత చరిత్ర మరింత వింతగా నుండెను. అది ఆలిస్ః థలోని ఛెషైరుపిల్లివలె క్రమక్రమముగా అంతర్ధానమగుచు, దేహము మాయముకాగా మందహాసముమాత్రము మిగిల్చెను. ఇది ఇకముందు జరుగనున్నది కొబట్టి ఇప్పుడు భావికాలములోనికి చూడనవసరములేదు.

ప్రాచీనపశ్చిమరోమకసామ్రాజ్యము జరుగుచుపోయి ఈ రూపమును గైకొనగా వచ్చినది కా దీ పవిత్రరోమకసామ్రాజ్యము. ఇది దానికన్న భిన్నమైనది. ఇదియే నిజమగు సామ్రాజ్యమని దాని భావన. చక్రవర్తి ప్రపంచములో అందరిమీదను ఆధికారియే— ఒక్క పోపుమీద తప్ప. పెక్కు శతాబ్దులకాలము పోపు, చక్రవర్తి—వీరిలో ఎవరు గొప్పవారను వివాదము పుట్టెను. ఈ విషయముకూడ తరువాత రానున్నది. ఈ నూతనసామ్రాజ్యము ఉన్నతస్థితిలో నుండెను. "ప్రపంచమునకు యజమానురా"లని పిలువబడు రోజులలోనున్న ప్రాచీనరోమకసామ్రాజ్యము పునరుద్ధరింపగా వచ్చిన దిది యని తలపబడుచుండెను. కాని దీని కొక నూతనభావన కలుపబడెను. ఆ భావన క్రైస్తవము, క్రైస్తవలోకము అనునది. కాన నీ సామ్రాజ్యము "పవిత్ర"మైనది. చక్రవర్తి భూలోకమున భగవంతుని ప్రతినిధిగా తలపబడెను. పోపుకూడ అంతే. ఒకడు రాజకీయవిషయములను చూచును. రెండవవాడు ఆధ్యాత్మికవిషయములను చూచును. ఇది వారి యభిప్రాయమైయుండెను. దీనినుండియే రాజత్వము దైవదత్తాధికార (Divine right)మను భావన యూరోపులో తలయెత్తియుండు నని నా యభిప్రాయము. చక్రవర్తి "క్రైస్తవమతరక్షకుడు." ఇంగ్లీషురాజు నేడుకూడ "మతరక్షకు"డనిపించుకొనుచున్నాడు.

ఈ చక్రవర్తిని కాలీఫాతో పోల్చిచూడుము. కాలీఫాను "మత భక్తుల నాయకు" (Commander of the faithful) డనెడివారు. ప్రారంభమున కాలీఫు నిజముగా చక్రవర్తియును, పోపునుకూడ. తరువాత నతడు వట్టి కీలుబొమ్మ యయ్యెను.

కాన్‌స్టాంటినోపులు చక్రవర్తులు క్రొత్తగా పడమటలేచిన "పవిత్ర రోమకసామ్రాజ్యమును" అంగీకరించలేదు. ఛార్లిమానుకు పట్టముకట్టిన సమయమున ఐరీని అను స్త్రీ కాన్‌స్టాంటినోపులులో చక్రవర్తిని యయ్యెను. ఆమె తన పుత్రుని హత్యచేసి చక్రవర్తిని యైనది. ఆమెకాలమున పరిస్థితులు బాగుగా లేవు. పోపు కాన్‌స్టాంటినోపులునుండి విడిపోయి ఛార్లిమానును చక్రవర్తిగా చేయుట కిది యొక కారణము.

ఇప్పుడు ఛార్లిమాను పశ్చిమ క్రైస్తవప్రపంచమున కధినాయకుడు. భూలోకమున భగవంతుని ప్రతినిధి. పవిత్రసామ్రాజ్యమునకు చక్రవర్తి. ఎంతటి వాగాడంబరము! కాని ఈమాటలు ప్రయోజనకరముగానే ఉండెను. ప్రజల కన్నులు గప్పి మోసముచేయుటకు పనికివచ్చినవి. భగవంతుని, మతమును అండగా పెట్టుకొని అధికారులు తరచు ఇతరులను మోసముచేసి తమ బలమును వృద్ధిచేసికొనిరి. సామాన్యజనులకు రాజును, చక్రవర్తియు, మతాచార్యుడును అస్పష్టమగు ఛాయామాత్ర పురుషులు. దేవుళ్ళవలెనే సామాన్యజీవితముతో సంబంధము లేకుండ ఉందురు. ఈ రహస్యమే సామాన్యమానవుడు వారిని చూచి భయపడుటకు కారణము. రాజుల కొలువుకూటములలోనుండు విపులమగు పద్ధతులు, మర్యాదలు, ఆచారకాండలను దేవాలయములలోగాని, క్రైస్తవాలయములలోగాని కానవచ్చు విపులమగు పూజాకాండలతో పోల్చిచూడుము. ఆ వంగివంగి నమస్కారములే, ఆ సాష్టాంగనమస్కారములే, ఆ చేతులు పిసుకుకొనుటయే అక్కడను,ఇక్కడనుకూడ. ఇట్టి భక్తిభావమును చూపుటకు చీనావారు నుదురుతో భూమిని తాకుదురు. చిన్నతనము మొదలుకొని, అనేకవిధములుగా అధికారమును పూజించుట మనకు నేర్పుదురు. ఇది భయముతో చేయుచున్న పూజగాని భక్తితో చేయుచున్నది కాదు.

బాగ్దాదు నేలిన హరునల్‌రషిదుసమకాలికుడు ఛార్లిమాను. అతనితో ఛార్లిమాను ఉత్తరప్రత్యుత్తరములు జరిపెను. ఈ విషయమును గమనించుము. ఇద్దరును మిత్రభావముతో నుండి తూర్పురోమకసామ్రాజ్యముతోను, స్పెయినులోని సారసనులతోను యుద్ధము చేసిన బాగుండునని ఛార్లిమాను సూచించెను. ఈ సూచనకు ఫలితముగా ఏమియు జరిగినట్లు లేదు. అయినప్పటికిని రాజులయొక్కయు, రాజకీయవేత్తల యొక్కయు బుద్ధులు ఏవిధముగా పనిచేయుచున్నదియు మనకు సుస్పష్టమగుచున్నది. "పవిత్రుడగు" చక్రవర్తియు, క్రైస్తవప్రపంచమున కధిపతియు నగువాడు బాగ్దాదుకాలీఫుతో చేతులుకలిపి వేరొక క్రైస్తవ ప్రభుత్వమును, అరబ్బీప్రభుత్వమును డీకొనబూనుట ఎట్టికార్యమో ఊహించుము. స్పెయినులోని సారసనులు బాగ్దాదులోని అబ్బాసీదుకాలీఫుల అధికారమును అంగీకరించ నిరాకరించి రన్నమాట జ్ఞాపకముంచుకొనుము. వారు స్వతంత్రులుగా నుండిరి. ఈ కారణమున బాగ్దాదుకు వారిపై కోపముగా నుండెను. కాని వారు సుదూరమున నుండుటచే యుద్ధము పొసగుటకు వీలులేకుండెను. కాన్‌స్టాంటినోపులుకును, ఛార్లిమానుకును ప్రేమబంధము లంతగా లేవు. ఇక్కడకూడ వారు యుద్ధములో దిగుటకు దూర మడ్డు వచ్చినది. అయినను సూచనమాత్రము జరిగినది. క్రైస్తవచక్రవర్తియు, అరబ్బీచక్రవర్తియు కలిసి వేరొక క్రైస్తవచక్రవర్తిమీదకును, అరబ్బీ ప్రభుత్వముమీదకును యుద్ధమునకు వెడలవలె నను సూచన. రాజుల మనస్సులలోని నిజమైన యుద్దేశములు అధికారమును, బలమును వృద్ధి చేసికొనుట, ధనమును సంపాదించుటయు. ఇందుకొరకై తరచుగా మతమును వ్యాజముగా పెట్టుకొందురు. ప్రతిచోటను ఇట్లే జరిగినది. ఇండియాకు మహమ్మదు మతముపేరిట వచ్చి లాభము నందెను. మతముపేరిట చేసిన పనులు తరచు ఫలవంతము లైనవి.

కాని ప్రజల అభిప్రాయములు కాలమునుబట్టి మారుచుండును. ఎప్పుడో జీవించియున్న మానవుల మంచిచెడ్డలను మన మిప్పుడు నిర్ణ

యించలేము. ఇది మనము జ్ఞాపకముంచుకొనవలెను. నేడు మనకు సామాన్యముగా స్పష్టముగా నుండు విషయములు వారికి ఎంతో వింతగా తోచియుండును. వారి అభ్యాసములును, ఆలోచనలును మనకు వింతగా కని పించును. ప్రజలు ఉన్నతాదర్శములనుగూర్చియు, పవిత్రసామ్రాజ్యమును గూర్చియు, భగవంతుని ప్రతినిధినిగూర్చియు, క్రీస్తువికారు (Vicar) అయిన పోపునుగూర్చియు ప్రసంగించుకొనుచున్న కాలమున పశ్చిమదేశ ములలోని పరిస్థితులు ఎంత పాడుగా నుండవలెనో అంత పాడుగా నుండెను. ఛార్లిమానుపరిపాలనానంతరము ఇటలీరోముల స్థితి జుగుప్సా కరముగ నుండెను. గుణము లేని స్త్రీపురుషులు పలువురు రోములో తమ కిష్టమువచ్చినట్లు సంచరించిరి. పోపులను నియమించిరి. పోపులను తొల గించిరి.

రోమ పతనానంతరము పశ్చిమయూరోపులో వ్యాపించిన కలవర మును చూచి, అనేకులు రోమను పునరుద్ధరించినచో పరిస్థితులు చక్క బడునని తలచిరి. తమకు చక్రవర్తి లేకుండుట పరువునష్ట మనికూడ కొందరు తలచిరి. ఈ కాలమందున్న ఒక గ్రంథకర్త ఇట్లు చెప్పు చున్నాడు: "క్రైస్తవులలో చక్రవర్తి యను పేరు వాడుకలో లేకున్నచో క్రైస్తవులను అన్యమతస్థులు నిందింతురేమో అని ఛార్లసును చక్రవర్తిగా చేసిరి."

ఛార్లిమానుసామ్రాజ్యములో ఫ్రాన్సు, బెల్జియం, హాలెండు, స్విట్జర్లాండు, సగము జర్మనీ, సగము ఇటలీ చేరియుండెను. దాని నైరృతిని అరబ్బుల పాలనమందున్న స్పెయి నుండెను. ఈశాన్యమున స్లావు మున్నగు తెగలవా రుండిరి. ఉత్తరమున డేనులు, నార్తుమెన్ ఉండిరి. ఆగ్నేయమున బల్గేరియనులు, సెర్బియనులు, వారి కావల కాన్స్టాంటి నోపులుక్రింద నున్న తూర్పురోమకసామ్రాజ్యము ఉండెను.

814 సంవత్సరమున ఛార్లిమాను మరణించెను. వెంటనే సామ్రా జ్యమును విభజించుకొనుటకు అల్లరులు బయలుదేరెను. అతని సంతతి

వారు-కార్లోవింజియనులు అనువారు (ఛార్లెసుకు లాటిన్ కరోలస్) అట్టి తెలివితేటలు కలవారు కారు. వారిలో కొందరి బిరుదములనుబట్టి యీ విషయము విశదమగుచున్నది: లావుపాటివాడు; బట్టతలవాడు; భక్తుడు— ఇవి బిరుదములు. ఛార్లిమానుసామ్రాజ్య విభజనము కారణముగా జర్మనీ, ఫ్రాన్సుదేశము లిప్పుడు ఆకారమును పొందదొడగెను. క్రీ. వె. 843 సంవత్సరమునుండి జర్మనీ ఒక జాతిగా పరిగణింపబడుచున్నది. క్రీ. వె. 962 మొదలు 973 వరకు రాజ్యముచేసిన ఘనుడగు ఒట్టోచక్రవర్తి జర్మనుల నందరిని ఒక జాతిగా చేసెను. ఫ్రాన్సు అప్పటికే ఒట్టో చక్రవర్తిసామ్రాజ్యములో ఒక భాగమై యుండలేదు. 987 సంవత్సరమున హ్యూకేపెట్ అనువాడు దుర్బలులగు కార్లోవింజియన్‌రాజులను తరిమివేసి ఫ్రాన్సును స్వాధీనముచేసికొనెను. స్వాధీనముచేసికొనుటకూడ అంత కష్టమనిపించలేదు. ఫ్రాన్సు అప్పుడు పెద్ద చీలికలై యుండెను. ఇవి స్వతంత్రులగు కులీనుల (Nobles) వశమం దుండెను. వీ రొకరితో నొకరు పోరాడుకొనుచుండిరి. కాని వీరు చక్రవర్తిని, పోపును చూచి భయపడుచుండిరి. వీరి నెదిరించుటకు వారు ఏకమైరి. హ్యూకేపెట్ రాకతో ఫ్రాన్సు ఒక జాతిగా పరిగణింపబడెను. ఈ తొలిరోజులలోనే జర్మనీ ఫ్రాన్సులకు స్పర్ధలు పుట్టెను మన కాలమువరకు, వేయిసంవత్సరముల పాటు ఈస్పర్ధలు నిలిచియేయుండెను. ఇద్దరు పొరుగుజాతులు, పొరుగు దేశములు, సంస్కృతికలవారు, సర్వసంపన్నులు అయిన ఫ్రెంచివారును, జర్మనులును తరతరములు ప్రాతపగలను మరచిపోకుండ పోషించుకొనుచుపోవుట వింతగా నున్నది. బహుశా తప్పు వారిది కాదేమో. వారు పుట్టిపెరిగిన రాజకీయపద్ధతు లట్టివి.

ఈకాలముననే రష్యాకూడ చరిత్రరంగమున ప్రవేశించెను. క్రీ. వె. 850 సంవత్సరమున, ఉత్తరమునుండి వచ్చిన రూరిక్ అనువాడు రష్యారాజ్యమునకు పునాదులు వేసినట్లు చెప్పుదురు. ఆగ్నేయమున బల్గేరియనులు నివాసము లేర్పరచుకొనుచున్నారు. వారు కలహశీలమునుకూడ చూపు

చుండిరి. సెర్బియనులును అంతే. మాగ్యారులు-అనగా హంగేరియనులును, పోలులును రాష్ట్రపవిత్రరోమకసామ్రాజ్యమునకును. నూతనరష్యాకును మధ్యగా రాష్ట్రములు స్థాపించ ప్రయత్నించుచుండిరి.

ఇంతలో ఉత్తరయూరోపునుండి పశ్చిమదక్షిణదేశములకు మనుష్యులు నావలపై వచ్చి ఆ దేశములను తగులబెట్టిరి, హత్యలు చేసిరి, దోపిళ్ళు చేసిరి. పీడించుటకును, కొల్లగొట్టుటకును ఇంగ్లాండుకు వెళ్ళిన డేనులను, ఇతర నార్తుమెన్‌లను గురించి నీవు చదివియున్నావు. ఈ నార్తుమెన్‌లను నార్సుమెన్లు అనియు, నార్మనులనియు అందురు. వీరు మధ్యధరాసముద్రమునకు పోయి, నావలలో పెద్ద నదులగుండా పైకి పోయి,పోయినచోట్లనెల్ల దోచుకొని, హత్యలుచేసి కొల్లగొట్టిరి. ఇటలీలో అరాజక ముండెను. రోము దుస్థితిలో నుండెను. వారు రోమును కొల్లగొట్టి కాన్‌స్టాంటినోపులునుసైతము బెదిరించిరి. ఈ బందిపోటుదొంగలు, ఈ దోపిడిగాండ్రు ఫ్రాన్సువాయవ్యభాగమును పట్టుకొనిరి, అక్కడనే నార్మండీ, దక్షిణఇటలీ, సిసిలీ లుండెను. వారక్కడ క్రమముగా నివాసము లేర్పరచుకొని ప్రభువులు, భూస్వాములు అయిరి. దొంగలు ఐశ్వర్యవంతు లైనప్పుడు తరచు దొర లగుచురుగదా! ఫ్రాన్సులో నున్న నార్మండీలో నివసించు నార్మనులే క్రీ. వె. 1066 సంవత్సరమున విజయసాధకు డని పేర్గన్న విలియంపరిపాలనలో నున్న ఇంగ్లాండును జయించిరి. చూచితివా, ఇంగ్లాండుకూడ ఆకారము పొందుచున్నది.

యూరోపులో దాదాపు క్రీస్తుశకము వేయిసంవత్సరములకాలము చివరవరకు మనము వచ్చితిమి. ఈ కాలమునందే గజనీమహమ్మదు ఇండియాపై దండెత్తుచుండెను. సుమారు ఈ కాలమునందే బాగ్దాదులోని అబ్బాసీదుకాలీఫుల యధికారము భగ్నమగుచుండెను. పశ్చిమ ఆసియాలో సెల్‌జూకు తురుష్కులు ఇస్లామును పునరుజ్జీవింపజేయుచుండిరి. స్పెయిను అరబ్బుల వశమందే యుండెను. కాని అచ్చటి అరబ్బులకు మాతృదేశమగు అరేబియాతో సంబంధము వీడిపోయెను.

అంతే కాదు. బాగ్దాదుపరిపాలకులతో వారు సఖ్యముగాకూడ లేరు. ఉత్తరఆఫ్రికా బాగ్దాదుతో నిమిత్తములేకుండ స్వాతంత్ర్యము వహించెను. ఈజిప్టులో స్వతంత్రప్రభుత్వమే కాదు, ప్రత్యేకముగా దానికి కాలీఫులుకూడ ఉండిరి. కొంతకాలముపాటు ఈజిప్టులోని కాలీఫు ఉత్తరఆఫ్రికానుకూడ పాలించెను.

# 53

## ఫ్యూడల్ పద్ధతి

### (Feudal System)

జూన్ 4, 1932

వెనుకటి జాబులో నేటి ఫ్రాన్సు, జర్మనీ, రష్యా, ఇంగ్లాండుల ప్రారంభములను కొద్దిగా చూచితిమి. ఆరోజులలో జనులు ఆ దేశములను గురించి ఇప్పుడు మనము భావించుచున్నవిధముగానే భావించుచుండిరని అనుకొనబోకుము. ఇంగ్లీషువారనియు, ఫ్రెంచివారనియు, జర్మనులనియు ఇట్లు జాతులక్రింద వారిని మన మిప్పుడు భావించుచున్నాము. వారిలో ప్రతియొక్కరును తమ దేశమును మాతృదేశ మనియో, పితృదేశ (Father-land) మనియో భావింతురు. నేడు ప్రపంచములో వ్యక్తమగుచున్న జాతీయభావ (Nationality) మిదియే. స్వాతంత్ర్యమునకు మనము చేయుచున్న సమరము "జాతీయ" సమరము. ఈ జాతీయభావము ఆ రోజులలో లేదు. అప్పుడు క్రైస్తవప్రపంచభావము, అనగా క్రైస్తవుల సంఘమునకు చెందియుండుట యను భావము ఉండెను. క్రైస్తవేతరుల (Heathen) సంఘమునకుగాని, మస్లిముల సంఘమునకుగాని భిన్నముగానుంటి మను భావన. అవిధముగానే మస్లిములు మతాంతరులకు భిన్నముగా ఇస్లాంప్రపంచమునకు చెందియుంటి మను భావన కలిగియుండిరి.

కాని ఈ క్రైస్తవ, ఇస్లాంభావనలు అస్పష్టభావనలుగానే ఉండెను.

అవి ప్రజల దైనికజీవనమునకు సంబంధించియుండలేదు. ప్రత్యేకసందర్భములలో మాత్రము క్రైస్తవముకొరకో, ఇస్లాంకొరకో పోరాడుటకై మతోద్రేకము రెచ్చగొట్టబడును. ఆనాడు జాతీయతకు బదులు మనుష్యునకును మనుష్యునకును ఒకవిధమగు విశేషసంబంధ ముండెను. ఇది ఫ్యూడల్‌సంబంధము. ఫ్యూడల్‌పద్ధతి యనుదాని ననుసరించి యిది జనించును. రోముపతనానంతరము పశ్చిమదేశములం దున్న ప్రాతపద్ధతి చితికిపోయినది. సర్వత్ర అల్లరులు, అరాజకము, హింస, బలాత్కారము ప్రబలెను. బలము గలవారు చేతికి చిక్కిన దంతయు తమవశము చేసికొనుచుండెడివారు. వారికన్న బలవంతులు వచ్చి వారిని త్రోసివేసెడివారు. బలమైన కోటలు నిర్మించి, ఈ కోటలయందు వసించు ప్రభువులు (Lords) కొందరు జనులను వెంటదీసికొనిపోయి పల్లెలపై బడి వారిని బాధించెడివారు, ఒక్కొక్కసారి తమవంటి ప్రభువులతోనే యుద్ధములు కూడ చేయుచుండిరి. బీదరైతులును, పొలములలో పనిచేయువారును ఎక్కువగా బాధపడజొచ్చిరి. ఈ అల్లరినుండి ఫ్యూడల్ పద్ధతి లేచెను.

రైతులు కట్టుగా లేకపోవుటవల్ల ఈ బందిపోటు బ్యారనుల (Barons) తో పోరాడి ఆత్మరక్షణ చేసికొనజాలకుండిరి. వారిని కాపాడుటకు బలమైన కేంద్రప్రభుత్వము లేకుండెను. కాబట్టి వారు అప్పటి పరిస్థితుల కనుగుణముగా నడచుకొనుట మంచిదని తలచి, తమ్ము కొల్లగొట్టు కోటలోని ప్రభువుతో సంధిచేసికొనిరి. తమ పొలములమీద నుండి వచ్చు ఫలసాయములో కొంతభాగము వాని కిచ్చుటకును, కొన్ని విధములుగా అతనికి సేవచేయుటకును ఒప్పుకొనిరి. ఆ ప్రభువు తమ్ము కొల్లగొట్టి బాధించరా దనియు, ఇతరప్రభువులు తమ్ము బాధించకుండ కాపాడవలయు ననియుకూడ వారు ఒప్పన్నముచేసికొనిరి. చిన్నకోట ప్రభువు పెద్దకోటప్రభువుతో నిట్లే సంధిచేసికొనెను. కాని చిన్నప్రభువు పెద్దప్రభువునకు పొలమునుండి వచ్చు ఫలసాయము ఈయలేదు. అతడు రైతు కాడు. పంట పండించువాడు కాడు. కాన అవసరము వచ్చినప్పుడు

యుద్ధసహాయము చేయుటకు మాత్రము ఒప్పుకొనును. పెద్దకోటప్రభు వన్ననో, చిన్నప్రభువును కాపాడుటకు సమ్మతించును చిన్నప్రభువు పెద్ద ప్రభువు సామంతు (Vassal) డాయెను. ఇట్లు సోపానక్రమమున వారు ఇంకను పెద్దప్రభువులవరకును, కులీనులవరకును పోయి చివరకు రాజు వద్ద చేరిరి. రాజు ఫ్యూడల్ విధానమునందు అందరికన్న పైనుండెను. వా రక్కడ ఆగలేదు. వారి భావనలో స్వర్గమందు సైతము ఫ్యూడల్ పద్ధతి కానవచ్చెను. స్వర్గమందు ట్రినిటీ (Trinity), దానిపైని భగవంతుడు దాని కధ్యక్షుడు!

యూరోపులో ప్రవేశించిన అల్లరులకు ఫలితముగా క్రమక్రమమున వృద్ధినందిన పద్ధతి యిది. ఆ కాలమున కేంద్రప్రభుత్వము లేదను సంగతి నీవు జ్ఞాపకముంచుకొనవలెను. పోలీసులు మున్నగువారు లేరు. ఒక భూభాగమునకు హక్కు గలవాడు దాని యజమానియు, ప్రభువును. ఆ భూభాగముపై నివసించు ప్రజలందరిని అతడు పాలించును. వారి ప్రభు వతడు. అత డొక చిన్న రాజువంటివాడు. పొలములనుండి ఫలసాయ మును, వారి సేవను పొంది అందుకు బదులుగా వారిని రక్షించవలసి యుండెను. అతడు ప్రజల అధిపతి. ప్రజ లతని కమతగాండ్రు (Serfs). పేరుమట్టుకు అతడు తనకన్న పెద్దప్రభువుపేర భూముల నుంచుకొను వాడు. పెద్దప్రభువుసామంతుడుమాత్రమే యితడు. పెద్దప్రభువున కితడు యుద్ధసహాయము చేయుచుండెను.

క్రైస్తవమతసంస్థకు సంబంధించిన ఉద్యోగులు సైతము ఫ్యూడల్ పద్ధతిలో చేరియుండిరి. వారు పురోహితులును, ఫ్యూడల్ ప్రభువులునుకూడ. జర్మనీలో సుమారు సగముభూమియు, ధనమును బిషప్పుల (Bishops) చేతులలోను, మతాధికారుల (Abbots) చేతులలోను ఉండెను. పోపు తా నొక ఫ్యూడల్ ప్రభువు.

ఈ పద్ధతి యంతయు సోపానక్రమముననను, తరగతులుగాను ఉండెను. ప్రజలందరును సమానులను ప్రసక్తియే ఇందు లేదు. అట్టడుగున

కమతగాం డ్రుండిరి. సంఘనిర్మాణభారమునంతయు వారు భరించవలసి యుండెను. చిన్నప్రభువులు, పెద్దప్రభువులు, అంతకన్న పెద్ద ప్రభువులు, రాజు—ఇది సంఘనిర్మాణము. క్రైస్తవమతసంస్థకు, అనగా బిషప్పులకు, మతాధికారులకు, కార్డినలు(Cardinals)లకు, సామాన్యపురోహితులకు అగు వ్యయమంతయుకూడ వారిమీదనే పడెను. ఆహారమును పండించుటకుగాని, ఇతరవిధములుగా దేశభాగ్యమును వృద్ధిచేయుటకుగాని చిన్న ప్రభువులుగాని, పెద్దప్రభువులుగాని ఎట్టి పనులను చేయుట లేదు. పని చేయుట ప్రతిష్ఠకు లోపమని వారు భావించుచుండిరి. వారి ముఖ్యవృత్తి యుద్ధముచేయుట. యుద్ధములు లేనప్పుడు వారు వేటకు పోవువారు; లేదా ఉత్తుత్తయుద్ధములు, క్రీడాయుద్ధములు (Tournaments) చేసెడివారు. వారికి చదువు రాదు. వారు వట్టి మోటుమనుష్యులు. యుద్ధములు చేయుట, త్రాగుట, తినుట తప్ప ఇతరవిధములగు వేడుకలు వారికి తెలియవు. కాన ఆహారమును, ఇతరఅవసరద్రవ్యములను ఉత్పత్తిచేయుభారము రైతుల మీదను, శిల్పుల (పనివాండ్ర)మీదను పడెను. ఈ పద్ధతికి శిఖరమున రాజుండెను. ఇతడు భగవంతుని సామంతుడుగా భావింపబడుచుండెను.

ఫ్యూడల్పద్ధతిలో ఇమిడియున్న భావ మిట్టిది. పేరుమట్టుకు ప్రభువులు తమ సామంతులను, కమతగాండ్రను రక్షించవలసియుండెను. కాని ఆచరణలో అట్లు జరుగుట లేదు. వారు సర్వతంత్రస్వతంత్రులు. వారిపై అధికారులుకాని, రాజుగాని వారి చర్యలను నిరోధించుట లేదు. రైతులు మిక్కిలి బలహీనులగుటచే వారు చేయుమన్నట్లు చేయుచుండిరి. మిక్కిలి బలవంతులగుటచే కమతగాండ్రనుండి వారు తీసికొనగలిగినదంతయు తీసికొనెడివారు. మిగిల్చిన కొద్దితో కమతగాండ్రు దుఃఖభాజనమగు జీవితములను గడుపవలసివచ్చుచుండెను. ప్రతిదేశమందును, అన్ని కాలములందును భూస్వాముల పోకిళ్లు ఈవిధముగానే ఉండునుకదా. భూస్వాములుగా నుండువారికి కులీనత్వము (Nobility) సిద్ధించెను. బందిపోటు నైటు (Knight) భూమిని గ్రహించి కోటను కట్టుకొని

కులీనప్రభు వగుచున్నాడు. ప్రజ లాతని గౌరవించుచున్నారు. భూస్వామిత్వమువల్ల వారికి అధికారముకూడ సంక్రమించెను. ఈ యధికారమును పురస్కరించుకొని అతడు రైతులనుండియు, పంటలు పండించువారినుండియు, పనివాండ్రనుండియు రాబట్టగలిగిన దంతయు రాబట్టువారు. శాసనములుకూడ భూస్వాముల కనుకూలముగా నుండెను. శాసనములను చేసినది వారో, వారి స్నేహితులో కదా. ఈ కారణమువల్లనే భూములు వ్యక్తుల కుండరాదనియు, సంఘమున కుండవలయు ననియు పలువురు భావింతురు. అవి సంఘమునకో, ప్రభుత్వమునకో చెందియున్నయెడల, అచ్చట నివసించు ప్రజ లందరికిని చెందియున్నట్లే. ఏఒక్కడును ఇతరులను తన లాభముకొరకు బాధపెట్టుటగాని, అనుచితలాభములను పొందుటకాని తటస్థించదు.

కాని ఈ యభిప్రాయములు ఇంకను రానైయున్నవి. మనము ప్రసంగించుకొను కాలములో ప్రజల కిట్టి యభిప్రాయములు లేవు. ప్రజాసామాన్యము దైన్యస్థితిలో నుండెను. కష్టముల గడచి గట్టెక్కు మార్గములు వారికి కనిపించుట లేదు. కాన వారు సహించియుండిరి. దుర్భర కష్ట జీవితములను గడపుచుండిరి. అన్నికాలములందును వారికి వినయ విధేయతలు బోధింపబడుచుండెను. విధేయతగా నుండు అలవాటు ఒకమారు పట్టుబడినవా రెట్టికష్టములనైన భరింపగలుగుదురు. ఇట్లు ఒక తట్టు ఫ్యూడల్ ప్రభువులతోను, వారి పరివారవర్గముతోను, ఇంకొకతట్టు కటికదరిద్రులతోను సంఘము వృద్ధియగుచుండుట మనము చూడనగును. ప్రభువుయొక్క రాతికోటచుట్టును కమతగాండ్ర మట్టిగుడిసెలో, కర్ర గుడిసెలో క్రిక్కిరిసియుండెను. ఒకదాని కొకటి మిక్కిలి దూరముగా రెండు ప్రపంచము లుండెను—ప్రభువుప్రపంచము, కమతగాండ్ర ప్రపంచము. ప్రభువు బహుశా తన కమతగాండ్రను పశుతుల్యులనుగా చూచుచుండెను.

ఒక్కొక్కవేళ చిన్న పురోహితులు ప్రభువులనుండి కమత

గాం(డ్రను కాపాడ యత్నించుచుండిరి. కాని తప్పనిసరిగా పురోహితు లును, మతగురువర్గమును (Clergy) ప్రభువుల పక్షమే అవలంబించు చుండిరి. నిజమునకు బిషప్పులును, మతాధికారులును స్వయముగా ఫ్యూడల్ ప్రభువులేకదా.

ఇండియాలో మన కెప్పుడును ఇట్టి ఫ్యూడల్‌పద్ధతి లేదు. కాని దానిని బోలినది వేరొకటి కలదు. మన ఇండియన్‌సంస్థానములు వారి పాలకులతో, రాజబంధువులతో, చిట్టిప్రభువులతో నేటికిని కొన్ని ఫ్యూడల్ ఆచారములను నిలుపుకొన్నవి. హిందువుల వర్ణవ్యవస్థ, ఫ్యూడల్‌పద్ధతి నేవిధముగాను పోలనప్పటికిని, సంఘమును తరగతులుగా విభజించినది. నే నిదివరలో చెప్పియుంటి ననుకొందును—చీనాలో నిరంకుశత్వ మెన్నడును లేదు; ఇట్టి ప్రత్యేకాధిక్యత గల తరగతియును లేదు. ప్రభు త్వోద్యోగములకు పరీక్షలు పెట్టుట అను వారి ప్రాచీనాచారము కారణ ముగా ఎవ్వరైనను ఉన్నతోద్యోగమును బడయవచ్చును. కాని ఆచరణలో అనేకనియమము లుండియుండవచ్చును.

ఫ్యూడల్ పద్ధతిలో సమత్వము, స్వేచ్ఛ యను భావనలు లేవు. హక్కులు, బాధ్యతలు అను భావనలు ఉండెను. అనగా ఫ్యూడల్ ప్రభువు తన హక్కుగా ప్రజల సేవను, ఫలసాయమును పొందును. వారిని కాపాడుట అతని బాధ్యతగా భావించును. కాని హక్కులు ఎన్న డును మరపునకు రావు. బాధ్యతలు తరచు ఉపేక్షింపబడును. కొన్ని యూరోపియన్ దేశములలోను, ఇండియాలోను నేడుకూడ కొందరు భూస్వాములు వారి రైతులనుండి పెద్దమొత్తములను పన్నులక్రింద వసూలుచేతురు. వారు పిసరంత పని చేయరు. వారికి బాధ్యత లున్నవను భావన మరచి ఎంతకాలమో యైనది.

యూరోపులోని ప్రాచీనఅనాగరికతెగలవారు స్వాతంత్ర్యమన్న చెవికోసికొనువారు. స్వాతంత్ర్యరహితమైన ఫ్యూడల్‌పద్ధతికి క్రమక్రమ ముగా వారు మనస్సమాధానము చేసికొనుట వింతయే. ఈ తెగలవారు

తమ నాయకుల నెన్నుకొని వారిని అదపులో పెట్టెడివారు. ఇప్పుడు అంతటను నిరంకుశత్వమే. ఎన్నిక లను మాటయే లేదు. ఈ మార్పు ఎట్లు వచ్చినదో నేను చెప్పజాలను. బహుశా మతసంస్థ వ్యాపింపజేసిన ధర్మములే ప్రజాస్వామికమునకు విరుద్ధమగు అభిప్రాయములు ప్రాకుటకు కారణ మైయుండును. రాజు భూలోకమున భగవంతుని ఛాయ అయ్యెను. భగవంతుని ఛాయపట్ల మాత్రము నీ వెట్లు అవిధేయత చూపగలవు? ఆ ఛాయతో నీ వెట్లు వాదించగలవు? స్వర్గమర్త్యలోకములు ఫ్యూడల్ పద్ధతిలో ఇమిడియున్నట్లు తోచుచున్నది.

ఇండియాలోకూడ ప్రాచీనార్యుల స్వాతంత్ర్యభావనలు క్రమముగా మారుచుండెను. అవి నానాటికి దుర్బలమైపోయి ఒక కాలమున విస్మరింప బడును. కాని మధ్యయుగముల తొలిరోజులలో కొంతవరకు వాటిని జ్ఞాపక ముంచుకొని రని చెప్పియుంటిని. శుక్రనీతిసారము, దక్షిణహిందూదేశ శాసనములును ఇందుకు సాక్ష్యమిచ్చుచున్నవి.

అప్పుడే తలయెత్తుచున్న క్రొత్తపద్ధతులద్వారా యూరోపులోనికి మెల్లగా కొంత స్వేచ్ఛ వచ్చెను. భూస్వాములు, భూమిని దున్ని పని చేయువారు, ప్రభువులు, కమతగాండ్రు—వీరేగాక ఇతర తరగతుల ప్రజలును అప్పు డుండిరి. వారు చేతిపనులు చేసికొను శిల్పులును, వర్తకు లును. వీరు ఫ్యూడల్‌పద్ధతిలో చేరియుండలేదు. అల్లరిగా నున్న రోజు లలోవర్తకము సన్నగిల్లెను;చేతిపనులువృద్ధినందలేదు.కాని క్రమక్రమముగా వర్తకము వృద్ధిఆయెను. నిపుణులగు శిల్పులయొక్కయు, వర్తకుల యొక్కయు పలుకుబడి హెచ్చెను. వారు ధనవంతు లైరి. ప్రభువులును, బ్యారనులును వారివద్ద అప్పులు పుచ్చుకొన దొడగిరి. వా రప్పులిచ్చిరి. కాని కొన్నిహక్కుల నిమ్మని ప్రభువులను వారు నిర్బంధించిరి. ఈ హక్కులు వారి ప్రాబల్యమును వృద్ధిచేసెను. ప్రభువుల కోటల చుట్టును క్రిక్కిరిసియున్న కమతగాండ్ర ఇండ్లకు బదులు ఇప్పుడు చిన్నపట్టణములు లేచుచుండెను. ఒక ఆలయముచుట్టును, వృత్తిసంఘభవనముల (Guild-

halls) చుట్టును గృహములు లేచెను. వర్తకులును, శిల్పులును సంఘముల (Guilds) నేర్పాటు చేసికొనిరి. ఈసంఘముల ప్రధాననిలయములే సంఘభవనము (Guild-halls) లైనవి. ఇవియే తరువాత పురభవనములు (Town-halls) అయినవి.

తలయెత్తుచున్న ఈ నగరములు—కొలోన్, ఫ్రాంక్ ఫర్టు, హాంబర్గు మున్నగునవి—ఫ్యూడల్ ప్రభువుల యధికారముతో స్పర్ధవహించెను. ఆ నగరములలో ఒక క్రొత్తతరగతి జనులు వృద్ధినందుచుండిరి. అది వర్తక తరగతి. ఇది కులీనులను సైతము ధిక్కరించుటకు చాలినంత భాగ్యవంతముగా నుండెను. అది చిరకాలము సాగిన పోరాటము. తరచు రాజు తన కులీనుల యొక్కయు, బ్యారనులయొక్కయు ప్రాబల్యమునకు జడిసి నగరములతో చేరుచుండెను. కాని నే నెంతో ముందుకు పోవుచుంటిని.

ఆ రోజులలో జాతీయభావము లేదని చెప్పుచు ఈ జాబు ప్రారంభించితిని. తమకన్న అధికుడగు ప్రభువుపై విశ్వాసము గలిగియుండుట, అతనియెడల నెరపవలసిన ధర్మములను నెరపుట మాత్రమే ఆ ప్రజల దృష్టిలో నుండెను. అతనికి సేవచేయుటకే వారు శపథముతీసికొనిరి—దేశమునకు కాదు. రాజుకూడ, ప్రజల దృష్టిలో, ఎంతో దూరమందున్న అస్పష్టవ్యక్తియే. ప్రభువు రాజుపై తిరుగబడినచో వానిని ప్రతిఘటించు బాధ్యత రాజుదే. అతని సామంతు లతని ననుసరింతురు, తరువాత ఎంత కాలమునకో రానున్న జాతీయభావమున కిది యెంతో భిన్నముగా నుండెను.

## 54

# దేశద్రిమ్మరులను చీనా పడమరకు తరుముట

జూన్ 5, 1932

సుమా రొక మాసమునుండి కాబోలు, నీకు చీనానుగురించియు, దూరప్రాచ్యదేశములనుగురించియు వ్రాసియుండలేదు. యూరోపులో, ఇండి

యాలో, పడమటిఆసియాలో తటస్థించిన అనేకమార్పులనుగురించి మనము చర్చించుకొంటిమి. అరబ్బులు వ్యాపించి అనేకదేశములు జయించుట చూచితిమి. యూరోపు అంధకారములో పడి, అందుండి బయల్వెడలుటకు కొట్టుకొనుచుండుట చూచితిమి. ఈ విశేషము లిక్కడ జరుగుచుండగా అక్కడ చీనా చక్కగానే కాలక్షేపము చేయుచుండెను. ఏడుఎనిమిది శతాబ్దులలో, టాంగ్‌చక్రవర్తుల పరిపాలన క్రింద చీనా మిక్కిలి నాగరికముగాను, అభ్యుచ్చగాను, ప్రపంచములో చక్కగా పరిపాలింపబడు దేశములలో మిన్నగాను ఉండెను. రోముపతనానంతరము యూరోపు వెనుకబడియుండుటచే చీనాతో దానిని పోల్చుటకు వీలులేదు. ఉత్తర హిందూస్థానము చాలకాలమువరకు అభివృద్ధిలో లేదు. హర్షుడు పాలించి నప్పు డది యుండెను. అప్పుడప్పుడు అట్టి యుచ్ఛదశ నందుచున్నను మొత్తముమీద అది తీసికట్టుగానే ఉండెను. ఉత్తరాదికన్న దక్షిణహిందూస్థానము ఎక్కువ శక్తివంతముగా నుండెను. సముద్రమున కావల దాని వలసలు—అంగ్‌కోరు, శ్రీవిజయ ఉచ్ఛదశ నందనుండెను. ఈకాలమున చీనాతో కొన్నివిషయములందు తుల్యముగా నున్న రాజ్యములు బాగ్దాదులోను, స్పెయినులోను ఉన్న అరబ్బీరాజ్యములు. ఇవి సైతము కొద్ది కాలముపాటుమాత్రమే అభ్యుచ్ఛలో నుండెను. టాంగ్‌చక్రవర్తి యొకడు పదచ్యుతుడై అరబ్బుల సహాయము కోరెను. వారి సహాయముతోడనే అతడు సింహాసనమును తిరిగి పొందగలిగెను.

ఆ దినములలో నాగరికతవిషయమున చీనా పురోగామియై యుండెను. ఆ కాలపు యూరోపియనులను చీనా ఒకమాదిరి అనాగరికులనుగా పరిగణించుట సబబుగానే యుండెను. తెలిసిన ప్రపంచములో చీనా ఉత్కృష్టదశయం దుండెను. తెలిసిన ప్రపంచమని నేననుటకు కారణము అప్పుడు అమెరికాలో ఏమి జరుగుచున్నదో నాకు తెలియదు. ఇంత మట్టుకుమాత్రము మనకు తెలియును—మెక్సికోలోను, పెరూలోను, పొరుగుదేశములలోను కొన్నివందల సంవత్సరములనుండి నాగరికత

కలదని. కొన్నివిషయములలో వారు మిక్కిలి యభివృద్ధిలో నుండిరి. కొన్నివిషయములలో వారు మిక్కిలి వెనుకబడియుండి రని తోచును. కాని ఆ దేశములనుగురించి నా కంతగా తెలియదుకాన ఎక్కువగా చెప్ప సాహసించను. వాటిని మనస్సులో పెట్టుకొమ్మనిమాత్రము చెప్పు చున్నాను. మెక్సికో, మధ్యఅమెరికాలలోని మాయానాగరికతను, ఇంకాలు అనువారి పెరూరాజ్యమును మనస్సులో పెట్టుకొనుము. నాకన్న బుద్ధి మంతులు వాటినిగురించి విశేషాంశములను చెప్పగలుగుదురు. అవి నా మనస్సు నాకర్షించిన వనిమాత్రము ఒప్పుకొందును. కాని నే నెంతగా ఆకర్షింపబడుచున్నానో అంతగా నా అజ్ఞానముకూడ ఉన్నది.

ఇంకొక విషయము నీవు జ్ఞాపకముంచుకొనవలెను. దేశద్రిమ్మరి తెగలవా రనేకులు మధ్యఆసియాలో కనిపించి పడమరగా యూరోపుకు వెళ్ళినట్లును, లేదా ఇండియాపై దిగినట్లును ఈజాబులలో వ్రాసియున్నాను. హూణులు, సిథియనులు, తురుష్కులు (Turks), ఇంకను ఇతరు లనేకు లును ఒకరితరువాత నొకరు వరుసగా వెళ్ళిరి. ఇండియాకు శ్వేతహూణు లును, యూరోపుకు అట్టిలాతాలూకు హూణులును వెళ్ళినట్లును జ్ఞాపక మున్నదా? బాగ్దాదుసామ్రాజ్యమును వశపరచుకొన్న సెల్జూకు తురుష్కులు కూడ మధ్యఆసియానుండియే వచ్చిరి. తరువాత తురుష్కులలో వేరొక శాఖ-అట్టోమను తురుష్కులనువారు వచ్చి కాన్‌స్టాంటినోపులును జయించి వియన్నాప్రాకారములవరకు పోనై యుండిరి. మధ్యఆసియానుండియో, మంగోలియానుండియో కూడ భయంకరులగు మంగోలులు రానై యున్నారు. యూరోపు నడిబొడ్డువరకును విజయములు సాధించి వారు చీనానుకూడ తమ స్వాధీనములోనికి తెచ్చుకొనిరి. వారిసంతతివారిలో నొకడు ఇండియాలో రాజవంశమును, సామ్రాజ్యమునుకూడ స్థాపించనై యుండెను, ఆ రాజవంశమున రాజులు కొందరు ప్రసిద్ధినందనుండిరి.

మధ్యఆసియా, మంగోలియాలకు చెందిన దేశద్రిమ్మరిజాతులతో చీనా నిరంతరము పోరాడుచుండెను. ఈ తెగలవారు చీనాకు నిరంతరము

కష్టములు కలిగించుచుండుటచే చీనా ఆత్మరక్షణ చేసికోవలసివచ్చిన దని చెప్పిన సత్యదూరము కాదు. వీరినుండి రక్షించుకొనుటకే చీనా గొప్ప గోడ కట్టినది. దానివల్ల కొంత లాభము కలిగినదికాని దాడుల నాపజాలి నంత శక్తి దానికి లేదు. చక్రవర్తితరువాత చక్రవర్తి ఈ త్రిమ్మరులను వెనుకకు తరిమివేయవలసివచ్చినది. ఇట్లు చేయుచుండుటవల్లనే చీనా సామ్రాజ్యము పడమర కధికముగా, కాస్పియన్ సముద్రమువరకు వ్యాపించినది. ఈ విషయము నీకు చెప్పియేయుంటిని. చీనాప్రజలు అంతగా సామ్రాజ్యతత్వవాదులు కారు. వారి చక్రవర్తులలో కొందరు సామ్రాజ్యతత్వవాదులును, విజయాసక్తులును ఉన్నమాట వాస్తవమే. కాని యితరజాతులతో పోల్చిచూచిన వారు శాంతస్వభావులే. యుద్ధమన్నను, విజయములన్నను వారి కిష్టము లేదు. చీనాలో విద్యావంతున కున్న గౌరవమును,కీర్తియు యోధునకు లేవు. సందర్భము లిట్లున్నప్పటికిని అప్పు డప్పుడు చీనాసామ్రాజ్యము మిక్కిలి విస్తరించెను. ఇందుకు కారణము, ఉత్తరపశ్చిమములనుండి దేశద్రిమ్మరిజాతులు నిరంతరము చేయు దాడు లను, సూదిపోట్లను ప్రతిఘటించుటయే. బలవంతులగు చక్రవర్తులు వారిని పూర్తిగా వదుల్చుకొనుటకు, పడమరకు దూరముగా తరిమివేసిరి. కాని ఈ సమస్య పూర్తిగా పరిష్కారముకాలేదుకాని అప్పటిమట్టుకు కొంత విశ్రాంతి చిక్కినది.

చీనాకు విశ్రాంతి వచ్చినదికాని ఇతరజాతులును, దేశములును తత్కారణమున బాధపడినవి. చీనాచే తరుమగొట్టబడిన దేశద్రిమ్మరులు ఇతరదేశములపై బడిరి. వారు ఇండియాకు వచ్చిరి, ఉండుండియు వారు యూరోపుకు వెళ్ళిరి. చీనాలోని హాన్‌చక్రవర్తులు వారిని తరుముటవలన ఇతరదేశములకు హూణులు, తార్తారులు, ఇతరదేశద్రిమ్మరులు సిద్ధించిరి. టాంగులు యూరోపుకు తురుష్కులను ప్రసాదించిరి.

దేశద్రిమ్మరుల దాడులనుండి రక్షించుకొనుటలో చీనాదేశస్థులు చాలవరకు కృతకృత్యులైరి. అంతగా కృతకృత్యులుకాని కాలమున

గురించి మన మిప్పుడు ముచ్చటించుకొందము.

టాంగ్ రాజవంశము (Dynasty) న—అంతటను ఈ రాజవంశము లీతీరుననే యుండును—క్రమక్రమముగా చివరకు వచ్చుసరికి అసమర్థులగు పరిపాలకులు కొందరు తయారైరి. వీరికి ముందున్న పాలకుల సుగుణములు వీరికి అబ్బకున్నను వారి భోగలాలసత్వము మాత్ర మబ్బినది. రాజ్యములో లంచగొండితనము పెరిగెను. దీనితోపాటు పన్నుల బాధ అధికమాయెను. బీదవారే ఈ పన్నులభారమును అధికముగా భరించుచుండిరి. అసంతృప్తి పెరిగెను. పదవ శతాబ్దాదిని, క్రీ. శ. 907 సంవత్సరమున ఈ రాజవంశ మంతరించెను.

అర్ధశతాబ్ది కాలముపాటు ప్రముఖులుకాని చిల్లర పరిపాలకులు పరంపరగా పాలించిరి. క్రీ. శ. 960 సంవత్సరమున మాత్రము మరియొక పెద్ద రాజవంశము చీనా నేలదొడగెను. కావో-చూ స్థాపించినసుంగ్ రాజవంశ మిది. కాని పొలిమేరలవద్దను, చీనాదేశములోను అల్లరులు జరుగుచునేయుండెను. అధికమగు భూమిపన్నులు రైతాంగమునకు మిక్కిలి భారముగా నుండెను. ప్రజలు తమ అనిష్టమును వెల్లడించిరి. ఇండియాలో వలెనే భూమిపద్ధతి ప్రజలకు భారముగా నుండెను. ఇది పూర్తిగా మారువరకు శాంతిగాని, అభివృద్ధిగాని ఉండజాలదు. మూలముట్టుగ ఇట్టిమార్పులు చేయుట ఎప్పుడును కష్టమే. ఉన్నపద్ధతి పైతరగతులవారికి లాభదాయక మౌటచే మార్పుచేయదలచినప్పుడు వారు గోలపెట్టుదురు. కాని సకాలమున మార్పు ప్రవేశపెట్టనిచో కోరకుండ అది రాగలదు. పరిస్థితులను తారుమారుచేయగలదు.

అవసరమగు మార్పులు చేయనికారణమున టాంగ్‌రాజవంశము పతనమాయెను. ఈ కారణమువల్లనే సుంగులకు కష్టములు తటస్థించుచునేయుండెను. ఒక వ్యక్తి అవతరించెను. అతడు విజయము నందవలసినదే. అతడు వాంగ్ - అన్ - షీ అనువాడు. పదునొకండవ శతాబ్దిని అతడు సుంగులకు ప్రధానామాత్యుడుగా నుండెను. నే విడివరలో చెప్పి

నట్లు కన్‌ఫ్యూసియస్ అభిప్రాయముల ప్రకారము చీనా పరిపాలింపబడు చుండెను. కన్‌ఫ్యూసియస్ వ్రాసిన ఉద్గ్రంథములను చదివి ఉద్యోగస్థులు పరీక్షలలో కృతార్థులు కావలసియుండెను. కన్‌ఫ్యూసియస్ ఉపదేశములకు వ్యతిరేకముగా పోవుట కెవరికిని ధైర్యము లేకుండెను. వాంగ్ - అన్ - షీ అట్టి ఉపదేశములకు వ్యతిరేకముగా పోలేదు. కాని అసాధారణ మార్గమున వాటిని వ్యాఖ్యానించెను. కష్టములనుండి తప్పించుకొనుటకు బుద్ధిమంతు లవలంబించు పద్ధతి యిదియే. వాంగ్ అభిప్రాయములు కొన్ని మిక్కిలి నూతనములు. బీదవారిపై నున్న పన్నులభారమును తగ్గించవలెననియు, చెల్లించగలిగిన భాగ్యవంతుల పన్నులను హెచ్చించవలెననియు అతని ఆశయము. భూమిపన్నుల నతడు తగ్గించెను. రైతులు ధనరూపమున పన్ను చెల్లించ లేకున్నచో ధాన్యము మున్నగు ద్రవ్యరూపముననైనను పన్ను చెల్లించవచ్చునని అతడు వారి కనుమతి నిచ్చెను. భాగ్యవంతులపై నతడు రాబడిపన్ను విధించెను, ఇది అధునాతనకాలమున వచ్చిన పన్ను అని పలువురు తలతురుకాని చీనాలో ఈపన్ను 900 సంవత్సరములకు పూర్వము అమలులో నుండెను. రైతులకు సదుపాయముగా నుండుటకై దొరతనము వారు వారికి, నూర్పులకాలమున తీర్చుకొనుపద్ధతిమీద, అప్పుల నిచ్చునట్లు ఏర్పాటుచేసెను. ధాన్యపు ధరలు హెచ్చుట, తగ్గుట రైతులకు కష్టముగా నుండెను. దీనినికూడ తొలగించవలసియుండెను. ధాన్యపుధర తగ్గినపుడు రైతులకు రాబడి తగ్గును. ధాన్యము నప్పుడు అమ్మలేరు కావున వారు పన్నులను చెల్లించలేరు. ఏమియు కొనుగొనలేరు. వాంగ్-అన్-షీ ఈసమస్య నెదుర్కొనగోరి, ధాన్యపుధరలు హెచ్చకుండను, తగ్గకుండను ఉండుటకై దొరతనమువారే ధాన్యమును కొని అమ్ముచుండవలెనని సూచించెను.

దొరతనమువారు పబ్లికు భవనాదులను (Public works) కట్టించు నప్పుడు ప్రజలచే బలవంతముగా పనులు చేయించరాదనియు అతడు ఏర్పాటు చేసెను. పనిచేసిన ప్రతిమనుష్యునకును నిండుకూలిచెల్లించవలెను. పావోచియా అను పేరుతో అత డొక స్థానికసైన్యదళమునుకూడ స్థాపిం

చెను. కాని వాంగ్, పాపము, తన కాలమును మించి మిక్కిలి ముందుగ పోవుచుండెను. కొంతకాలమైనపిమ్మట అతని సంస్కరణములు ఉత్పన్న మయ్యెను. సైన్యదళముమాత్రము 800 సంవత్సరములపైగా సాగెను.

తమ్మెదుర్కొన్న సమస్యలను పరిష్కరించుటకు సాహసము లేక సుంగులు క్రమక్రమముగా వాటికి లొంగిపోయిరి. ఉత్తరమున నున్న అనాగరికులు—ఖిటానులు అనువారు—వారికి లొంగకుండ నుండిరి. వారిని వెనుకకు తరిమివేయలేక వాయవ్యదిశ నున్న వేరొక తెగవారిని—కిన్నులు, లేదా బంగారుతార్తారులు అనువారిని—సహాయముచేయుమని కోరిరి. కిన్నులు వచ్చి ఖిటానులను తరుమగొట్టి తాము అచ్చటనే నిలిచి పోయిరి. పొమ్మన్నను పోలేదు. దుర్బలుడగు మనుష్యుడుగాని, దుర్బల దేశముకాని ప్రబలుల సహాయము కోరినప్పుడు సంభవించు అవస్థ ఇదియే కదా. కిన్నులు ఉత్తరచీనా కధికారులై పెకింగ్‌పట్టణమును రాజధానిగా చేసికొనిరి. సుంగులు దక్షిణమునకు తరలిపోయి, ఎత్తుకొనివచ్చు కిన్నుల దాడులకు తాళలేక జంకుచుండిరి. ఈ విధముగా ఉత్తరచీనాలో కిన్నుల సామ్రాజ్యమును, దక్షిణచీనాలో సుంగుల సామ్రాజ్యమును వెలసెను. ఈ సుంగులను దక్షిణసుంగు లందురు. ఉత్తరమున సుంగుల రాజవంశము క్రీ.వె. 960నుండి 1127 వరకు సాగెను. దక్షిణచీనాలో దక్షిణసుంగులు 150 సంవత్సరముల కాలము—మంగోలులు వచ్చి క్రీ.వె. 1260 సంవత్సరమున వారిని పరిమార్చువరకు—రాజ్యము చేసిరి. కాని చీనా, ప్రాచీన ఇండియావలెనే ప్రతీకారముచేసెను. మంగోలులను సైతము తనలో కలుపుకొని, తనవారినిగా చేసికొని వారిని అచ్చముగా చీనావారినిగా మార్చివేసెను.

చివరకు చీనా దేశద్రిమ్మరిజాతులకు వశమయ్యెను. వశమగుచు అది వారిని నాగరికులనుగా చేసెనేకాని యూరోపువలెను, ఆసియా ఇతర భాగములవలెను వారినుండి బాధపడలేదు.

రాజకీయముగా ఉత్తరసుంగులుకాని, దక్షిణసుంగులుకాని వారికి

ముందున్న టాంగులంత ప్రబలులు కారు. కాని టాంగుల ఉచ్ఛదశలో తలయెత్తిన కళాసంప్రదాయమునుమాత్రము వారు వీడక సాగించుచునే వచ్చిరి. అంతేకాదు. దానికి మెరుగుపెట్టిరికూడ. దక్షిణసుంగుల అధికారమున నున్న దక్షిణచీనా లలితకళలందును, కవిత్వమందును ప్రఖ్యాతిగాంచెను. ఆనాడు సుందరమగు చిత్రములు చిత్రించబడెను. సుంగులు ప్రకృతిని ప్రేమించుచుండిరికాన ప్రకృతిదృశ్యములను చిత్రకారులు చిత్రించుచుండిరి. ఈకాలమున పింగాణి (Porcelain) ప్రత్యక్షమయ్యెను. శిల్పిచేతులలో నది సుందరాకారములను గ్రహించుచుండెను. ఇది ఇంకను 200 సంవత్సరములు గడచువరకును మరింత సుందరము, అద్భుతము అయ్యెను. మింగ్‌చక్రవర్తుల పరిపాలనకాలమున అద్భుతమగు చక్కని పింగాణిపాత్రలు నిర్మింపబడెను. మింగ్‌కాలమునకు సంబంధించిన పాత్ర యొకటి నేటికికూడ కన్నులపండువై యున్నది.

## 55

## జపానులో షోగన్ పరిపాలనము

జూన్ 6, 1932

చీనానుండి పచ్చసముద్రమును సులభముగా దాటి జపానుకు పోవచ్చును. మనము చాల సమీపములో నున్నాముకాన ఆపని చేయుదము. వెనుక నొకమారు జపానును దర్శించియుంటిమి, జ్ఞాపకమున్నదా ? అధికారమునకై పోరాడి ఉన్నతకుటుంబములు తలయెత్తుట, నాడునాటికి కేంద్రప్రభుత్వము అధికారమునకు వచ్చుట చూచియున్నాము. ప్రబలమగు పెద్దతెగకు యజమానిగా నుండి క్రమముగా చక్రవర్తి కేంద్రప్రభుత్వమునకు నాయకుడయ్యెను. కేంద్రాధికారచిహ్నముగా నారాపట్టణము రాజధానిగా ఏర్పరచబడెను. పిమ్మట రాజధాని కొయోటోకు మార్చబడెను. చీనాదేశపరిపాలనావిధాన మనుకరింపబడెను, చీనానుండి కాని, చీనాద్వారా కాని అనేకవిషయములు గ్రహింపబడెను—కళ, మతము, రాజనీతి

(Politics). ఆదేశనామముసైతము - 'డాయ్ నిప్పన్' అనునది - చీనా నుండియే వచ్చెను.

ఒక ప్రబలమగు కుటుంబము—ఫ్యూజివారాకుటుంబము—సర్వాధికారమును స్వాధీనముచేసికొని చక్రవర్తులను కీలుబొమ్మలుగ ఆడించుట కూడ చూచియున్నాము. వారు 200 సంవత్సరములవరకు పరిపాలించిరి. తుదకు చక్రవర్తులు విరాళతో రాజ్యమును వదలిపెట్టి మఠముల (Monasteries) లో ప్రవేశించిరి. సన్యాసియైనను చక్రవర్తి, రాజ్యము చేయుచున్నవాడు తన కుమారుడే యగుటచే అతనికి సలహాయిచ్చుచు పరిపాలనాకార్యములలో అధికముగా కలుగజేసికొనుచుండెను. ఈవిధముగా చక్రవర్తులు కొంతవరకు ఫ్యూజివారాకుటుంబము ప్రాబల్యమునకు రాకుండ చూచుచుండిరి. ఇది క్లిష్టపద్ధతి అయినప్పటికి ఏదోయొకవిధముగా ఫ్యూజివారాప్రాబల్యము నిది తగ్గించెను. ఒకరితరువాత ఒకరు రాజ్యమును వదలి సన్యసించిన చక్రవర్తుల చేతులలోనే నిజమగు అధికార ముండెను కావుననే వారికి మఠస్థ చక్రవర్తు (Cloistered Emperors)లను పేరువచ్చెను.

ఈలోపున ఇతరమార్పు లెన్నో తటస్థించెను. పెద్దభూస్వాముల క్రొత్తతరగతి యొకటి తలయెత్తెను. వారు సైనికులుకూడ. ఈభూస్వాములను ఫ్యూజివారాలు సృష్టించి దొరతనముతరఫున పన్నులువసూలుచేయ వారిని నియమించిరి. వారికి "దైమ్యోలు" అనిపేరు. ఈ పదమున కర్థము గొప్పపేర్లు అని. బ్రిటిషువారు మనరాష్ట్రమునకు రాకపూర్వము ఇట్టి తరగతియే ఒకటి తలయెత్తినది. ఇది విచిత్రమే. ముఖ్యముగా అయోధ్యలో (ఔద్) దుర్బలుడగు రాజు పన్నులు వసూలుచేయుటకై కొందరి నేర్పాటు చేసెను. బలవంతముగా పన్నులువసూలుచేయుటకై వారు చిన్న సొంత సైన్యములను ఉంచుకొనుచుండిరి, వసూలుచేసిన ధనములో అధికభాగము వా రపహరించుచుండిరి. కొన్నిచోట్ల ఈపన్నులు వసూలుచేయు జనులే పెద్ద తాలూకాదా ర్లయిరి.

వారి పరిచారకులతో, వారి చిన్నసైన్యములతో, ఈదైమ్యోలు మిక్కిలి ప్రబలులైరి, ఒకరితో నొకరు పోరాడుకొనుచుండిరి. కొయో

టోలోని కేంద్రప్రభుత్వమును వారుపేక్షించిరి. ప్రధానమైన రెండు దైమ్యోకుటుంబములు తైరాలు, మినమోటోలు. క్రీ. వె. 1156 సంవత్సరమున ఫ్యూజివారాల నణచివేయుటకు వారు చక్రవర్తికి సహాయము చేసిరి. కాని తరువాత వారొకరొకరిని దీకొనిరి. తైరాలు జయించిరి. తమ శత్రుకుటుంబము ముందుముందు తమ్ము బాధించుటకై వారిని చంపిరి. ప్రధానులగు మినమోటోల నందరిని చంపిరిగాని నలుగురు పిల్లలనుమాత్రము వదలిపెట్టిరి. అందొకడు పన్నెండు సంవత్సరముల బాలుడు. అతనిపేరు యోరిటోమో. తైరాకుటుంబము క్షీణముగా మాత్రము పనిచేయలేదు. ప్రమాదము లేదని వదలిపెట్టబడిన ఈ పిల్లవాడు పెరిగి పెద్దవాడై తైరాకుటుంబమునకు తీవ్రశత్రు వయ్యెను. వారిపై పగ సాధించవలె నని ఉవ్విళ్ళూరుచుండెను. చివర కాతడు విజయము సాధించెను, రాజధానినుండి వారిని తరిమివేసి ఒక నౌకాయుద్ధమున వారిని చితుకగొట్టి తలయెత్తికొనకుండ చేసెను.

యోరిటోమో ఇప్పుడు మిక్కిలి ప్రబలుడయ్యెను. చక్రవర్తి అతని కొక పెద్దబిరుదు నొసగెను. అది సై - ఇ - టాయ్ - షోగన్. ఈ పదమున కర్థము "అనాగరికుల నణచు మహాసేనాని" యని. ఇది క్రీ. వె. 1192 లో జరిగెను. ఈబిరుదు వంశపారంపర్యముగా సంక్రమించును. బిరుదుతోపాటు పరిపాలించు సంపూర్ణాధికారముకూడ వారివారికి సంక్రమించును. షోగన్ నిజమైన పరిపాలకుడు. ఈవిధముగా షోగనుల పరిపాలన జపానులో ప్రారంభమయ్యెను. అది చిరకాలము సాగనుండెను. సుమారు నేటికాలమువరకు, అనగా దాదాపు 700 సంవత్సరముల కాలము వారి పరిపాలన జరిగెను. పిమ్మట నేటి జపాను తన ఫ్యూడల్ చిప్పనుండి బయటపడి తలయెత్తెను.

కాని యోరిటోమోసంతతివారు షోగనులపేర 700 సంవత్సరములు రాజ్యమేలిరని అర్థముచేసుకొనరాదు. ఈ కుటుంబములలో అనేకమార్పులు కలిగెను. తత్ఫలముగా షోగనులు వచ్చిరి. తరచు అంతఃకలహము తట

స్థించుచుండెను. షోగను నిజమైన పాలకుడైయుండి పలుకుబడిలేని చక్ర వర్తిపేర పరిపాలనము నెరపుపద్ధతి ఇంత దీర్ఘకాలము సాగెను. ఈ షోగనుసైతము తరచు నామమాత్రుడై యుండుటయు, కొంద రుద్యోగస్థులు అధికారమును చేతులలో పెట్టుకొనుటయుకూడ జరుగుచుండెను.

యోరిటోమో భోగభాగ్యములతో నిండిన కొయోటోరాజధానిలో నివసించుటకు భయపడెను. తనకును, తన సహోద్యోగులకును భోగజీవనము దుర్బలత్వ మాపాదించు నని అతని భయము. కామకూరపట్టణము నాతడు సైనికరాజధానిగా ఏర్పరచుకొనెను. అందువల్లనే షోగను పరిపాలనమునకు "కామకూరషోగను పరిపాలన" మని పేరు వచ్చెను. అది క్రీ. వె.1333 వరకు, అనగా 150 సంవత్సరములకాలము సాగెను. ఈకాలములో చాలమట్టుకు జపానుకు శాంతిచేకూరెను. అంతఃకలహములతో అనేకసంవత్సరములు బాధపడినపిమ్మట వచ్చిన శాంతి మిక్కిలి వాంఛనీయమయ్యెను కొంతకాలముపాటు దేశము ఐశ్వర్యముతో తులతూగెను. ఈకాలమున జపానుపరిస్థితులు వెనుకటికన్న చక్కగా నుండెను. పరిపాలనము సమర్థముగా నుండెను.ఆనాటి యూరోపులోని ఏదేశమందును ఇంత సమర్థముగా పరిపాలన సాగుట లేదు. జపాను చీనాకు తగిన శిష్యదేశముగా నుండెను. కాని ఆ రెండుదేశముల దృక్పథములకును భిన్నత్వమతిశయముగా నుండెను. ఇదివరలో నేను చెప్పినట్లు చీనా ముఖ్యముగా శాంతిని గోరు దేశము. అది ఒకరి జోలికి పోదు. జపాను అట్లుకాదు. అది సైనికదేశము. ఇతరదేశములపై పడుటకు అది సిద్ధముగా నుండును. చీనాలో సైనికునకు గౌరవము లేదు. సైనికవృత్తి గౌరవవృత్తిగా చీనా భావించదు. జపానులో ఉన్నతస్థానములం దున్నవారందరు సైనికులే. దైమ్యోగానుండుట, అనగా యుద్ధముచేయు వీరుడుగా నుండుట అనునది జపానువారి ఆదర్శము.

చీనాదేశమునుండి జపాను అనేకవిషయములను గ్రహించెను. తన జాతిధర్మమున కనుగుణముగా నుండునట్లు అది గ్రహించినవిషయములను మార్చుకొని అవలంబించెను. చీనాతో దగ్గరసంబంధములు

జపాను నెరవుచునేయుండెను. ముఖ్యముగా చీనావారి యోడలమీద రెండు దేశముల మధ్య వర్తకము సాగుచునేయుండెను. పదమూడవ శతాబ్దాంతమున దీనికి హఠాత్తుగా అంతరాయము వచ్చెను. మంగోలులు చీనాకును, కొరియాకును వచ్చుట ఇందుకు కారణము. మంగోలులు జపానును జయించుటకుకూడ ప్రయత్నించిరికాని వారు వెనుకకు కొట్టబడిరి. ఆసియాస్వరూపమును మార్చినట్టియు, యూరోపును ఊపించినట్టియు మంగోలులు జపానును స్పృశించలేకపోయిరి. ప్రాతపుంతలలోనే జపాను సాగిపోవుచుండెను. వెనుకటికంటెకూడ అధికముగా వారు ఇతర దేశముల సంసర్గ పెట్టుకొనకుండ కాలక్షేపము చేసిరి.

జపానుదేశమందలి ప్రాచీన వృత్తాంతములలో, ఆ దేశమునకు మొదటిసారి ప్రత్తిమొక్క ఎట్లు వచ్చినదో తెలుపు గాథ యొక టున్నది. జపాను తీరప్రాంతమున కొందరు హిందూదేశస్థుల నావలు భగ్నమాయెను. క్రీ. వె. 799 సంవత్సరమున వారు ప్రత్తివిత్తులను జపానుకందిచ్చిరి.

తరువాత కొంతకాలమునకు తేయాకుమొక్క వచ్చెను. తొమ్మిదవ శతాబ్దపు మొదటిరోజులలో మొట్టమొదట నది ప్రవేశపెట్టబడినదికాని అది ప్రజామోదమును బడయలేదు. 1191 సంవత్సరమున బౌద్ధసన్యాసి యొకడు తేయాకువిత్తులను చీనా దేశమునుండి తెచ్చెను. త్వరలోనే తేయాకుపానీయము ప్రజలలో ప్రవేశించెను. టీ త్రాగు అలవాటునుబట్టి చకని మట్టిపాత్రలకు గిరాకీ హెచ్చెను. పదమూడవ శతాబ్దాంతమున ఒక జపానుకుమ్మరి పింగాణిపాత్రలు చేయు విద్య నభ్యసించుటకై చీనాకు వెళ్ళెను. ఆ దేశమున నతడు ఆరుసంవత్సరములు గడపెను. తిరిగివచ్చి అతడు జపానులో చక్కని పింగాణిపాత్రలు చేయుటకు ప్రారంభించెను. జపానులో టీత్రాగుట నేడు ఒక లలితకళగా భావింపబడుచున్నది. దానికి సంబంధించిన తంతు ఎంతో ఉన్నది. నీవు జపాను వెళ్లినప్పుడు త్రాగవలసినవిధముగానే టీని త్రాగవలెను. లేకున్న వారు నీకు అనాగరికతను ఆరోపింతురు.

## 56

# మానవుని అన్వేషణ

జూన్ 10, 1932

నాలుగురోజులక్రితము బారెల్లీచెరసాలనుండి నీకు జాబు వ్రాసియుంటిని. ఆ సాయంత్రమే నా మూట ముల్లె సర్దుకోమనియు, చెరసాల విడుచుటకు సిద్ధముగా నుండుమనియు నాతో చెప్పిరి. నన్ను విడుదల చేయుటకు కాదు, వేరొక చెరసాలకు బదిలీచేయుటకు ఈ ప్రయత్నము. ఈ చెరసాలలో సరిగా నాలుగునెల లుంటిని. ఇచ్చటి సహచరులవద్ద సెలవు తీసికొంటిని. ఇరువదినాలుగడుగుల ఎత్తు పెద్దగోడను తుదిసారి చూచితిని. ఇంతకాలమును దాని రక్షణక్రిందనే గదా నే నుంటిని. మరల కొద్దికాలము బాహ్యప్రపంచము చూచుటకు బయలువెడలితిని. బదిలీచేయబడుచున్నవారము మే మిద్దరము. మమ్ములను ప్రజలు చూతురేమో యని బారెల్లీస్టేషనుకు మమ్ము తీసికొనిపోలేదు. మేము ఘోషాస్త్రీల మైతిమి. ఇతరులు మమ్ము చూడరాదు. అడవిలో నున్న ఒక చిన్న స్టేషనుకు, 50 మైళ్ళ దూరము కారులో మమ్ము తీసికొనిపోయిరి. కారులో ఈ ప్రయాణము చేయించినందుకు వారిపై నాకు కృతజ్ఞభావ ముదయించెను. ఎన్నోనెలలు ఏకాంతవాసము చేసినపిమ్మట రాత్రివేళ శీతలవాయువు లనుభవించుట ఆనందదాయకము కాదా. కనుచీకటిలో భూతములవలె కనుపించు చెట్లను, మనుష్యులను, జంతువులను అతివేగముగా గడచిపోవుటకూడ ఆనందదాయకమే.

డెహ్రాడూనుకు మమ్ము తీసికొనివచ్చిరి. అరుణోదయముననే మమ్ము, ఇతరు లెవ్వరును చూచుటకు వీలులేకుండ, గమ్యస్థానమును చేరకముందే రైలుబండినుండి దింపి కారులో తీసికొనివచ్చిరి.

డెహ్రాడూన్ చిన్నచెరసాలలో నే నిప్పుడు కూర్చుండియుంటిని.

బారెల్లీకన్న ఇదే బాగున్నది. ఇక్కడ అంత వేడిగా లేదు. బారెల్లీలోవలె ఇచ్చట ఉష్ణోగ్రత 112 డిగ్రీలకు పోదు. మాకు చుట్టును ఉన్న గోడలు అంత ఎత్తుగా లేవు. వాటిపైనుండి కనిపించు వృక్షములు మరీ పచ్చగా కానవచ్చుచున్నవి. దూరములో గోడలపైనుండి తాళవృక్షాగ్రమునుకూడ నేను చూడగలుగుచున్నాను. ఈ దృశ్యము నా కెంతో ఆనందమిచ్చినది. సిలోను, మలబారులను తలపునకు తెచ్చినది. చెట్లకావల పర్వతము లున్నవి. ఎన్నోమైళ్ళ దూరములో కాదు. సమీపముననే. ఆ కొండల శిఖరముమీద చేరి కూర్చున్నది ముస్సోరీపట్టణము. వృక్షము లడ్డునిలుచుటచే నాకు పర్వతములు కనిపించుట లేదు. కాని వాటికి సమీపములో ఉండుటయును, సుదూరమున ముస్సోరీలో దీపములు రాత్రివేళ మినుకుమినుకుమనుచున్న వని భావించుటయును మనస్సునకు శాంతినిచ్చును.

నాలుగుసంవత్సరములక్రితము—లేదా మూడా ?—నీవు ముస్సోరీలో నున్నప్పుడు నీ కీఉత్తరములను వ్రాయుటకు ప్రారంభించితిని. ఈ మూడు నాలుగేళ్ళలో ఎన్ని విషయములు జరిగినవి! నీ వెంత పెరిగితివి! ఉండుండియు, ఎన్నో అంతరాయములతో, చాలభాగము చెరసాలనుండియే ఈ జాబులు నీకు వ్రాయుచునేయుంటిని. వ్రాసినకొద్దియు నేను వ్రాసిన అంశములపై ఇష్టముపోవుచున్నది. ఈ జాబులు నీకు ఇష్టముగా నుండ వనియు, భారముగాకూడ ఉండవచ్చుననియు భయపడుచుండును. ఇంక ఏల నే నీయుత్తరములు వ్రాయుచు నుండవలెను ?

గతకాలముయొక్క విస్పష్టచిత్రములను ఒకదానితరువాత నొకటి నీముందు ప్రదర్శింపగలిగిన బాగుండునని యనుకొంటిని. ఈ మన ప్రపంచము క్రమక్రమముగా ఎట్లు మారినదో, వృద్ధిజెంది ముందుకు పోయినదో, లేదా ఒక్కొక్కప్పుడు వెనుకకు పోయినట్లు కనిపించినదో నీవు గ్రహించిన బాగుండు నని యనుకొంటిని. ప్రాచీననాగరికతలను కొంతవరకు నీవు తెలిసికొనవలె ననియు, తరంగమువలె లేచి అవి ఎట్లు పడిపోయినవో నీవు గ్రహించవలె ననియు భావించితివి. ఒక యుగము

నుండి ఒక యుగమునకు చరిత్ర యను వాహిని అంతరాయరహితముగా, సుడులతో, ఆవర్తములతో, కయ్యలతో ఎట్లు ప్రవహించినదో ఇంకను అజ్ఞాతసాగరమును చేర ఎట్లు పరుగెత్తుచున్నదో నీవు గ్రహించవలెనని నే నాసించితిని. మానవుడు నడచిన బాట ననుసరించి, నిన్ను తీసుకొని పోవలె ననియు, మానవు డనుటకు వీలులేని ప్రారంభదశనుండియు క్రమక్రమముగా నేటివరకును మానవు డెట్లు మారినాడో నేటి మానవుడు తన మహోన్నతనాగరికతను తలచుకొని, తెలివితక్కువగా ఎట్లు గర్వించుచున్నాడో నీవు తెలిసికొన్న బాగుండునని యనుకొంటిని. జ్ఞాపక మున్నదో, లేదో. ముస్సోరీలో నీవున్న రోజులలో ఆవిధముగానే మొదలు పెట్టితిమి. నిప్పును కనిపెట్టిన విధమునుగురించియు, వ్యవసాయమును కనిపెట్టిన విధమునుగురించియు, మానవుడు పట్టణములలో ప్రవేశించుటను గురించియు, శ్రమవిభాగమును (Division of labour) గురించియు ప్రసంగించుకొంటిమి. ముందుకు పోయిపోయి సామ్రాజ్యములు మున్నగు వాని నెత్తుకొని వాటిలో చిక్కుకొని తరచు దారితప్పితిమి. చరిత్ర ఉపరి భాగమునుమాత్రము మనము స్పృశించగలిగితిమి. వెనుకటికాలమున జరిగిన సంఘటనల అస్థిపంజరమును నీకు ప్రదర్శించితిని. నీకొరకై దానిని సజీవముగా, వీర్యవంతముగా చేయుటకై రక్తమాంసములతో దానిని కప్పు శక్తి నా కుండిన ఎంత బాగుండును.

కాని నా కాశక్తి లేదు. నీయూహవై నీ వాధారపడి ఆ లోటును పూరించుకోవలెను. మంచిమంచి పుస్తకములు చదివి ప్రాచీన చరిత్రను నీవు గ్రహించగలవుగదా, ఇంక నే నెందుకు నీకు జాబులు వ్రాయవలెను? కాని సందేహములలో చిక్కుకొని నేను వ్రాయుచునేయుంటిని. ఇంకను వ్రాయగల ననుకొందునుకూడ. నీకు నేను మాటయిచ్చియుంటిని. దానిని చెల్లించవలెనుగదా, ఇంతకన్న ముఖ్యవిషయము—నేను నీకు వ్రాయవలె నని సంకల్పించి కూర్చున్నప్పుడు నీవు నాపజ్జ నుంటివనియు, మనము ఒకరితో నొకరము ప్రసంగించుకొనుచుంటి మనియు ఊహించుకొని నిన్ను తలచుకొని నే నానందమును పొందుచుందును.

తల వ్రేలవేసికొని తూలుచు మానవుడు అడవులనుండి బయట పడినదిమొదలుకొని, అతని అడుగుజాడల ననుసరించివెళ్ళి మనము కనుగొన్న విషయములు పైన వ్రాసియుంటిని. పెక్కు వేల సంవత్సరములకు సంబంధించిన వీ అడుగుజాడలు. కాని మానవుడు భూమిపై అవతరించుటకు పూర్వమున్న మహాయుగములతో పోల్చిచూచినను, భూమి చరిత్రతో పోల్చిచూచినను ఈకాల మెంత చిన్నది! కాని మానవుని చరిత్ర అతనికి ముందున్న గొప్ప మృగముల చరిత్రకన్న మనకు ఇంపుగా నుండుననుట సహజము. ఇంపుగా నుండుట కొక కారణము అతని కొక క్రొత్త వస్తువున్నది. అది ఇతరజంతువుల కున్నట్లు తోచదు. అది అతని మనస్సు. అది అతని కౌతుకము(Curiosity). క్రొత్తవిషయములనుగూర్చి తెలిసికొని నేర్చుకొందమన్న కోరిక. కావున తొలిరోజుల నుండియు మానవుని యన్వేషణ ప్రారంభమైనది. ఒక చిన్న శిశువును పరిశీలించుము. అది దానిచుట్టును ఉన్న క్రొత్త వింతప్రపంచము నెట్లు పరికించునో; మనుష్యులను, వస్తువులను అది ఎట్లు గుర్తించునో; ఎట్లు అది నేర్చుకొనునో. చిన్న బాలికను పరిశీలించుము. ఆరోగ్యముగా, చురుకుగా ఉన్న పిల్ల ఎన్నెన్నివిషయములమీద, ఎన్నెన్ని ప్రశ్నలు వేయునో. ఇట్లే చరిత్ర ఉదయించిన కాలమున, మానవుడు పసితనములో నున్నప్పుడు, ప్రపంచము క్రొత్తగా, వింతగా, భయంకరముగా అతనికి కనిపించినప్పుడు అతడు తనచుట్టును పరికించి, తదేకదృష్టితో చూచి, ఎన్నియో ప్రశ్నలు వేసియుండును. అతడు ఎవరిని అడుగును? తన్ను తానే అడుగుకొనవలెనుకదా. అతని సందేహములు తీర్చువా రెవరును లేరుగదా. కాని అతనికి అద్భుతమగు చిన్న వస్తువున్నది. అది మనస్సు. దాని సహాయముతో, నెమ్మదిగా, కష్టముతో అతడు అనుభవములనుసంపాదించుచు నేర్చుకొనుచుపోయెను. ఇట్లు తొలిరోజులనుండి నేటివరకు మానవుని యన్వేషణ సాగుచునేయుండెను.అత డనేకవిషయములనుకనిపెట్టెను. ఇంకను కనిపెట్టవలసిన వనేక మున్నవి.అతడు వెళ్ళుచున్న మార్గమునుబట్టి

ముందుకు పోయినకొలదియు క్రొత్తప్రదేశము లెన్నో అతనిముందు కని పించును. దానినిబట్టి అతని అన్వేషణ-దానికి అంతమే ఉన్నచో-అంతము కాలేదని అతనికి తెలియును.

మానవుని ఈ అన్వేషణ దేనికి ? అత డెక్కడికి పోవుచున్నాడు ? వేలకొలది సంవత్సరములనుండి ఈ ప్రశ్నలకుసమాధానమును పొందుటకై మానవులు ప్రయత్నించుచుండిరి. మతము, తత్త్వశాస్త్రము, విజ్ఞానశాస్త్రము ఈ ప్రశ్నలనుగురించి విచారించి అనేక సమాధానముల నిచ్చినవి. ఆ సమాధానములన్నియు నాకు తెలియవుకావున నిన్ను శ్రమపెట్టను. ప్రధానముగా మతము సంపూర్ణమైన, హేతుసిద్ధముకాని (Dogmatic) సమాధానము నిచ్చుటకు ప్రయత్నించెను. అది మనస్సును లెక్కచేయలేదు. అనేకవిధములుగా తన నిర్ణయములను అంగీకరింపజేయుటకు ప్రయత్నించెను. విజ్ఞానశాస్త్రము సందేహాస్పదమగు సమాధాన మిచ్చెను. విజ్ఞానశాస్త్ర మెప్పుడును నిష్కర్షగా ఏవిషయమునుగురించియు చెప్పదు. అది ప్రయోగములు చేయును. హేతువాదము చేయును. మానవుని మనస్సుపై అది ఆధారపడును. విజ్ఞానశాస్త్రమన్నను, దాని పద్ధతులన్నను నాకిష్టమని వేరుగా చెప్పనక్కరలేదు.

మానవుని అన్వేషణకు సంబంధించిన ఈ ప్రశ్నలకు ఇదమిత్థమని మనము సమాధానము చెప్పలేకపోవచ్చునుగాని ఈ అన్వేషణము రెండు మార్గములలో సాగినదని మనము తెలిసికోవచ్చును. మానవుడు తనకు బయట నున్న ప్రపంచముమీదికిని, తన లోపలికినికూడ తన దృష్టిని త్రిప్పుకొన్నాడు. ప్రకృతిని అర్థముచేసికొన నతడు ప్రయత్నించెను. తన్నుతా నర్థముచేసికొనుటకుకూడ ప్రయత్నించెను. మానవుడు ప్రకృతిలో భాగమే కాబట్టి నిజమున కీయన్వేషణము ఒక్కటే యగుచున్నది. ఇండియాగ్రీసుదేశములందలి ప్రాచీనతత్త్వశాస్త్రజ్ఞులు "నిన్ను నీవు తెలిసికొనుము" అని చెప్పియుండిరి. ప్రాచీనభారతదేశమునందలి ఆర్యులు ఇట్టి జ్ఞానమును సంపాదించుటకు చేసిన అత్యద్భుతమగు నిరంతరప్రయ

త్నముల గాథ ఉపనిషత్తులలో నున్నది. ప్రకృతివిగూర్చిన ఇతరజ్ఞానమును పొంద విజ్ఞానశాస్త్రము ప్రయత్నించినది. నేటి ప్రపంచమే అది చూపిన యభివృద్ధికి తార్కాణము. విజ్ఞానశాస్త్రము తన రెక్కలను రెంటివి ఇంకను దూరముగా చూపుచున్నది. అన్వేషణయొక్క రెండుమార్గములను అది క్రమ్ముచున్నది. రెండుమార్గములకును సామరస్యము కుదుర్చుటకు ప్రయత్నించుచున్నది. మిక్కిలి దూరముగా నున్న నక్షత్రములపై ధీమాగా తన దృష్టిని బరపుచున్నది. ద్రవ్యభాగములై, నిరంతరచలనము నందుచున్న అద్భుతమగు సూక్ష్మపదార్థములనుగురించి—ఎలెక్ట్రానుల (Electrons) ను, ప్రోటానుల (Protons) నుగురించి—అది మనకు చెప్పుచున్నది.

నూతనవిషయావిష్కరణమందు మానవుని మనస్సు సుదూరము ప్రయాణముచేసినది. ప్రకృతి నాతడు అధికముగా అర్థముచేసికొనుచున్న కొలది అతడు దానివి తన ప్రయోజనములకై ఉపయోగించుకొనుచున్నాడు. ఆవిధముగా ఆతడు ఎంతో శక్తి సంపాదించినాడు. కాని దురదృష్టవశమున ఈ నూతనశక్తి నె ట్లుపయోగించుకొనవలెనో అతనికి తెలియుట లేదు. కాన తరచు ఆత డీశక్తిని దుర్వినియోగము చేసినాడు. విజ్ఞానశాస్త్ర సహాయమున భయంకరమగు మారణసాధనములను సంపాదించినాడు. తోడిసోదరుని చంపుటకును, తా నెంతో శ్రమపడి నిర్మించిన ఈ నాగరికతనే విధ్వంసముచేయుటకును ఈ సాధనముల నుపయోగించుచున్నాడు.

## 57

# క్రీస్తువెనుక ప్రథమ సహస్రవర్షములు ముగియుట

జూన్ 11, 1932

మన ప్రయాణములో ఇక్కడికి వచ్చితిమి. ఒకమా రిచ్చట నిలిచి సింహావలోకనము చేయుట మంచిదని తోచుచున్నది. మన మెంతవరకు

సాగివచ్చితిమి? మన మెచ్చట నుంటిమి? ప్రపంచ మెట్లు కవిపించు చున్నది? తరువాత మనము అలాద్దీన్ ఇంద్రజాలపుతివాసీమీద కూర్చుండి ఆనాటి ప్రపంచమందలి వివిధభాగములకు పోయి కొలదిసేపు దర్శింతము.

క్రీస్తుశకము మొదటి వేయిసంవత్సరములకాలముగుండా మనము ప్రయాణమును సాగించితిమి. కొన్ని దేశములలో మనము కొద్దిగా ముందుకు పోతిమి. కొన్నిదేశములలో కొంచెము వెనుకబడితిమి.

ఆసియాలో సుంగుల రాజవంశముక్రింద చీనాదేశ ముండుట చూచితిమి. టాంగుల గొప్ప రాజవంశ మంతరించినది. సుంగులు గృహకల్లోలముల నెదుర్కొనవలసివచ్చెను. ఉత్తరమునుండి ఖిటాను లను అనాగరికుల దాడి నెదుర్కొనవలసివచ్చెను. 150 సంవత్సరముల కాలము వారు ప్రతిఘటించిరి. కాని వారు బంగారుతార్తారులు, లేదా కిన్నులు అను వేరొక అనాగరికతెగసహాయమును కోరుకొని తమ దుర్బ లత్వము ప్రకటించుకొనిరి. కిన్నులు వచ్చి నిలిచిపోయిరి. పాపము, సుంగులు దక్షిణమునకు పోవలసివచ్చెను. అచ్చట వారు మరి 150 సంవత్సరములకాలము దక్షిణసుంగు లనుపేర రాజ్యమును పాలించిరి. ఈకాలమున అందమగు కళలు, చిత్రవిద్య, పింగాణివిద్య విజృంభించెను.

కొరియాలో కలహములు, విభేదములు కొంతకాలము చెలరేగిన పిమ్మట క్రీ. వె. 935 లో సంయుక్తస్వతంత్రరాజ్యము స్థాపించబడెను. ఇది దీర్ఘకాలము—సుమారు 450 సంవత్సరముల కాలము నిలిచెను. నాగరికత, కళలు, రాజ్యాంగవిధానములను కొరియా చీనానుండి నేర్చుకొనెను, కొరి యాలోను, జపానులోనుకూడ మతమును, కొంతవరకు లలితకళలును ఇండియానుండి చీనాద్వారా ప్రవేశించినవి. జపాను ఎంతో తూర్పుగా, ఆసియాను కావలికాచుచున్నదా యన్నట్లుండి, మిగిలిన ప్రపంచముతో సంబంధము లేకుండ కాలక్షేపము చేయుచుండెను. ఫ్యూజివారాకుటుంబము సర్వతంత్రస్వతంత్రమై యుండెను. తన తెగకు పెద్దగా నుండుటమాత్రమే గాక చక్రవర్తి ఈమధ్య కొంత అధికారమునుకూడ సంపాదించెను.

కాని అతనికి ప్రాముఖ్యము లేదు. కొంతకాల మైనపిమ్మట షోగనుపరి పాలనము వచ్చెను.

మలేసియాలో హిందూవలసలు వృద్ధిలోనుండెను. వైభవోపేత మగు అంగ్‌కోరు కంబోడియాకు రాజధాని. ఈ రాజ్యముయొక్క అభివృద్ధియు, ప్రాబల్యమును మిన్నుముట్టుచుండెను. సుమత్రాలో గొప్ప బౌద్ధసామ్రాజ్యమునకు శ్రీవిజయ రాజధానియై యుండెను. తూర్పుదీవుల నన్నింటిని ఇది స్వాధీనములో నుంచుకొని వాటితో విరివిగా వ్యాపారము సాగించుచుండెను. తూర్పుజావాలో స్వతంత్రహిందూరాజ్య ముండెను. ఇది త్వరలో విజృంభించి. వ్యాపారముకొరకును,దానిద్వారావచ్చు భాగ్యము కొరకును శ్రీవిజయతో స్పర్ధవహించి వ్యాపారమునకై నేటి యూరోపు జాతులు చేయునట్లే శ్రీవిజయతో దారుణయుద్ధము చేసి, దానిని జయించి వినాశనము చేయనుండెను.

ఇండియాలో, ఇదివరలోకంటె అధికముగా, ఉత్తరదక్షిణములకు సంబంధము తెగిపోయెను. ఉత్తరమున గజినీమహమ్మదు మరల మరల దండయాత్రలు సలిపి కొల్లగొట్టుచు, వినాశము చేయుచు నుండెను. ఆతడు ఇండియానుండి అమితధనమును కొనిపోయెను. పంజాబును తన రాజ్యములో కలుపుకొనెను. దక్షిణమున చోళసామ్రాజ్యము వ్యాపించుచుండెను. రాజరాజుక్రిందను, అతని కుమారుడు రాజేంద్రునిక్రిందను ప్రాబల్యము సంపాదించుచుండెను. దక్షిణహిందూదేశమున వారి యధికారము ప్రబలమైయుండెను. వారి నౌకాదళములు బంగాళాఖాతమునందును, అరేబియాసముద్రమునందును నిరాఘాటముగా ప్రయాణములు చేయుచుండెను. సింహళముమీదను, దక్షిణబర్మామీదను, బెంగాలుమీదను వారు దిగ్విజయ యాత్రలు సాగించుచుండిరి.

మధ్యఆసియాలోను, పడమటి ఆసియాలోను బాగ్దాదురాజధానిగాగల అబ్బాసీదుసామ్రాజ్యశకలములు కానవచ్చుచుండెను. బాగ్దాదు ఇంకను వృద్ధిలోనే యుండెను. సెల్జూకుతురుష్క లను నూతనపరిపాలకులక్రింద అది


ఆసియా యూరోపు
సుమారు క్రీ. శ. 1000

ప్రాబల్యమును వృద్ధిజేసికొనుచుండెను. కాని వెనుకటి సామ్రాజ్యము అనేకరాజ్యములుగా చీలికలై పోయెను. ఇస్లాము ఒక సామ్రాజ్యముగా నుండుట లేదు, అనేక దేశములయొక్కయు, జాతులయొక్కయు మతముగా మాత్రమే ఉండెను. అబ్బాసీదు భగ్నసామ్రాజ్యమునుండియే గజినీరాజ్య మవతరించెను. దాని ఏలిక మహమ్మదు. అచ్చటనుండి దిగివచ్చియే యాతడు హిందూదేశముపై విరుచుకొనిపడెను. బాగ్దాదుసామ్రాజ్యము శిథిలమైనప్పటికిని బాగ్దాదుమాత్రము మహానగరముగా నిలిచియుండెను. కళారాధకులు, విద్వాంసులు, దూరదేశములనుండి వచ్చి దానిని దర్శించు చుండిరి. ఈకాలమున మధ్యఆసియాలో గొప్ప ప్రసిద్ధపట్టణము లనేకము వృద్ధిలోనుండెను—బొఖారా, సమరఖండము, బాక్ మున్నగునవి. వాటిలో వాటికి విరివిగా వ్యాపారము సాగుచుండెను. గొప్ప బిడారులు (Caravans) ఒక పట్టణమునుండి ఒక పట్టణమునకు సరుకులను కొనిపోవుచుండిరి.

మంగోలియాలోను, దానిచుట్టుప్రక్కలందును, క్రొత్త దేశద్రిమ్మరి జాతులు నానాటికి వృద్ధిచెందుచుండిరి. ప్రబలు లగుచుండిరి. 200 సంవత్స రములపిమ్మట వారు ఆసియాపై పడనుండిరి. ఇప్పుడైనను మధ్యఆసియా లోను, పడమటిఆసియాలోను ప్రబలులైయున్న జాతులు దేశద్రిమ్మరులకు పుట్టినిల్లగు మధ్యఆసియానుండి వచ్చినవారే. చీనాదేశస్థులు వారిని పడమ టికి తరుమగొట్టిరి. వారిలో కొందరిండియాకును, కొందరు యూరోపు నకును వ్యాపించిరి. పడమటికి తరుమగొట్టబడిన సెల్జూకుతురుష్కు లిప్పుడు బాగ్దాదుసామ్రాజ్యమును పునరుద్ధరింప ప్రయత్నించుచుండిరి. కాన్‌స్టాంటినోపుల్ రాజధానిగా గల తూర్పురోమకసామ్రాజ్యమును వా రిప్పుడు డీకొని ఓడించుచుండిరి.

ఇది ఆసియావృత్తాంతము. ఎర్రసముద్రమున కావల ఈజిప్టు ఉన్నది. బాగ్దాదునకు లొంగక అది స్వతంత్రముగా నున్నది. అచ్చటి మస్లిముపరిపాలకుడు తా నొక ప్రత్యేకకాలీఫుగా ప్రకటించుకొనెను. ఉత్తర ఆఫ్రికాకూడ స్వతంత్రమస్లిము పరిపాలనక్రిందనే ఉండెను. జిబ్రాల్టరుజల

సంధి కావల స్పెయిన్‌దేశములో కూడ స్వతంత్రమస్లిమురాజ్యము కలదు. దానిని "కుర్టూబా", లేదా "కార్డోబా ఎమీరే" టందురు. ముందుముందు దీనినిగురించి నీకు కొంత చెప్పవలసియున్నది. అబ్బాసీదు కాలీఫులు అధికారమునకు వచ్చినప్పుడు వారికి స్పెయినుదేశము లొంగలేదని నీ కిదివరకే తెలియును. నాటినుండియు అది స్వతంత్రముగానే యుండెను. ఫ్రాన్సును జయించవలె నను దాని ప్రయత్నము ఇంత కెంతోముందే చార్లెస్ మార్టెల్‌వల్ల విఫలీకృతముచేయబడినది. ఇప్పుడు స్పెయినుకు ఉత్తరభాగమందున్న క్రైస్తవరాజ్యములు మస్లిములపై దండయాత్రలు సాగింప మొదలుపెట్టెను. కాలము గడచినకొలదియు వారు మరింతధైర్యముగా మస్లిముల నెదుర్కొనదొడగిరి. మనము ప్రసంగించుకొనుచున్న కాలమున కార్డోబా ఎమీరేటు గొప్ప వర్ధమానరాజ్యమై యుండెను. నాగరికతయందును, శాస్త్రజ్ఞానమునందును అది యూరోపుదేశముల నన్నింటిని మించియుండెను.

స్పెయినువినా యూరోపంతయును ఇప్పుడు కొన్ని క్రైస్తవ రాజ్యములుగా విభజింపబడియుండెను. ఈ కాలమునాటికి క్రైస్తవమతము యూరోపుఖండమంతటను వ్యాపించెను. వీరులు, దేవుళ్ళు, దేవతలు— వీరితో నిండిన ప్రాతమతము యూరోపునం దంతరించినట్లే. యూరోపు నందలి నేటి దేశము లాకారము వహించుచుండుట మనము చూడగలము. క్రీ. వె. 987 సంవత్సరమున హ్యూకేపెట్ క్రింద ఫ్రాన్సుదేశము ఆకారము దాల్చెను. ఇంగ్లాండులో డేన్ అయిన కెన్యూటు 1016 సంవత్సరమున రాజ్యముచేసెను. ఇతడే సముద్రతరంగములను వెనుకకు పొమ్మని ఆజ్ఞ యిచ్చినట్లు చెప్పుకొను రాజు. ఏబదిసంవత్సరముల తరువాత విజయశీలుడగు విలియం నార్మండీనుండి వచ్చెను. పవిత్రరోమకసామ్రాజ్యమున జర్మనీ ఒకభాగమై యుండెను. అదియును చిన్నచిన్నరాజ్యములుగా నింకను విభజింపబడియున్నప్పటికిని ఒకదేశమగుచున్నట్లు స్పష్టపడుచున్నది. రష్యా తూర్పుగా వ్యాపించి తరచు తన నావలతో కాన్‌స్టాంటి

నోపులును బెదరించుచుండెను. రష్యాకు కాన్‌స్టాంటినోపులుపై వింత వ్యామోహము ఎప్పుడును కలదు. ఈ వ్యామోహము పుట్టుట కిదే మొదలు.* వేయిసంవత్సరముల కాలము ఈ మహాపట్టణమును గ్రసించ నది యువ్విళ్ళూరెను. 14 సంవత్సరములక్రితము ముగిసిన గతమహా యుద్ధములో తుదకు తన కాపట్టణము చిక్కునని యాసించెను. కాని హఠాత్తుగా విప్లవము సంభవించుటచే ప్రాతరష్యాతీర్మానములన్నియు తారుమారయ్యెను.

900 సంవత్సరములక్రితమునాటి యూరోపుదేశపటములో మాగ్యారులు (అను ఆశ్వికులు) నివసించుచుండిన పోలాండు, హంగరీదేశములను నీవు చూడగలవు. బల్గేరియనులయొక్కయు, సెర్బులయొక్కయు రాజ్యములనుకూడ చూడగలవు. లెక్కలేనందరు శత్రువులు చుట్టుముట్టియున్నను పరిపాలనమును సాగించుచుండిన తూర్పురోమకసామ్రాజ్యమునుకూడ చూడగలవు. రష్యనులు దానిపై బడిరి. బల్గేరియనులు దానిని తొందర పెట్టిరి. సముద్రమునుండి ఎడతెరపిలేకుండ నార్మనులు దానిని పీడించిరి. అన్నిటికన్న ప్రమాదకరమైన విషయము—సెల్జూకుతురుష్కులు దానిని తుదముట్టించవలెనని బెదరించుచుండిరి. ఇందరు శత్రువులు బాధించుచున్నను, ఇన్ని కష్టము లెదుర్కొనుచున్నను అది మరి 400 సంవత్సరములవరకు రాజ్యపరిపాలనమును సాధించి తరువాత కూలిపోయెను. నిరంతరాయముగ నిది యిట్లు రాజ్యపాలనము సాగించుట ఆశ్చర్యకరమగు విషయమే. కాన్‌స్టాంటినోపుల్ నిలిచిఉన్న స్థానముయొక్క బలమే ఇందు కొక కారణమని చెప్పుదురు. చక్కని దుర్భేద్యమగు స్థలమున నది యుండుటచే దానిని జయించుట శత్రువులకు సాధ్యము కాకుండెను. గ్రీకులు ఆత్మరక్షణకొరకు క్రొత్తపద్ధతిని కనిపెట్టియుండిరి. ఇది యొక కారణము కావచ్చును. ఈ ఆత్మరక్షణపద్ధతికి "గ్రీకుల అగ్ని" (Greek-fire) అని పేరు. నీటిని తాకుటతోడనే మండునట్టి ఒకవిధమగు పదార్థమది. "గ్రీకుల అగ్ని" సహాయమున కాన్‌స్టాంటినోపుల్ప్రజలు శత్రు

పేనలను ధ్వంసముచేయుచుండిరి. బోస్ఫొరసును దాటుటకు ప్రయత్నించు శత్రునావలకు చిచ్చుపెట్టుచుండిరి.

క్రీస్తుశకము తొలి వేయిసంవత్సరములు గడచినపిమ్మట యూరోపు దేశపట మీవిధముగా నుండెను. ఈ కాలముననే నార్తుమెన్, లేదా నార్మను లనువారు తమ నౌకలలో వచ్చి మధ్యధరాసముద్రతీరపట్టణము లను పీడించి కొల్లగొట్టుచుండిరి. సముద్రములందు ప్రయాణముచేయు చుండిన నావలపై బడి దోచుకొనుచుండిరి. విజయముతోపాటు వారు గౌరవప్రపత్తులనుకూడ సంపాదించుకొనుచుండిరి. ఫ్రాన్సులో పడమటి భాగమున, నార్మండీలో వారు స్థిరపడిరి. ఫ్రాన్సును కార్యరంగము(base)గా పెట్టుకొని వారు ఇంగ్లాండును జయించిరి. మస్లిములనుండి వారు సిసిలీ ద్వీపమును స్వాధీనముచేసికొనిరి. దానికి దక్షిణఇటలీని కలిపి ఒక రాజ్యముగా చేసిరి. దానికే సిసిలియూరాజ్య మని పేరు.

యూరోపుదేశమధ్యమున ఉత్తరసముద్రముమొదలు రోమువరకును పవిత్రరోమకసామ్రాజ్యము వ్యాపించియుండెను. అందనేకరాజ్యము లొక చక్రవర్తిపాలనలో నుండెను. ఈ జర్మనుచక్రవర్తియు, రోమునందలి పోపును అధికారమునకై పెనగులాడుకొనుచుండిరి. ఒక్కొక్కమారు చక్రవర్తిది పైచేయి యగుచుండెను. ఒక్కొక్కమారు పోపు కృతకృత్యు డగుచుండెను. కాని క్రమముగా పోపుల ప్రాబల్య మతిశయించుచుండెను. వారి చేతిలో దారుణమగు ఒక ఆయుధ ముండెను. అది బహిష్కరణము, సంఘమునుండి ప్రజలను వెలివేయుట. అట్టివారిని ప్రభుత్వరక్షణమునకు బాహ్యులనుగా జేయుట. అభిమానధనుడగు నొక చక్రవర్తి పోపుచే నొకమా రిట్లు పరాభవింపబడెను. పోపును క్షమాపణ కోరుకొనుటకై అతడు పాదరక్షలు ధరించకుండ మంచుపై నడచి పోయి, ఇటలీలోని కెనోస్సాలో నున్న పోపుఇంటిబయట పడిగాపులు పడవలసివచ్చెను. తుదకు దయదలచి పోపు చక్రవర్తికి దర్శనమిచ్చెను.

యూరోపులోని ఈ దేశములు ఆకారము ధరించుట మన మీకాల

మున చూడగలము. కాని నే డా దేశము లున్నట్లు అప్పు డవి లేవు. ముఖ్యముగా ప్రజలు భిన్నముగా నుండిరి. మేము ఫ్రెంచివార మనికాని, ఇంగ్లీషువార మనికాని, జర్మనుల మనికాని ఆనా డనుకొనుట లేదు. బీదలగు వ్యవసాయదారులు దైన్యము ననుభవించుచుండిరి. దేశమును గురించి కాని, భూగోళమునుగురించికాని వారి కేమియు తెలియదు. వారికి తెలిసిన విషయ మొక్కటే. తాము తమప్రభువుల కమతగాండ్రమనియు, ప్రభువుల యాజ్ఞలను పాలించుటయే తమ ధర్మమనియును. కులీనులను (Nobles) మీ రెవరని యడిగిన వారు చెప్పు సమాధాన మేమనగా, తా మీ ప్రదేశమునకో, ఆ ప్రదేశమునకో ప్రభువుల మనియును, తమకన్న గొప్ప ప్రభువుయొక్కగాని, రాజుయొక్కగాని సామంతుల మనియును. యూరోపుదేశమం దంతటను వ్యాపించిన ఫ్యూడల్‌పద్ధతి యిదియే.

క్రమక్రమముగా, ముఖ్యముగా జర్మనీలోను, ఉత్తర ఇటలీలోను పెద్ద పట్టణములు తలయెత్తుట మనము గమనింతుము. నాడు పారిస్ కూడ ఒక ప్రసిద్ధపట్టణమై యుండెను. ఈ పట్టణములు వ్యాపారమునకును, వర్తకమునకును నిలయములై యుండెను. ధన మా పట్టణములకు చేరుచుండెను. నగరములు ఫ్యూడల్‌ప్రభువుల నిష్టపడవు. కాన వారిద్దరి మధ్య వివాదములు రేగుచుండెను. తుదకు పైచేయి ధనముదేకదా. ప్రభువులకు తమ ధనమును బదులిచ్చి, దాని సహాయమున నగరములు కొన్ని హక్కులను, కొంత యధికారమును బడయుచుండెను. ఇట్లు క్రమేణ నగరములలో నొక క్రొత్తతరగతిప్రజలు బయలుదేరిరి. ఫ్యూడల్‌పద్ధతిలో వారిముడరు.

ఫ్యూడల్‌పద్ధతినమూనా ననుసరించి యూరోపులోని సంఘము పొరలుపొరలుగా విభజింపబడియుండెను. క్రైస్తవపీఠము ఇట్టి పరిస్థితికి తన ఆమోదమును తెలిపెను. జాతీయతాభావ మానాడు లేదు. కాని యూరోపునం దంతటను, ముఖ్యముగా పైతరగతిప్రజలలో ఒకవిధమగు భావ ముండెను. అది క్రైస్తవభావము. యూరోపులోని క్రైస్తవజాతులను బంధించు భావము. ఈ భావమును వ్యాప్తిలో పెట్టుటకు మతసంస్థ

(church) సహాయముచేసెను. అట్లు చేయుటవల్ల ఆసంస్థకు బలము హెచ్చెను. పశ్చిమయూరోపులో అడ్డులేని అధికారము నెరపుచున్న పోపు యొక్క ప్రాబల్యము హెచ్చెను. కాన్‌స్టాంటినోపులుతోను, తూర్పురోమక సామ్రాజ్యముతోను రోము సంబంధము విడగొట్టుకొన్న దన్నమాట నీకు జ్ఞాపకమున్నదా? కాన్‌స్టాంటినోపిలులో వింకను ప్రాచీనఆర్తొడాక్సు చర్చియే నెలకొనియుండెను. రష్యాదేశము దానినుండియే తన మతమును గ్రహించెను. కాన్‌స్టాంటినోపులులో నున్న గ్రీకులు పోపుఅధికారము నంగీకరించలేదు.

కాని ఆపత్సమయమున కాన్‌స్టాంటినోపులను శత్రువులు చుట్టుముట్టినప్పుడు ముఖ్యముగా సెల్జూకుతురుష్కులు దానిని కదతేర్చవలెనని పూనుకొన్నప్పుడు అది తన అభిమానమును, రోముపై గల తన ద్వేష భావమును దిగమ్రింగి, క్రీస్తును నమ్మని మస్లిముల నెదిరించుటకై పోపు సహాయమునుకోరెను. ఆనాడు రోములో ఒక ప్రఖ్యాతపురుషుడు పోపుగా నుండెను. అతని పేరు హిల్డిబ్రాండి. అతడే ఏడవ పోపుగ్రిగరీ అయ్యెను. ఈ హిల్డిబ్రాండిసమక్షమునకే గర్వియగు జర్మనుచక్రవర్తి కెనోస్సాపట్టణమునకు పాదరక్షలు లేకుండ మంచుపై నడచి వచ్చెను.

ఆనాడొకవింతవిషయము క్రైస్తవయూరోపును ఉద్రేకపూరితము చేసెను. క్రీస్తువెనుక సరిగా 1000 సంవత్సరములకు ప్రపంచము హఠాత్తుగా అంతరించునని భక్తులగు క్రైస్తవులు పలువురు నమ్మియుండిరి. ప్రపంచమునకు మంచిరోజులు వచ్చుననియు వారు నమ్మియుండిరి. ఆ కాలమున యూరోపు దీనస్థితిలో నున్నదని ఇదివరలో చెప్పియుంటిని. ప్రపంచమునకు మంచిరోజులు వచ్చు నన్న మాట విని అభాగ్యులు పెక్కురు సంతోషించిరి. పలువురు తమ భూముల నమ్మివేసి పాలస్తీనాకు ప్రయాణముకట్టిరి. ప్రపంచము అవసానదశకు వచ్చు సమయమున వా రాపవిత్రభూమిలో నుండగోరిరి.

కాని ప్రపంచ మంతరించలేదు. జెరూసెలముకు ప్రయాణమై వెళ్ళిన

వేలకొద్ది యాత్రికులను తురుష్కులు సరిగా చూడలేదు పరిగదా పీడించిరి కూడ. పరాభవింపబడి, క్రోధముతో వారు యూరోపుకు తిరిగివచ్చిరి. పవిత్రభూమిలో తాము పడ్డపాట్లను అందరికిని వెల్లడిచేసిరి. ముఖ్యముగా పీటరను పేరు గల వనవాసి (Hermit) కర్ర చేతబట్టుకొని ప్రయాణములుచేసి. తమ పవిత్రనగరమగు జెరూసెలమును మస్లిముల బారినుండి తప్పించి రక్షించవలసిన దని బోధచేయదొడగెను. క్రైస్తవప్రపంచము కుపితమయ్యెను. అట్టి ధర్మకార్యము చేయుటకు వారుత్సాహపూరితులైరి. ఇది చూచి పోపు ఈ యుద్యమమును నడుప నిశ్చయించెను.

ఈ సమయమునందే క్రీస్తుమతమును నమ్మనివారిని అణచివేయుటకై సహాయముచేయవలసినదని కాన్‌స్టాంటినోపులునుండి వార్త వచ్చెను. ఎగబడుచున్న తురుష్కుల నెదిరించుటకు క్రైస్తవప్రపంచ మంతయు-రోమనులును, గ్రీకులును నడుములు బిగించిరి. 1095 సంవత్సరమున క్రైస్తవమతసంస్థల గొప్ప సమావేశము జరిగెను. మస్లిముల స్వాధీనములో నున్న పవిత్రనగరమగు జెరూసెలమును వశపరుచుకొనుటకై పవిత్రయుద్ధమును ప్రకటింప వారు తీరుమానించిరి. ఈవిధముగా మత యుద్ధములు (క్రూసేడులు-Crusades) ప్రారంభమాయెను. క్రైస్తవమునకును, ఇస్లామునకునుయుద్ధము; సిలువకును, చంద్రవంకకును (Cross and crescent) యుద్ధము.

# 58

# ఆసియాయూరోపులు: పునరవలోకనము

జూన్ 12, 1932

క్రీస్తువెనుక సహస్రవర్షములు గడచినపిమ్మట ప్రపంచము—అనగా ఆసియా, యూరోపు, ఆఫ్రికా కొంతభాగము—ఎట్లున్నదో సమీక్ష సంగ్రహముగా చేసి ముగించితిమి. కాని మరల చూడుము.

ఆసియా. ఇండియాచీనాల ప్రాచీననాగరికతలు నడచుచున్నవి, వృద్ధినందుచున్నవి. హిందూసంస్కృతి మలేసియాకు, కంబోడియాకు వ్యాపించి చక్కగా ఫలించినది. చీనాసంస్కృతి కొరియాకును, జపానుకును, కొంతవరకు మలేసియాకును ప్రాకెను. పడమటి ఆసియాలో అరబ్బుల సంస్కృతి అరేబియాలోను, పాలస్తీనా, సిరియా, మెసపొటేమియాలలోను నెలకొనియుండెను. పరిషియా(ఈరాన్)లో ప్రాచీనఇరానియన్ సంస్కృతియు, నూతనఅరబ్బీనాగరికతయు సమ్మిశ్రితమై యుండెను. మధ్యఆసియాలోని కొన్నిదేశములు సమ్మిశ్రితమగు ఈ ఇరానియన్-అరబ్బీనాగరికతనుకూడ అలవరచుకొన్నవి. ఇండియాచీనాల సంపర్కము కూడ వాటికి కలిగినది. ఈ దేశములం దన్నిటను నాగరికత ఉత్తమ శ్రేణిలో నుండెను. వర్తకము, విద్య, కళలు ఇందు వృద్ధిగాంచినవి. మహానగరములు వెలసినవి. ప్రసిద్ధవిశ్వవిద్యాలయములు దూరదేశవిద్యార్థుల నాకర్షించుచుండెను. మంగోలియాలోను, మధ్యఆసియా కొన్నిభాగములందుమాత్రమును, ఉత్తరమున సైబీరియాలోను నాగరికత అంత ఉన్నత స్థానము నందుకొనలేదు.

ఇక యూరోపు. అది వెనుకబడియుండెను. ఆసియాదేశములతో పోల్చిచూచిన నది కొంతవరకు అనాగరికస్థితియం దున్నదనియే చెప్పవలెను. ప్రాచీనగ్రీకు-రోమనునాగరికత గతకాలమునాటి స్మృతిమాత్రముగానే యుండెను. విద్యకు గౌరవము లేదు. కళలా కనిపించవు. వర్తకము సంగతి చూచిన ఆసియాలోకంటె వాసిగానే యుండెను. రెండు చెప్పుకో దగ్గ ప్రదేశములుమాత్రము కలవు. అరబ్బుల వశమం దున్న స్పెయిను అరబ్బుల ప్రాచీనసంప్రదాయములను సాగించుచునేయుండెను. కాన్స్టాంటినోపులు మెల్లగా కుష్కించిపోవుచున్నప్పటికిని జనసంకీర్ణమగు గొప్ప నగరమై, ఆసియాయూరోపుల మధ్య నిలిచియుండెను. యూరోపులో అధికభాగమున తరచు అల్లరులు చెలరేగుచుండెను. నాడు ఫ్యూడల్ పద్ధతి అమలులో నుండెను. ప్రతినైటును (Knight), ప్రతిప్రభువును తమతమ

సంస్థానములందు చిన్నరాజులుగా నుండిరి. వెనుకటి సామ్రాజ్యమునకు రాజధానియైన రోము ఒక కాలమున గ్రామమంత చిన్నదయ్యెను. వన్య మృగములు ప్రాచీనకొలోసియం (Colosseum) లో నివసింపజొచ్చెను. కాని అది మరల పెరుగుచున్నది.

క్రీస్తువెనుక వేయిసంవత్సరములనాడు ఆసియాయూరోపుల నొక దానితో నొకటి పోల్చిచూచిన ఆసియాదే పయిచేయిగా కనిపించును.

మరల నొకమారు చూతము. బాహ్యవిషయములను వదలి ఈ మారు లోపలి విషయములను పరిశీలింతము. ఆసియాయొక్క బాహ్యమును చూచి ఆ దేశమునందు అంతయు చక్కగా నున్నదని అనుకొనవచ్చును. కాని అట్లు లేదు. ప్రాచీననాగరికతలు పుట్టి పెరిగిన ఇండియాచీనాదేశములు కష్టములలో చిక్కుకొనియుండెను. బయటనుండి వచ్చు దండయాత్రల వల్ల కలుగు కష్టములుమాత్రమే కాదు. బలమును, ప్రాణమును పీల్చి వేయు నిజమగు కష్టము లివి. పశ్చిమమున అరబ్బుల ఉచ్చదశకు అవసానకాలము సమీపించుచుండెను. సెల్జూకులు ప్రబలులగుచున్న మాట వాస్తవమే కాని వారి యున్నతికి కారణము వారి యుద్ధకుశలతయే. హిందూదేశస్థులు, చీనావారు, పరిషియాదేశస్థులు, అరబ్బులును ఆసియా సంస్కృతిని ప్రకటించుచుండిరి. సెల్జూకు లట్లు చేయుట లేదు. ఆసియా యొక్క యుద్ధకుశలతనే వారు ప్రకటించుచుండిరి. ఆసియాయందంతటను ప్రాచీనసంస్కృతజాతులు శుష్కించుచున్నట్లు తోచును. వారు ఆత్మ విశ్వాసమును గోల్పోయిరి. ఆత్మసంరక్షణకుమాత్రమే వారు పూనుకొను చుండిరి. బలవంతులు, వీర్యవంతులు అగు నూతనజాతులు తలయెత్తి ఈ ప్రాచీనఆసియాజాతులను జయించిరి. యూరోపుమీదకూడ బడ నుంకించిరి. కాని వీరు ఎట్టి నూతననాగరికతను ప్రవేశపెట్టలేదు. సంస్కృతికి నూతన చైతన్యమును కూర్చలేదు. ప్రాచీనజాతులే వారిని మెల్లగా నాగరికులనుగా చేయుచున్నవి. వారిని తనలో లీనము చేసికొనుచున్నవి.

ఈవిధముగా ఆసియాలో నొక గొప్ప మార్పు కలుగుచున్నదని

మనము కనిపెట్టవచ్చును. ప్రాచీననాగరికతలు సాగిపోవుచునేయున్నవి : లలితకళలు వర్ధిల్లుచునేయున్నవి; భోగములు ప్రసన్నము లగుచున్నవి: కాని నాగరికతనాడి మందగించినది. ప్రాణశక్తి నానాటికి క్షీణించుచున్నట్లు కనబడుచున్నది. అవి చిరకాలము సాగిపోవలసియేయున్నది. విచ్ఛిత్తి యగుటకాని, అంతమగుటకాని వాటికి లేవు. మంగోలులు వచ్చినప్పుడు అరేబియాలోను, మధ్యఆసియాలోను ఉన్న నాగరికతలకుమాత్రము విచ్ఛిత్తి కలిగినది. చీనాలోను, ఇండియాలోను వాటి రంగు మెల్లగా మాసిపోవుచుండెను. చివర కీప్రాచీననాగరికత చిత్రకారుని చిత్రమువలె తయారయ్యెను—దూరముననుండి చూచుట కందముగానే కనిపించును కాని, చైతన్యముమాత్ర ముండదు. సమీపమునకు వచ్చి చూచిన చెద పురుగులు తినివేసినట్లు మనము కనుగొందుము.

సామ్రాజ్యములవలెనే నాగరికతలును పతనమగుటకు కారణము బాహ్యశత్రువుల బలము కాదు; లోపలనున్న దుర్బలత్వమువల్లను, కుళ్లువల్లనుమాత్రమే అవి అంతరించుచున్నవి. అనాగరికజాతులవల్ల రోము పడిపోలేదు, మృతావస్థలో నున్నదానిని వారు కూల్చివేసిరి. చేతులను, కాళ్లను కొట్టివేసినప్పుడే రోముహృదయము కొట్టుకొనుట ఆగిపోయినది. ఇండియాచీనాలలోను, అరబ్బుల విషయమునను ఇట్టి కార్యమువంటిదే తటస్థించెను. అరేబియానాగరికత ఎంతచప్పున తల యెత్తినదో అంత చప్పున క్షీణించినది. ఇండియాచీనాలలో ఈకార్యము దీర్ఘకాలముపాటు జరిగినది. ఫలానాకాలములో జరిగినదని చెప్పుట సులభముకాదు.

గజనీమహమ్మదు రాకపూర్వ మెంతకాలమునకు ముందో ఈ కార్యము ప్రారంభమైనది. ప్రజల మనస్సులలో ఈమార్పు కనిపెట్ట వచ్చును. క్రొత్త ఆలోచనలను, వస్తువులను సృష్టించుటకు బదులు వారు చేసినదే చేయుచు, చేసినదానినే అనుకరించుచు కాలము గడపుచుండిరి. వారి మనస్సులు ఇంకను సునిశితముగాను, సూక్ష్మముగాను ఉండెను.

కాని వారు ఎప్పుడో చెప్పబడిన, లేదా వ్రాయబడిన విషయములను పట్టు కొని వ్యాఖ్యానించుచు, ఉపన్యసించుచు కాలము గడపిరి. చక్కని శిల్ప మును వా రింకను చేయుచుండిరి. రాళ్ళను చక్కగా మలచుచుండిరి. కాని అవి వివరములతో, అలంకారములతో అలవికాకుండ నుండెను. సౌందర్యమును తరచు వికృతము చేయుచున్నారేమో యనిపించును. స్వకపోలకల్పన మృగ్యమయ్యెను. ధైర్యముతో చక్కని కల్పనలు చేయుట కానరాదయ్యెను. భాగ్యవంతులలో సున్నితమగు సౌమ్యభావ ములు, కళలు, భోగములు సాగుచునేయుండెను. కాని ఉత్పత్తిని వృద్ధి చేయుటకుగాని, ప్రజల కష్టములను, దైన్యమును తొలగించుటకుగాని ఎట్టి ప్రయత్నములును జరుగుట లేదు.

నాగరికతాసాయంసంధ్యలక్షణము లివి. ఈ లక్షణములు పొడ చూపినప్పుడు నాగరికత కొనప్రాణముతో నున్నదని చెప్పవలెను. జీవ మున్న ప్రాణిలక్షణము సృష్టి; పునరుక్తియును, అనుకరణమును కాదు.

చీనాఇండియాలలో ఈ కార్యము అప్పుడు పొడచూపుచుండెను. ఇట్లన్నప్పుడు నామాటలను సరిగా అర్థముచేసికోవలెను. ఈ కారణము వల్ల చీనాఇండియాలు నశించునని కాని, అనాగరికస్థితికి తిరిగి వచ్చునని కాని నా అభిప్రాయము కాదు. నా అభిప్రాయ మేమనగా-ప్రాచీనకాలము నం దున్న సృష్టి చేయవలె నను ప్రేరణ చీనాఇండియాలలో సన్నగిలు చున్నది. పునరుజ్జీవితమగుట లేదు. మారిపోయిన క్రొత్తపరిస్థితుల కను గుణముగా నవి సరిపుచ్చుకొనుట లేదు. ప్రాత పాటనే పాడుచుండెను. ప్రతిదేశమునకును, ప్రతినాగరికతకును ఇట్లు సంభవించుచునేయుండును. గొప్ప సృష్టిప్రయత్నమును, అభివృద్ధియు ఒక కాలమున, శ్రాంతి ఒక కాలమున వచ్చుచుండును. ఇండియాచీనాలలో నీ శ్రాంతి ఎంతో ఆల స్యముగా వచ్చుట ఆశ్చర్యకరమగు విషయము. కాని ఈ శ్రాంతి ఎప్పుడును సంపూర్ణముగా రాలేదు.

మానవాభివృద్ధి కొక క్రొత్త ప్రేరణమును ఇండియాలో ఇస్లాము

ప్రవేశపెట్టెను. కొంతవరకును అది రసాయనమువలె పనిచేసెను. ఇండియానిద్రమత్తు పోగొట్టెను. కాని చేయదగిన మంచికంటె తక్కువ మంచినే అది చేయగలిగెను. దీనికి రెండు కారణము లున్నవి. అది రావలసిన విధముగా రాకపోవుట ఒకటి; కొంత ఆలస్యముగా వచ్చుట రెండు. గజనీమహమ్మదు ఇండియాపై దండయాత్రలు సాగించుటకు ముందు మస్లిముమతబోధకులు ఇండియాలో సంచరించిరి. వారిని ప్రజ లాదరించిరి. శాంతముగా వారు ప్రవేశించిరి. కొంతవరకు కృతకృత్యులైరి. ఇస్లాముపై ఎట్టి ద్వేషభావమును లేదు. అప్పుడు మహమ్మదు ఖడ్గముతో వచ్చి దేశమునకు చిచ్చు పెట్టెను. దేశమును జయించు బుద్ధితో కొల్లగొట్టుచు, ప్రజలను చంపుచు అతడు వచ్చిన విధము ఇస్లాముకీర్తికి కళంకప్రాయమై యుండెను. విజయతత్పరులగు ఇతరుల వలెనే అతడును చంపెను, కొల్లగొట్టెను. మతమును పాటించ లేదు. కాని చాలకాలమువరకు అతని దండయాత్రలు ఇండియాలో ఇస్లామును మరుగుపరచెను. ప్రజ లా మతమును నిష్పాక్షికబుద్ధితో విచారించుటకు సాధ్యము కాకుండ చేసెను. ఇట్టి పరిస్థితులే లేకున్న అట్టి విచారణ జరిగియే యుండును.

ఇది ఒక కారణము. రెండవ కారణ మది ఆలస్యముగా వచ్చుట. ప్రారంభమైన మరి 400 సంవత్సరముల కది ఇండియాకు వచ్చెను. ఈ దీర్ఘకాలములో దానికి కొంత శ్రాంతి వచ్చినది. సృష్టిశక్తి దానిలో చాల వరకు సన్నగిల్లినది. తొలిరోజులలోనే అరబ్బులు ఇస్లాముతో వచ్చియుండినచో, తలయెత్తుచున్న అరబ్బీసంస్కృతి ప్రాచీన హిందూసంస్కృతితో మిళితమైపోయియుండెడిది. ఈ రెండును ఒకదానిపై నొకటి పనిచేయుట వల్ల మంచి ఫలితములు సంక్రమించియుండెడివి. సంస్కృతి గల జాతులు రెండు కలసిమెలసియుండుట తటస్థించెడిది. అరబ్బులు మతవిషయమున సహనబుద్ధి కలవా రనియు, హేతువుకు కట్టుబడువా రనియు అందరికిని తెలిసియుండెను. ఒకప్పుడు బాగ్దాదులో నొక సంఘ ముండెను. దానికి

పోషకుడు కాలీఫు. సర్వమతములవారును, మతము లేనివారునుకూడ సమావేశమై అన్ని విషయములను హేతుబద్ధులై చర్చించుకొనుచు, వాదించుకొనుచు నుండెడివారు.

కాని అరబ్బులు అసలు హిందూదేశమునకు రాలేదు. వారు సింధు దేశమునకు మాత్రము వచ్చి నిలిచిపోయిరి. వారివల్ల ఇండియాలో ఎట్టి పరివర్తనమును జరుగలేదు. తురుష్కులుమున్నగువారి ద్వారానే ఇస్లాము ఇండియాకు వచ్చెను. వీరికి అరబ్బుల కున్న సహనముకాని, సంస్కృతి కాని లేవు. వారు సైనికులుమాత్రమే.

అయినప్పటికి, అభివృద్ధికిని సృష్టిప్రయత్నమునకును తోడ్పడు ప్రేరణ ఇస్లాముద్వారా వచ్చెను. ఇది ఇండియాకు నూత్నజీవనము నెట్లు ఇచ్చెనో, ఎట్లు ఇది పనిచేసెనో ముందుముందు తెలిసికొందము.

హిందూనాగరికత దుర్బలమగుటవల్ల వచ్చిన ఫలిత మొక్కటి నేడు పొడచూపుచుండెను. బాహ్యశత్రువు ఎదిరించగా అది తనచుట్టును గూడుకట్టుకొని, రక్షించుకొన యత్నించినది. అది తన్నుతాను చెరలో పెట్టుకొన్నట్లయినది. ఇదికూడ దుర్బలత్వలక్షణమే, భయలక్షణమే. వేసిన మందువల్ల రోగ మతిశయించిన ట్లయినది. అసలు రోగము బాహ్యశత్రువుదండయాత్ర కాదు. చలనము లేకుండ నిలిచిపోయి మురిగి పోవుట. నన్ను-ముట్టు-కోకు-తనమువల్ల చలనము చచ్చిపోయినది. అభివృద్ధిమార్గము లరికట్టబడినవి. చీనాజపానులుకూడ ఈవిధముగానే పంచరించెను. ముందుముందు ఈ విషయమును తెలిసికొందము. గూడు వలె మూసికొనిపోయిన సంఘములో నివసించుట కొంత ప్రమాదకరమే. అక్కడ మనము మంచి గాలి, నూతనాభిప్రాయములు పీల్చు అలవాటు పోగొట్టుకొని స్తంభించిపోదుము. వ్యక్తులకువలెనే సంఘములకును మంచి గాలి అవసరము.

ఆసియావృత్తాంత మిట్లుండెను. యూరోపు ఆకాలమున వెనుక బడియున్నదనియు, కొట్లాటలలో మునిగియున్నదనియు చూచియుంటిమి

కాని ఈ అల్లరికివి, మొరటుతనమునకును వెనుక శక్తియు, జీవమును ఉన్నట్లు కనిపెట్టవచ్చును. దీర్ఘకాలము ప్రబలముగా నుండి ఆసియా క్షీణముఖమై యుండెను. యూరోపు పైకి లేచుటకు ప్రబలప్రయత్నములు చేయుచుండెను. కాని ఆసియాను అందుకొనుట కది ఎంతో దూరము ముందుకు పోవలసియున్నది.

నేటికాలమున యూరోపు ప్రబలముగా నున్నది. ఆసియా స్వతంత్రమునకై కష్టపడి కృషిసలుపుచున్నది. పైపొరను ఎత్తి లోనికి చూచిన మనకు గోచరించునది ఆసియాలో ఉదయించుచున్న నూతనశక్తి, నూతనసృష్టి. నూతనజీవము. ఆసియా మేల్కొన్నది. ఇందుకు సందేహము లేదు. యూరోపు, అందు ముఖ్యముగా పశ్చిమయూరోపు, ఔన్నత్యము నందియున్నప్పటికిని క్షీణించు చిహ్నములు చూపుచున్నది. యూరోపునాగరికతను కూలద్రోయగలిగిన అనాగరికులు లేరు. కాని ఒకొక్కప్పుడు నాగరికజాతులే అనాగరికులవలె ప్రవర్తింతురు. ఇట్లు తటస్థించినచో నాగరికత తన్ను తానే నాశనము చేసికొనవచ్చును.

నేను ఆసియానుగురించియు, యూరోపునుగురించియు చెప్పుచుంటిని. అవి భూగోళసంబంధమగు పారిభాషికపదములుమాత్రమే. మనల నెదుర్కొనుచున్న సమస్యలు ఆసియాకుగాని, యూరోపుకుగాని సంబంధించినవి కావు. అవి ప్రపంచ సమస్యలు, మానవులకు సంబంధించిన సమస్యలు. ప్రపంచశ్రేయస్సును కోరి వాటిని మనము పరిష్కరించకున్నచో ఇబ్బందులు తప్పనేతప్పవు. అట్లు పరిష్కరించగలిగినచో దరిద్రము, దైన్యము సర్వత్ర అంతరించును. ఇట్లు జరుగుటకు దీర్ఘకాలము పట్టవచ్చును, కాని దీనిని మనము లక్ష్యముగా నుంచుకోవలెను. దీనికి తగ్గకూడదు. అప్పుడే సర్వసమత్వముపై ఆధారపడిన సంస్కృతియు, నాగరికతయు మనకు దక్కగలవు. ఒక దేశముగాని, జాతిగాని స్వప్రయోజనము నాసించి ఇతరదేశములనుగాని, జాతినిగాని పీడించుట ఉండదు. అట్టి సంఘము నూతనసృష్టిని చేయును; వృద్ధిసూచకముగా

నుండును; మారుచున్న పరిస్థితులకు అనుగుణముగా సరిపుచ్చుకొను చుండును; దాని సభ్యుల సహకారముపై ఆధారపడియుండును. చివర కది ప్రపంచము నంతయు ఆవరించవలెను. అట్టి నాగరికత ప్రాచీన నాగరికతలవలె కూలిపోవు నను, లేదా క్షీణించు నను ప్రమాదములేదు.

మనము ఇండియాస్వతంత్రతకు పెనగులాడుచున్నాము. కాని మనము జ్ఞాపకముంచుకొనవలసిన విషయమొకటి యున్నది. మన లక్ష్యము మానవస్వాతంత్ర్యము నుద్దేశించియుండవలెను. మానవస్వా తంత్ర్యమన్నప్పుడు మన స్వాతంత్ర్యముమాత్రమే కాదు. ఇతరమానవుల స్వాతంత్ర్యము కూడ అందిమిడియున్నది.

# 59

# అమెరికాలోని మాయానాగరికత

జూౕ 13, 1932

ఈ జాబులలో నేను ప్రపంచచరిత్ర వివరించుచున్నట్లు చెప్పు చుంటిని కాని ఇది పర్యవసానమునకు ఆసియాయూరోపులయొక్కయు, ఉత్తరఆఫ్రికాయొక్కయు చరిత్రమాత్రమే అయియున్నది. అమెరికాను గురించియు, ఆస్ట్రేలియానుగురించియు నేను ఏమియు చెప్పలేదనియే చెప్పవలెను. కాని అమెరికాలో ఆ తొలిరోజులలో నాగరికత యొక్క టున్నదని హెచ్చరిక చేసియుంటిని. దీనినిగురించి ఎక్కువ విషయములు తెలియవు. నాకు తెలిసినదికూడ బహుకొద్ది. అయినప్పటికిని దానినిగురించి నీకు కొంత చెప్పవలెనని ఉబలాటపడుచున్నాను. కొలంబసు అనువాడును, ఇతరయూరోపియనులును అమెరికాను చేరకపూర్వ మది అనాగరిక దేశమై యుండెనని నలుగురితోపాటు నీవును తప్పు అభిప్రాయము పడుదువేమో యని ఊహని చేయుచున్నాను.

ఎంతోకాలమునకు పూర్వము,బహుశా శిలాయుగము(Stone age) లో మానవు డింకను స్థిరనివాస మేర్పరచుకొనక వేటాడుచు దేశసంచా

రము చేయుచున్న కాలమున ఆసియాకును, ఉత్తరఅమెరికాకును భూమి ద్వారా సంబంధ ముండెను. మానవుల తెగలు సంఘములుగా, అలాస్కా గుండా ఒక ఖండమునుండి వేరొక ఖండమునకు రాకపోకలు చేసి యుండవలెను. కొంతకాల మైనపిమ్మట ఈ దారులు మాసిపోయెను. అమెరికాలోని ప్రజలు తమ సొంతనాగరికతను అభివృద్ధిచేసికొనిరి. మనకు తెలిసినంతవరకు ఆసియా యూరోపులతో సంబంధ మేర్పరచుకొనుటకు వారి కెట్టిమార్గములును లేవని జ్ఞాపకముంచుకొనుము. పదునారవ శతాబ్దివి నూతనప్రపంచమును కనిపెట్టినట్లు చెప్పునంతవరకు ఇతరప్రపంచభాగ ములతో సంబంధమున్నట్లు చెప్పు వృత్తాంతము లేవియు లేవు. ఈ అమెరికా ఒక ప్రత్యేకదూరప్రపంచమై యుండెను. యూరోపుఆసియాల లోని సంభవములతో దాని కెట్టిసంబంధమును లేకయుండెను.

అమెరికాలో నాగరికతకు కేంద్రస్థానములు మూ డున్నవని చెప్పు దురు. ఒకటి మెక్సికో, రెండు మధ్యఅమెరికా, మూడు పెరూ. వాటి ప్రారంభ మెప్పుడో మనకు తెలియదు. కాని మెక్సికోపంచాంగము (Calendar) క్రీ. పూ. 613 సంవత్సరమునకు సరివచ్చు సంవత్సరముతో ప్రారంభమైనది. క్రీస్తుశకపు తొలిరోజులలో, రెండవ శతాబ్దినుండియు అనేకనగరములు తలయెత్తుచుండుట మనము గమనింతుము. రాతిపని (Stone-work), కుండలుచేయుపని, నేతపని, చక్కని రంగులువేయు పని అప్పు డచ్చట నుండెను. రాగిబంగారములు సమృద్ధిగా దొరకు చుండెను. కాని ఇనుముమాత్రము లేదు. వాస్తుశాస్త్ర మభివృద్ధిలో నుండెను. భవననిర్మాణమున నగరము లొకదానితో నొకటి పోటీపడు చుండెను. ఒక ప్రత్యేకతరహా జిలుగువ్రాతకూడ అప్పు డుండెను. కళ, ముఖ్యముగా శిల్పకళ (శిలాదారువులను మలచు విద్య) అప్పు డెక్కువగా కానవచ్చుచుండెను. అది ఎంతో అందముగా నుండెను.

ఈ మూడు నాగరికతాకేంద్రములు ప్రతియొక్కదానిలోను అనేక రాజ్యము లుండెను. అం దనేకభాష లుండెను. ఆ భాషలకు విపులమగు

పారస్వతము లుండెను. దొరతనములు కట్టుదిట్టముగా, బలముగా నుండెను. నగరములలో సంస్కారులు, బుద్ధిమంతులు ఉండిరి. శాసన నిర్మాణము (Legislation), ఆర్థికవిధానము (Financial system) ఈ రాజ్యములలో అత్యున్నతస్థితిలో నుండెను. ఉక్సుమాల్ అను నగరము దాదాపు క్రీ. వె. 960 సంవత్సరమున స్థాపించబడెను. ఇది త్వరలో మహానగరమై, ఆ రోజులలో ఆసియాలో నున్న నగరముతో సాటివచ్చు చుండెనట. గొప్పనగరములు ఇంకను గలవు—లాబు, మాయాపజా, చాముల్టన్.

మధ్యఅమెరికాలోని ప్రధానరాజ్యములు మూడును మిత్రత్వమును సాధించెను. దాని నిప్పుడు "మాయాపజా సమితి" యందురు. ఇది జరిగి క్రీస్తువెనుక సుమారు వేయిసంవత్సరము లైనది. ఈ కాలమున ఆసియా యూరోపుల స్థితి మనము ప్రసంగించుకొనియుంటిమి. దీనినిబట్టి చూడ క్రీస్తువెనుక వేయిసంవత్సరములప్పుడు మధ్యఅమెరికాలో నాగరికత నందిన రాజ్యములు కలిసి ప్రబలులై యుండిరని స్పష్టపడుచున్నది. కాని ఈ రాజ్యము లన్నియును, మాయానాగరికతయును పురోహితుల చెప్పు చేతలలో నుండెను. జ్యోతిష మన్న ఆ రోజులలో ఎక్కువ గౌరవము. ఈ శాస్త్రము నభ్యసించిన పురోహితులు అమాయకులగు ప్రజలను తమ వశము చేసికొనుచుండిరి. ఇండియాలో సూర్యచంద్రగ్రహణములు పట్టి నప్పుడు లక్షలకొద్ది జనులు స్నానముచేయునట్లును, ఉపవాస ముండు నట్లును ప్రోత్సహించువిధముననే.

మాయాపజాసమితి 100 సంవత్సరముల కాలము మన్నెను. అప్పుడు సాంఘికవిప్లవము సంభవించినట్లు తోచును. పొలిమేరలో నున్న విదేశరాజ్య మొకటి కలుగజేసికొన్నట్లును తోచును. క్రీ. వె. 1190 సంవత్సరమున మాయాపజా నాశనముచేయబడెను. మిగత గొప్ప నగరములుమాత్రము నిలిచియుండెను. మరి నూరుసంవత్సరములకు వేరొక జాతి రంగమున ప్రవేశించెను. వీరు మెక్సికోనుండి వచ్చిన

అజ్టెక్కులు. పదునాల్గవ శతాబ్దపు తొలిరోజులలో వారు మాయాదేశమును జయించిరి. సుమారు క్రీ. వె. 1325 సంవత్సరమున వారు "టెనోచ్టిట్లాన్" నగరమును ప్రతిష్ఠించిరి. అచిరకాలముననే ఇది ప్రజాబాహుళ్యము కలిగి మెక్సికోప్రపంచమున కంతకును రాజధాని యయ్యెను. అజ్టెక్కుల సామ్రాజ్యమునకు కేంద్రమయ్యెను.

అజ్టెక్కులు శూరజాతి. వారికి యుద్ధసంబంధమగు వలస లుండెను. వారికి సైనికదళము లుండెను. యుద్ధమునకు పనికివచ్చు రహదారు లనేక ముండెను. తమపై ఆధారపడియున్న రాజ్యము లొకరితో నొకరు కలహించుకొనునట్లు చేయగల తెలివితేటలుకూడ వారికి కలవు. నానాత్వ మట్టిరాజ్యములలో ప్రవేశించినచో వారిని పాలించుట సులభము. అన్ని సామ్రాజ్యములయొక్కయు పాలనవిధాన మదియే. దీనినే రోము "డివైడ్యట్ ఇంపీరా" అనెను. అనగా "విరగొట్టి పాలించుము" అని.

ఇతరవిషయములలో ఎంతటి తెలివితేటలు కలవారైనను అజ్టెక్కులు పురోహితుల చేతులలో కీలుబొమ్మలై యుండిరి. ఇంతకన్న విషాదకరమగు విషయము—వారి మతము నరబలులను ఒప్పుకొనును. ప్రతిసంవత్సరమును వేలకొద్ది మనుష్యులు ఘోరముగా నరబలుల పేర హత్యచేయబడుచుండిరి.

సుమారు 200 సంవత్సరములపాటు అజ్టెక్కులు కఠినముగా తమ సామ్రాజ్యమును పాలించిరి. పయికిచూచుటకు సామ్రాజ్యములో శాంతిభద్రత లుండెను. కాని పాలకుల లాభముకొరకై ప్రజలు పీడింపబడుచుండిరి. వారు కటికదరిద్రులై యుండిరి. ఇట్లు నిర్మింపబడి, ఇట్లు పాలింపబడు సామ్రాజ్యము ఎంతకాలము దక్కును? పదునారవ శతాబ్దము మొదటి రోజులలో (1519 సం॥న) అజ్టెక్కులు ఉచ్చలో నున్నట్లే కనిపించుచుండిరి. కాని కొద్దిమంది దుందగీంద్రగు విదేశీయుల దెబ్బకు వారి సామ్రాజ్యము నేలమట్టమయ్యెను. సామ్రాజ్య మెంత త్వరలో కూలిపోగలదో తెలుపుట కిది ఆశ్చర్యకరమగు నిదర్శనము నిచ్చుచున్నది.

అజ్టెక్కుల పతనమునకు కారణభూతుడు స్పెయినుదేశస్థుడగు హెర్నన్‌కార్టెజ్ అనువాడును, అతని సహచరులు కొద్దిమందియు. కార్టెజ్ ధైర్యశాలి, సాహసుడు. అతనివద్ద నున్న తుపాకులును, గుర్రములును అతని కెక్కువ సహాయకరముగా నుండెను. మెక్సికన్ సామ్రాజ్యములో గుర్రములున్నట్లు తోచదు. తుపాకులు లేనేలేవు. అజ్టెక్కుల సామ్రాజ్యము కుళ్ళి చివకకపోయిఉన్నట్లయితే కార్టెజ్ ధైర్యసాహసములుగాని, అతని గుర్రములును, తుపాకులునుగాని ఎందుకును కొరగాకపోయెడివి. పైకి బాగుగా కనిపించుచున్నను అంతరమున అది శిథిలమైయుండెను. దానిని పడగొట్టుట కొక తన్ను చాలును. తమ లాభమునకై పాలకులు ప్రజలను పీడించుచుండిరి. ప్రజలు ఆగ్రహగ్రస్తులై యుండిరి. కాన సామ్రాజ్యమును శత్రువు ఎదుర్కొన్నప్పుడు సామ్రాజ్యవాదుల కష్టములు ప్రజలకు ఇష్టముగానే ఉండెను. సర్వసామాన్యముగా ఇట్లు సంభవించినపుడు సాంఘికవిప్లవముకూడ సంభవించును.

ఒకమారు కార్టెజ్ తరుమగొట్టబడెను. ప్రాణములు చేతబట్టుకొని అతడు తప్పించుకొనిపోయెను. అతడు మరల తిరిగివచ్చి, కొందరు దేశస్థులు సహాయముచేయగా వారి నోడించెను. దీనితో అజ్టెక్కుల పరిపాలన మంతరించెను. చిత్రమేమనగా, దీనితోపాటు మెక్సికన్‌నాగరికత యంతయు నామమాత్రావశిష్ట మయ్యెను. వెంటనే మహానగరమును, సామ్రాజ్యరాజధానియు నగు "టెనోచ్‌టిట్లాన్" మాసిపోయెను. దాని తాలూకు ఒక రాయిసైతము నేడు మనకు దొరకదు. అది ఉండు స్థలము మీద స్పానియర్డులు ఒక క్రైస్తవదేవాలయమును నిర్మించిరి. ఇతర మాయామహానగరములుకూడ చితికిపోయెను. క్రమముగా యూకటన్ అడవులు వాటిని క్రమ్మివేసెను. వాటి పేరులుసైతము మాసిపోయెను. సమీపమందున్న గ్రామముల పేళ్ళనుబట్టియే ఆ నగరములు నేటి కాలమున స్మరింపబడుచున్నవి. వారి సారస్వతముకూడ నశించెను. మూడు

చరిత్రగాథను ప్రస్తుతము కట్టిపెట్టి ఈ జాబులో 5000 సంవత్సరములకు పూర్వమున్న నాగరికతావిషయములను తెలిసికొనుటకు వెనుకకు పోవు దము. నీ కభ్యంతరము లే దనుకొందును.

మొహెంజదారో 5000 సంవత్సరములకు పూర్వ మున్నదని చెప్పుదురు. మనకు గోచరించినదానినిబట్టి చూచిన అది మహానగర మనియు, సంస్కృతియు నాగరికతయు గల ప్రజలకు ఆవాసభూమి యనియు మనము తెలిసికొనగలము. దీర్ఘకాలముపాటు అది అభివృద్ధి చెందిచెంది ఈ స్థితికి వచ్చియుండవలెను. అట్లే ఈగ్రంథము చెప్పు చున్నది. ఖననకార్యము (Excavation) జరిపించుచున్న సర్ జాన్ మార్షల్ ఈవిధముగా చెప్పుచున్నాడు :

"మొహెంజదారోలోను, హరప్పాలోను సందేహములేకుండ స్పష్టముగా తెలియవచ్చు అంశ మొకటి కలదు. ఇంతవరకును ఈ రెండు ప్రదేశములందును వెల్లడియైన నాగరికత అధునాతనము కాదనియు, హిందూదేశమున చిరకాలముపాటు నిలిచి స్థిరత్వము గన్నదనియు, ఎన్నియోవేల సంవత్సరములపాటు మానవులు దీనిని ఉద్యమించి నిర్మించి రనియు అది ప్రకటించుచున్నది. కాన నాగరికోద్యమములు జన్మించి వృద్ధినందిన ప్రధానరంగములగు పర్షియా, ఈజిప్టు, మెసపొటేమియాలతో పాటు ఇండియాకూడ ఒక ప్రధానరంగముగా నేటినుండియు అంగీకరింప బడవలెను."

హరప్పానుగురించి ఇంతవరకును నేను నీకు చెప్పియుండలేదు. మొహెంజదారోలో దొరకిన ప్రాచీనశిథిలములవంటి శిథిలములు దొరకు వేరొక ప్రదేశ మిది. ఇది పశ్చిమపంజాబులో నున్నది.

సింధులోయలో మనము 5000 సంవత్సరములే కాదు వెనుకకు పోయినది. ఇంకను ఎన్నియోవేల సంవత్సరములు వెనుకకు పోతిమి. మానవుడు తొలుదొల్త స్థిరనివాస మేర్పరచుకొన్న అస్పష్టమగు అతి ప్రాచీనకాలముయొక్క అంధకారకోణములవరకు పోతిమి. మొహెంజ

దారో వృద్ధిలోనున్న కాలమునాటికి ఆర్య లింకను ఇండియాలో కాలు పెట్టలేదు. అయినప్పటికిని.

"పంజాబులోను, సింధులోను, బహుశా ఇండియాలో ఇతర ప్రదేశములందునుకూడ వృద్ధిలోనున్నట్టియు, అద్వితీయమైనట్టియు, ఏక రూపముతో నున్నట్టియు నాగరికత విలసిల్లుచుండెననుటకును, ఇది ఆ కాలమునాటి మెసపొటేమియా, ఈజిప్టు నాగరికతలతో దగ్గరగా పోలి యుండెననుటకును, కొన్నివిషయములలో వాటికన్న మిన్నగా నుండె ననుటకును"

సందేహము లేదు.

మొహెంజదారోలోను, హరప్పాలోను త్రవ్వగా రమణీయమగు ఈ ప్రాచీననాగరికత బహిర్గతమైనది. భారతభూమి మట్టిలో ఇతర ప్రదేశములందు పూడిపోయిన విశేషము లింకను ఎన్ని ఉన్నవో! ఈ నాగరికత ఒక్క మొహెంజదారోహరప్పలలోమాత్రమే కాకుండ ఇండియాయంతటను వ్యాపించియుండవచ్చును. ఈ రెండు ప్రదేశము లైనను దూరదూరముగానే ఉన్నవి.

రాతితో చేసిన ఆయుధములతోపాటును, పాత్రలతోపాటును రాగి తోను, కంచుతోను తయారైన ఆయుధములను, పాత్రలను ఉపయోగించు చున్న యుగ మది. సింధులోయలోని ప్రజలు సమకాలికులగు ఈజిప్టు మెసపొటేమియాలలోని ప్రజలనుండి ఎట్లు భేదించియుండిరో, వారికన్న ఏవిషయములలో మిన్నలైయుండిరో సర్ జాన్ మార్షల్ చెప్పియున్నాడు.

అతడు చెప్పిన దేమనగా—"ప్రధానమగు కొద్దివిషయములను మాత్రమే ఉదాహరింతును. బట్టల నేతకై ప్రత్తి నుపయోగించు ఆచా రము ఈకాలమున ఇండియాలోమాత్రమే కలదు. ఇక రెండుమూడు వేల సంవత్సరముల తరువాతగాని పాశ్చాత్యప్రపంచమున కది ఎక్క లేదు. మరియు మనకు తెలిసినంతమట్టుకు ఈజిప్టులోగాని, మెసపొ టేమియాలోగాని, పడమటి ఆసియా ఇతరప్రాంతములందుగాని

మొహెంజదారో ప్రజలకొరకు చక్కగా నిర్మింపబడిన స్నానతటాకముల (Baths)తోను, సువిశాలమగు ఇండ్లతోను సరిపోలునట్టివి లేవు. ఆ దేశములలో దేవుళ్ళకు గొప్పదేవాలయములు నిర్మించుటకును, రాజులకు భవనములు, సమాధులు నిర్మించుటకును బుద్ధిని, ధనమును వ్యయించుచుండిరి. మిగతప్రజలు మట్టికొంపలలో దేవుళ్ళాడుచుండిరి. సింధులోయలోమాత్రము ఈ పరిస్థితులు భిన్నముగా నుండెను. ప్రజల సదుపాయముకొరకు నిర్మింపబడిన కట్టడములే ఎంతో రమ్యముగా నుండెను."

మరియు నీక్రిందివిషయములు పేర్కొనబడినవి :

"సింధులోయలోని కళయును, మతమును విశిష్టమైనవి. వాటి కవేసాటియని చెప్పదగిన ప్రత్యేకలక్షణములు వాటి కుండెను. గొర్రెపొట్టేళ్ల యొక్కయు, కుక్కలు మున్నగువాటియొక్కయు మట్టిమాదిరులతోకాని, పింగాణీమాదిరులతోగాని, లేదా మొహరులమీది పోగరపనితో (Intaglio engraving) గాని శైలిలో సరిపోల్చదగినవి ఆకాలమున ఏదేశములోను మనకు తెలిసినంతవరకు లేవు. పోగరపనిలో అత్యుత్తమమైనవి మూపురమున్నట్టియు, పొట్టికొమ్ములు గలట్టియు ఎద్లు. అత్యుత్తమమగు ఇట్టి చెక్కడములయొక్క ప్రశస్తలక్షణములు—రచనలో వైశాల్యమును, రూపరేఖానిర్మాణచాకచక్యమును. చెక్కడపుకళలో ఇట్టి లక్షణములు ఏ ఇతరనమూనాలలోను కానరావు. హరప్పాలో దొరికినట్టియు, X, XI ప్లేటులలో చూపబడినట్టియు రెండు చిన్న మానవవిగ్రహములు కలవు. వీటి రూపకల్పన మిక్కిలి మృదువుగా నుండెను. అత్యుచ్చదశ నందిన గ్రీసులో తప్ప వీటికి సాటి మరియెచ్చటను లేదు. సింధుప్రజల మతములో ఇతరదేశములలోని మతములకు సరిపోయిన విశేషము లనేక మున్నవి. చరిత్ర తడవని మతములన్నిటిలోను, చరిత్రలో చెప్పబడిన మతములు పెక్కింటిలోను ఇట్లుండుట సాధారణము. కాని మొత్తముమీద చూచిన వారి మతము హిందూత్వలక్షణములు కలిగియుండెను. నేడున్న హిందూమతమునకును, దానికిని తేడాలు ఎక్కువగా లేవు."

హరప్పాలో దొరికిన చిన్న మానవవిగ్రహములను, లేదా వాటి

బొమ్మలను చూడవలెనని కుతూహలముగా నున్నది. ఎప్పుడో ఒకరోజున నీవును, నేనును హరప్పామొహెంజదారోలకు వెళ్ళి తనివితీర ఈ దృశ్యములను చూడగల మనుకొందును. అందాక మన పనులు మనము చేసికొందము. నీవు పూనాలో నీబడిలోను, నేను నా బడిలోను. నాబడి పేరు డెహ్రాడూన్ జిల్లాచెరసాల.

# 61

# కార్డోబా: గ్రనడా

జూన్ 16, 1932

ఆసియాయూరోపులలో సంవత్సరములగుండా మనము ప్రయాణము చేసితిమి. క్రీస్తువెనుక 1000 సంవత్సరముల అనంతరము ఆగి సింహావలోకనము చేసితిమి. కాని, ఏకారణమువల్లనైననేమి, మన వృత్తాంతములో స్పెయిను చేరలేదు—అరబ్బుల వశమందున్న స్పెయిను. కాన మనము వెనుకకుపోయి వెనుకటి చిత్రములో ఉచితస్థానమున దానిని నిలుపవలెను.

నీకు జ్ఞాపకమున్నదో-లేదో, స్పెయినునుగూర్చి కొంత ఇదివరలోనే నీకు తెలియును. క్రీ. వె. 711 సంవత్సరములో అరబ్బీసేనాని ఆఫ్రికా దాటి స్పెయినులో కాలుపెట్టెను. అతని పేరు "టరీక్". అతడు జిబ్రాల్టరువద్ద దిగెను (జబల్-అట్-టరీక్ అనగా టరీక్‌యొక్క కొండ). రెండుసంవత్సరములలో అరబ్బులు స్పెయినునంతను జయించిరి. కొద్దికాలమైనపిమ్మట పోర్చుగల్లునుకూడ కలుపుకొనిరి. వారు ముందుకు పోసాగిరి. ఫ్రాన్సులోనికి పోయి దక్షిణమునంతయు వ్యాపించిరి. భీతావహులై ఫ్రాంకులును, ఇతరతెగలవారును చార్లెసుమార్టెల్‌నాయకత్వమున చేరి అరబ్బుల నాపుటకు గొప్ప ప్రయత్నమును చేసిరి. వారు సఫలులైరి. ఫ్రాన్సులో "పోటీర్సు" వద్దనున్న "టూర్సు" కడ జరిగిన మహాయుద్ధములో ఫ్రాంకులు అరబ్బుల నోడించిరి. ఓటమి తీవ్రమైనదే.

యూరోపును జయించవలె నని అరబ్బులు పెట్టుకొన్న ఆశలు దీనితో అంతరించెను. తరువాత ఎన్నియో పర్యాయములు అరబ్బులకును, ఫ్రాన్సు లోని ఫ్రాంకులకును, ఇతర క్రైస్తవులకును యుద్ధములు జరిగెను. ఒక్కొక్క పర్యాయము విజయము అరబ్బులకు దక్కుటచే వారు ఫ్రాన్సులో ప్రవేశించుచుండిరి. వేరొక్క పర్యాయము వారు స్పెయిను లోనికి తరుమగొట్టబడుచుండిరి. "ఛార్లీమాన్" సహితము వారిని స్పెయినులో ఎదిరించెను కాని ఓడిపోయెను. మొత్తముమీద చాలకాలము పాటు ఇట్లు హెచ్చుతగ్గులు లేకుండ జరిగెను. అరబ్బులు స్పెయినులో పాలించుచుండిరి. స్పెయిను దాటి వారు పోలేదు.

ఇట్లు అరబ్బీమహాసామ్రాజ్యములో స్పెయిను చేరినది. ఈ సామ్రాజ్యము ఆఫ్రికా అంతయును మంగోలియా సరిహద్దులవరకును వ్యాపించెను. కాని చిరకాల మిట్లుండలేదు. అరేబియాలో అంతర్యుద్ధము జరిగె నన్న మాట నీకు జ్ఞాపక ముండియుండును. అప్పుడు అబ్బాసీదులు ఒమ్మియాదీ కాలీఫులను తరుమగొట్టిరి. స్పెయినులోనున్న అరబ్బీగవర్నరు ఒమ్మియాదీ శాఖకు చెందినవాడు కాన క్రొత్తగా వచ్చిన అబ్బాసీదుకాలీఫుఅధికారము నాతఁ డంగీకరించలేదు. ఇట్లు స్పెయిను అరబ్బీసామ్రాజ్యముతో తెగ తెంపులు చేసికొనెను. బాగ్దాదులోని కలీఫు దూరములో నుండెను. ఈ విషయములో కలుగజేసికొనుట కతని కనుకూలములు లేవు. ఆతని కష్టములలో అతడు తగుల్కొని కొట్టుకొనుచుండెను. కాని స్పెయిను బాగ్దాదులమధ్య స్పర్ధలు చెలరేగుచుండెను. ఈ రెండు అరబ్బీరాజ్యము లును కష్టసమయమున ఒకదాని కొకటి సహాయము చేసికొనుటకు బదులు ఒకరికి కష్టములు తటస్థించినప్పుడు రెండవవారు సంతోషించుచుండిరి.

స్పెయినులోని అరబ్బులు మాతృదేశముతో తెగతెంపులు చేసికొనుట అనాలోచితకార్యమే. వారా, దూరదేశములో నుండిరి. ప్రజలా, విదేశీయులు. చుట్టుపట్ల నున్నవారా, శత్రువులు. వారి సంఖ్య చూచిన తక్కువ. కష్టము వచ్చినను, ప్రమాదము సంభవించినను నా అనువా

రెవరును లేరు. కాని ఈ రోజులలో వారెంతో ఆత్మవిశ్వాసముతో నుండిరి. ప్రమాదములను లక్ష్యపెట్టకుండిరి. ఉత్తరమున క్రైస్తవ జాతులు నిరంతరము ఒత్తిడిచేయుచున్నను వారు నిగ్రహించుకొనివచ్చిరి. అన్యసహాయము లేకుండ, 500 సంవత్సరముల కాలము స్పెయినుదేశములో అధికభాగముపైని వారధికారము నిలుపుకొనగలిగిరి. తరువాత కూడ మరి 200 సంవత్సరముల కాలము వారు స్పెయిను దక్షిణమున నొక చిన్న రాజ్యమును పాలించియుండిరి. ఇట్లు వారు బాగ్దాదుసామ్రాజ్యముకన్న ఎక్కువకాలము నిలువగలిగిరి. తుదకు అరబ్బులు స్పెయిను వదలిపెట్టునాటికి బాగ్దాదు నాశనమై ఎంతోకాల మైనది.

స్పెయిను కొన్నిభాగములను 700 సంవత్సరములకాలము అరబ్బులు పరిపాలించుట ఆశ్చర్యకరమగు విషయమే. ఇంతకన్న ఆశ్చర్యకరమగు విషయము వారి ఉన్నతనాగరికతయును, సంస్కృతియును. స్పానిష్ అరబ్బులనే మూరులు అనువారు. కొద్దిగా ఉత్సాహావేశము తన్ను పురిగొల్ప ఒక చరిత్రకారుడు ఈ విధముగా వ్రాసెను :

"మూరులు కార్డోవా యను అద్భుతమగు రాజ్యమును నిర్మించిరి. మధ్యయుగములలో నది ఆశ్చర్యమును గొలుపుచుండెను. యూరోపంతయును అనాగరికమై అజ్ఞానములోను, కొట్లాటలలోను మునిగియున్న సమయమున ఈ రాజ్యము జ్ఞానజ్యోతిని, నాగరికజ్యోతిని పాశ్చాత్య ప్రపంచముఎదుట ఎత్తిపట్టినది."

సరిగా 500 సంవత్సరములపాటు ఈరాజ్యమునకు కుర్టూబా రాజధానిగా నుండెను. దీనినే ఇంగ్లీషులో కార్డోబా యనియు, అప్పుడప్పుడు కార్డోవా యనియు అందురు. నేను ఒక్కొక్కప్పుడు ఒకేపేరు వ్రాయవలసివచ్చినప్పుడు భిన్నవర్ణక్రమములను వాడుచుందును. ఈ పదమును కార్డోబా యనియే ఇకముందు వ్రాయగలను. ఈ మహానగరములో జనసంఖ్య పదిలక్షలు. దాని పొడవు 10 మైళ్లు. అది ఉద్యాననగరము (Garden city). దాని పేటలు ఇరువదినాల్గు మైళ్ల వ్యాపించియుండెను. అందు 60,000 రాజభవనములును, నగరులును, 200,000 చిన్న

ఇండ్లును, 80,000 దుకాణములును, 3860 మసీదులును, ప్రజలకొరకు నిర్మింపబడిన 700 స్నానతటాకములును (Baths) కలవట. ఇం దతిశయోక్తి ఉండవచ్చును కాని నగరమెట్టిదైనది ఊహించుకొనుట కీయంకెలు పనికివచ్చును. ఆనగరమున పుస్తకభాండాగారము లనేక ముండెను. అందు ముఖ్యమైనది అమీరుయొక్క సామ్రాజ్యభాండాగారము. దీనిలో 400,000 గ్రంథము లుండెను. బీదల కుచితవిద్యాశాలలు పెక్కు లుండెను. ఒక చరిత్రకారు డిట్లు చెప్పుచున్నాడు :

"స్పెయినులో సుమారు అందరును చదువను, వ్రాయను నేర్చి యుండిరి. క్రైస్తవయూరోపులో మతాచార్యులు తప్ప మిగతవారందరు, ఉన్నతకుటుంబములకు చెందినవారుసైతము నిరక్షరాస్యులై యుండిరి."

కార్డోబానగర మట్లుండెను. అది వేరొక అరబ్బుల మహానగర మగు బాగ్దాదుతో సరితూగియుండెను, దాని ప్రసిద్ధి యూరోపంతటను వ్యాపించెను. పదియవ శతాబ్దిలో నున్న జర్మనుగ్రంథకర్త యొకడు దానిని "ప్రపంచభూషణము" అనెను. దూరప్రదేశములనుండి విద్యార్థులు అచ్చటి విశ్వవిద్యాలయమునకు వచ్చెడివారు. యూరపులోని ఇతర గొప్ప విశ్వవిద్యాలయములగు పారిస్, ఆక్సుఫర్డులలోనికిని, ఉత్తరఇటలీలోని విశ్వవిద్యాలయములకును అరబ్బీతత్త్వశాస్త్రము వ్యాపించెను. పన్నెండవ శతాబ్దిలో "అవెర్రోస్" అను "ఇబిన్‌రషీద్" కార్డోబాలో ప్రసిద్ధ తత్త్వ శాస్త్రజ్ఞుడుగా నుండెను, చివరరోజులలో అతడు స్పానిష్ అమీరుతో కలహించుటచే నతనిని దేశమునుండి వెడలగొట్టిరి. అతడు పారిసుకు పోయి అక్కడ నిలిచిపోయెను.

యూరోపు ఇతరభాగములలో నున్నట్లే స్పెయినులోకూడ ఒక విధమగు ఫ్యూడల్‌పద్ధతి అమలులో నుండెను. ప్రబలులగు గొప్ప కులీనులు తలయెత్తిరి. వారికిని, పాలకుడగు అమీరునకును తరచు పోరాటములు జరుగుచుండెను. బాహ్యాదండయాత్రలకన్న ఈ అంతఃకలహములే అరబ్బీరాజ్యము దుర్బల మగుటకు కారణమయ్యెను. ఆకాలముననే ఉత్తరస్పెయినులోని కొన్ని చిన్న క్రైస్తవరాజ్యములు తమ వలుకు

బడిని వృద్ధిచేసికొనుచు అరబ్బులమీదకు వచ్చిపడుచుండెను.

దాదాపు క్రీ. వె. 1000 సంవత్సరమున—అనగా ప్రథమసహస్ర వర్షములు ముగిసినప్పుడు—అమీరురాజ్యము దాదాపు స్పెయినుదేశ మంతటను వ్యాపించియుండెను. దక్షిణఫ్రాన్సులోని ఒక చిన్నభాగము కూడ అందు చేరియుండెను. కాని త్వరలోనే అరబ్బీరాజ్యము పతన మాయెను. సామాన్యముగా జరుగునట్లే లోపలి దుర్బలత్వమువల్లనే అది కూలిపోయెను. కళలతో, భోగభాగ్యములతో, శౌర్యముతో నిండిన చక్కని అరబ్బీనాగరికత—చూడగా భాగ్యవంతుల నాగరికతమాత్రమే. కడుపుమాడుచున్న బీదలు తిరుగబడిరి. కార్మికుల అల్లరులు చెలరేగెను. క్రమక్రమముగా అంతఃకలహము వ్యాపించెను. రాష్ట్రములు పడిపోయెను. అరబ్బుల స్పానిష్‌సామ్రాజ్యము ముక్కలై పోయెను. చీలిపోయినప్పటికిని అరబ్బులు ఇంకను పరిపాలన సాగించుచుండిరి. క్రీ. వె. 1236 సంవత్సర మున తుట్టతుదకు కార్డోబా క్రైస్తవుడగు కాస్టయిల్‌రాజు చేతులలోపడెను.

అరబ్బులు దక్షిణమునకు తరుమగొట్టబడిరి. అయినను వారు ప్రతి ఘటించుచునే యుండిరి. స్పెయిన్‌దక్షిణమున వారొక చిన్న రాజ్యమును స్థాపించుకొనిరి. దాని పేరు గ్రానడారాజ్యము. అచ్చట వారు నిలిచి పోయిరి. ఈ రాజ్యము పరిమాణమునుబట్టి చూచిన బహుచిన్నది. . కాని అరబ్బీనాగరికతాలక్షణములన్నియు ఇందు పట్టినవి. గ్రానడాలో, నేటికిని ప్రసిద్ధిగాంచిన అల్హాంబ్రా ప్రాసాదము నిలిచియున్నది. ఆర్చిలతో, స్తంభ ములతో, రంగురంగుల లతాద్యలంకరణములతో అది వెనుకటి సామ్రాజ్య మును తలపునకు దెచ్చుచుండెను. అరబిక్ భాషలో దాని తొలుతటిపేరు "అల్ - హమ్రా", అనగా ఎఱ్ఱటి నగరు అన్నమాట. విగ్రహములను చిత్రించుట ఇస్లాముకు సమ్మతము కానందున భవననిర్మాతలు అంద మైనట్టియు, కల్పితమైనట్టియు చిత్రవిచిత్రములగు నమూనాలు చిత్రించిరి. కురానునుండి అరబిక్‌పద్యములను ఆర్చిలమీదను, ఇతర ప్రదేశములందును వ్రాసిరి. ఈ వ్రాతలు అలంకారప్రాయముగ నుండునట్లు చేసిరి. అరబిక్ అక్షరములు ఇట్టి అలంకరణమున కనుకూలముగా నుండెను.

గ్రానడారాజ్యము 200 సంవత్సరములు నిలిచెను. స్పెయినులోని క్రైస్తవరాజ్యములు దానిని పీడించుచుండెను. ముఖ్యముగా కాస్టయిలు అట్లు చేయుచుండెను. ఒక్కొక్కమారు దానికి కప్పముకట్టుటకుకూడ వారు సమ్మతించిరి. క్రైస్తవరాజ్యములలోనే నానాత్వము లేకున్నచో ఇంతకాలమైనను అది నిలిచియుండకపోవును. కాని క్రీ. వె. 1469 సంవత్సరమున ఈ ప్రధానరాజ్యములయొక్క పాలకులకు వివాహము జరిగెను. వారు ఫెర్డినెండు, ఇసాబెల్లా అనువారు. ఇది కారణముగా కాస్టయిలు, ఆరగాన్, లియాన్‌రాజ్యములు ఏకమైనవి. ఫెర్డినెండు ఇసాబెల్లాలు గ్రానడాలోని అరబ్బీరాజ్యమును తుదముట్టించిరి. అరబ్బులు పలుసంవత్సరములు ధైర్యముతో పోరాడిరిగాని చివరకు గ్రానడాలో శత్రువులు వారిని చుట్టుముట్టి నాలుగువైపుల క్రమ్ముకొనిరి. తినుటకు తిండి లేక వారు క్రీ. వె. 1492 సంవత్సరమున లొంగిపోయిరి.

అరబ్బులు—పీరినే సారసను లందురు—పలువురు స్పెయిను వదలి ఆఫ్రికాకు వెళ్ళిపోయిరి. ఎత్తుగా, గ్రానడావద్ద పట్టణమునకంతకు కనిపించుచు ఒక ప్రదేశము కలదు. దాని పేరు "మూరుల తుదినిట్టూర్పు."

కాని పలువురు అరబ్బులు స్పెయినులోనే నిలిచిపోయిరి. స్పెయినుచరిత్రలో అరబ్బులకు పెట్టిన బాధలు మిక్కిలి కళంకప్రాయమగు ఘట్టము. క్రౌర్యము, హత్య విరివిగా నుండెను. అరబ్బులను సహనముతో చూతుమన్న వాగ్దానములు విస్మరించబడెను. ఈ కాలమునందే స్పెయినులో ఇన్‌క్విజిషన్ (క్రైస్తవమతాచార్యుల ధర్మవిచారణసభ—Inquisition) స్థాపించబడెను. ఇది రోమనుచర్చిచేతులలో ఘోరమగు ఆయుధముగా పరిణమించెను. దాని ఆజ్ఞలను శిరసావహించనివారి నణగ ద్రొక్కుటకు ఈ ఆయుధము నుపయోగించెడువారు. సారసనులక్రింద యూదులు వృద్ధిలోనికివచ్చిరి. ఇప్పుడు మతము మార్చుకొమ్మని రోమన్ చర్చి వారిని బాధపెట్టెను. పలువురు దహింపబడిరి. స్త్రీలును, పిల్లలును కూడ ఇట్టి దండన అనుభవించవలసివచ్చెను. ఒక చరిత్రకారుడు చెప్పినదేమనగా, "క్రైస్తవమతముమీద విశ్వాసము లేనివారిపై (అనగా సార

సనులు) తమ అందమైన దుస్తులను విసర్జించవలసినదనియు, తమ్ము జయించినవారు వేసికొను దుస్తులను, అనగా దొరటోపీని, లాగులను వేసికొనవలసిన దనియు, తమ మాతృభాషను వదలిపెట్టవలసినదనియు, తమ ఆచారవ్యవహారములను, తమ నామధేయములనుకూడ వదలుకో వలసిన దనియు, స్పానిష్‌భాష మాటాడుచు స్పానిష్‌పద్ధతిని నడుచుకో వలసిన దనియు, తాము స్పానియర్డులమని క్రొత్తగా పేరు పెట్టుకొన వలసిన దనియు ఉత్తరువులు జారీచేయబడెను."

ఇట్టి అనాగరికచేష్టలు సహించక ప్రజలు తిరుగుబాటు చేసిరి. కాని వా రందరు క్రూరముగా హింసింపబడిరి.

స్పానిష్ క్రైస్తవులకు స్నానముచేయుట, బట్టలుదుకకొనుట అన్న ఇష్టము లేనట్లు తోచును. ఈ పనులు వారికి కిట్టకపోవుటకు కారణము బహుశా అరబ్బులకు ఈపనులన్న ఇష్టము కాన. అందువల్లనే అరబ్బులు గొప్ప స్నానతటాకములను ప్రజలకొరకు నగరమం దంతటను నిర్మించిరి. క్రైస్తవులు "మొరిస్కోలను (అనగా మూరులు, లేదా అర బ్బులు) సంస్కరించు ఉద్దేశముతో" ఈ క్రింది ఉత్తరువులనుకూడ జారీ చేసిరి. "వారినిగాని, వారి భార్యలనుగాని, ఇతరులనుగాని ఇంటివద్దగాని, ఇతర ప్రదేశములందుగాని స్నానముచేయ నీయరాదు. ఒళ్లు కడుగుకొన నీయరాదు. వారి స్నానశాలలన్నియు పీకివేసి నాశనము చేయవలెను."

స్నానము చేయుట అను పాపకార్య మొక్కటేకాదు మొరిస్కోలు చేసినది. వారిపై మోపిన నేర మింకొకటి కలదు. వారు మతవిషయమున సహనబుద్ధి కలవారై యుండిరి. ఈ నేరము అసామాన్యమైనది. 1602 సంవత్సరమున వెలెంషియా అర్చిబిషప్పు స్పెయినునుండి సారసనులను తరిమివేయవలె నని సిఫారసుచేయుచు "మొరిస్కోల స్వమత పరిత్యాగ ములు, ద్రోహములు" అను వృత్తాంతమున ఎత్తుకొన్న నేరములలో నిది యొకటి. ఈవిషయము నెత్తుకొని అతడు చెప్పిన దేమనగా, "తురు ష్కులును, ఇతరమహమ్మదీయులును మతవిషయములలో నెట్టి నమ్మ కములైనను ప్రజలు పెట్టుకొనుటకు సమ్మతించిరి. అట్లే మొరిస్కో

లును మతవిషయమున స్వతంత్రబుద్ధి నెంతో మెచ్చుకొనిరి." అనుకో కుండ స్పెయినులోని సారసనులను అత డిట్లు గొప్పగా శ్లాఘించెను. స్పానిష్ క్రైస్తవుల దృష్టి అసహనముతో కూడుకొని ఎంత భిన్నముగా నున్నది!

బలవంతముగా స్పెయినునుండి లక్షలకొద్ది సారసనులు తరుమ గొట్టబడిరి. కాని అరబ్బులు 700 సంవత్సరముల కాలము స్పెయినులో నుండి రన్నమాట నీవు జ్ఞాపకముంచుకోవలెను. ఈ దీర్ఘకాలములో వారు స్పెయిను ప్రజలతో చాలవరకు కలిసిపోయిరి. తొలుత అరబ్బులై యుండి క్రమక్రమముగా వారు అంతకంతకు హెచ్చుగా స్పానిష్వారైరి. బహుశా ఈ స్పానిష్‌అరబ్బులు బాగ్దాదుఅరబ్బులకన్న భిన్నులైయుండి యుండవచ్చును. నేడుకూడ స్పానిష్‌జాతి రక్తనాళములలో అరబ్బుల రక్త మెక్కువగా ఉన్నది.

సారసనులు దక్షిణఫ్రాన్సుకును, స్విట్జర్లండుకునుకూడ ప్రాకిరి. పాలకులుగా వారు పోలేదు. స్థిరనివాసము లేర్పరచుకొనుటకు పోయిరి. నేడుకూడ అప్పుడప్పుడు మిడీకాలువప్రాంతమునుండి వచ్చు ఫ్రెంచి ప్రజల ముఖములలో అరబ్బుల ముఖముయొక్క మాదిరి గమనించ వచ్చును.

ఈవిధముగా స్పెయినులో సారసనుల పరిపాలన మంతరించెను. దానితోపాటు అరబ్బుల నాగరికతకూడ అంతరించెను. ఇంతకుముందే ఈ నాగరికత ఆసియాలో అంతరించెను. ఈ సంగతి మనము ముందు తెలిసికొందము. ఈ నాగరికత పలుదేశములపై, అనేక సంస్కృతులపై తన ప్రభావమును చూపెను. తేజోవంతమగు జ్ఞాపకచిహ్నము లనేకము మిగిలెను. కాని అది పిదపచరిత్రలో తనకుతానై మరల తలయెత్తలేదు.

స్పెయినుదేశమును సారసనులు విడిచినపిమ్మట, ఫెర్డినాండు ఇసాబెల్లాలక్రింద నది ప్రబలమయ్యెను. తరువాత కొద్దికాలముననే అమెరికా కనుగొనబడెను. దానితో ఎక్కడలేని ధనము స్పెయినులో వచ్చిపడెను. కొంతకాలమువరకు నది యూరోపులో మిక్కిలి ప్రబల ముగానుండి ఇతరులను తన వశమం దుంచుకొనెను. కాని త్వరలోనే

అది పతనమయ్యెను. పిమ్మట దాని పే రెత్తువారైన లేరైరి. యూరోపు లోవి మిగతదేశములు వృద్ధినందదొడగెను. స్పెయినుమాత్రము మధ్య యుగముల నింకను తలచుకొనుచు, నాటినుండియు ప్రపంచము మారిన దను విషయము గుర్తెరుగకుండ, చలనములేకుండ నిలిచిపోయినది.

లేన్‌పూల్ అను ఇంగ్లీషుచరిత్రకారుడు స్పెయినులోని సారసను లనుగురించి ఈవిధముగా వ్రాసియున్నాడు :

“శతాబ్దుల కాలము స్పెయిను నాగరీకకేంద్రమై యుండెను. కళలు, శాస్త్రములు, విద్య, జ్ఞానవికాసమునకు తోడ్పడు సర్వవిషయ ములు అందు పాదుకొనియుండెను. మూరుల విజ్ఞానాధిపత్యమును సమీ పించిన దేశము యూరోపులో ఇంతవరకును లేదు. ఫెర్డినాండుఇసా బెల్లాలయొక్కయు, ఛార్లెసుసామ్రాజ్యముయొక్కయు స్వల్పకాలమే వెలి గిన వెలుగు అట్టి చిరస్థాయియగు ప్రఖ్యాతిని సంపాదించలేదు. మూరులు దేశమునుండి తరుమగొట్టబడిరి. కొంతకాలముపాటు క్రైస్తవమతావలంబి యైన స్పెయినుదేశము ఎరువుతెచ్చుకొన్న కాంతితో చంద్రునివలె వెలి గెను. పిమ్మట దానికి గ్రహణము పట్టెను. ఆ అంధకారములో నాటి నుండియు అది పొర్లాడుచుండెను. మూరుల కెత్తిన నిజమగు జ్ఞాపక చిహ్నము నిర్మానుష్యమగు ఊషరక్షేత్రములో మనకు కానవచ్చుచున్నది. ఒకప్పు డిచ్చటనే మూరులు ద్రాక్షతీగలను, ఆలివుమొక్కలను, పచ్చని వరికంకులను విస్తారముగా పెంచియుండిరి. అజ్ఞానులగు మందబుద్ధు లలో ఈ చిహ్నము కానవచ్చుచున్నది. ఒకప్పు డిచ్చట ప్రజలలో విద్యా వివేకములు విజృంభించియుండెను. ఎట్టివృద్ధియు లేక పతితులై సాటి జాతులలో తలయెత్తుకొనుటకు వీలులేని ప్రజలలో ఈ చిహ్నము కాన వచ్చుచున్నది. ఇట్టి పరాభవమునకు వా రర్హులే.”

ఇది కఠినమగు తీర్పే. సంవత్సరముక్రితము స్పెయినులో విప్ల వము పుట్టి రాజు తొలగించబడెను. ఇప్పు డచ్చట ప్రజాస్వామికపరిపాలన ముండెను. బహుశా బాల్యదశలో నున్న ఈ ప్రభుత్వము వెనుకటికన్న చక్కగా పరిపాలన చేసి ఇతరదేశములకు తుల్యముగా నుండునట్లు స్పెయినును చేయగలదేమో.

# 62

# క్రైస్తవమత యుద్ధములు

## [Crusades]

జూన్ 19, 1932

జెరూసెలంనగరమును తిరిగి వశముచేసికొనుటకు మస్లిముల మీద పోపును, అతని చర్చిసంఘమును మతయుద్ధమును ప్రకటించిరని ఇదివరలో ఒక జాబులో (57) నీకు వ్రాసియుంటిని. నానాటికిని అతిశయించుచున్న సెల్జూక్‌తురుష్కుల ప్రాబల్యము యూరోపును భయపెట్టెను. వారు కాన్‌స్టాంటినోపులుపై పడ నుంకించుచుండుటచే అచ్చటి దొరతనమునకు మరియు భయముగా నుండెను. జెరూసెలమునకును, పాలస్తీనాకును వెళ్ళిన క్రైస్తవయాత్రికులను తురుష్కులు దురాదరణ చేసి రను కారణమున యూరోపుప్రజలు కోపోద్రేకులైరి. కాన మత యుద్ధము ప్రకటింపబడెను. యూరోపులోని క్రైస్తవులందరును పవిత్ర నగరమును రక్షించుటకై కదలివెళ్ళవలసినదని పోపును, చర్చియు ఉత్తరువుచేసిరి.

ఇట్లు క్రీ. వె. 1095 సంవత్సరమున మతయుద్ధములు ప్రారంభ మాయెను. 150 సంవత్సరములు పైగా క్రైస్తవమునకును ఇస్లామునకును, సిలువకును చంద్రవంకకును పోరాటము సాగెను. మధ్యమధ్య దీర్ఘకాలము వారు విశ్రాంతి తీసికొనుచుండిరికాని యుద్ధపరిస్థితు లొక మాదిరిగానే ఈకాలమునం దంతటను ఉండెను. క్రైస్తవమతవీరులు కెరటములుగా యుద్ధమునకు వచ్చిపడి చాలభాగము పవిత్రదేశములో మడయుచుండిరి. క్రైస్తవమతవీరులకీ దీర్ఘయుద్ధమువలన లాభములు కలుగకుండెను. కొద్దికాలముపాటు జెరూసెలం వారి చేతులలో నుండెను. కాని పిమ్మట అది మరల తురుష్కుల వశమయ్యెను. అది వారి చేతులలోనే నిలిచిపోయెను. క్రైస్తవమతయుద్ధములవలన కలిగిన ముఖ్య ఫలితము లక్షలకొలది క్రైస్తవులకును, మస్లిములకును మరణమును,

దుఃఖమును తెచ్చిపెట్టుటయును, ఆసియా మైనరుపాలస్తీనాలను మానవ రక్తముతో తడుపుటయును.

ఈ కాలమున బాగ్దాదు సామ్రాజ్యపరిస్థితు లెట్లుండెను? అబ్బాసీదులే దానికి నాయకులై యుండిరి. ఇంకను వారే కాలీఫులుగా—మతవిశ్వాసము కలవారి నాయకులుగా—నుండిరి. కాని వారు పేరుమట్టుకుమాత్రమే నాయకులు. వారికి ఉన్న అధికారము కొంచెమే. వారి సామ్రాజ్య మెట్లు చీలికలైనదో, రాష్ట్రపాలకులు స్వతంత్రులైరో ఇదివరలో తెలిసికొని యున్నాము. ఇండియాపై తరచు దండయాత్రలు సాగించిన గజినీ మహమ్మదు ప్రబలుడగు రాజు. తన ఇష్టప్రకారము ప్రవర్తించకున్నచో కాలీఫును దండించెద నని భయపెట్టెను. బాగ్దాదులోసైతము తురుష్కులే నిజమగు యజమానులై యుండిరి. పిమ్మట తురుష్కులలో వేరొక తెగవారు—సెల్జూకులు—వచ్చిరి. వారు తమ యధికారమును శీఘ్రకాలము లోనే స్థాపించుకొనిరి. జయశీలురై వారు కాన్‌స్టాంటినోపుల్‌ద్వారముల వరకు వ్యాపించిరి. రాజకీయాధికారము లేకున్నను కాలీఫు ఆ పదవిలోనే నిలిచియుండెను. సెల్జూకునాయకుల కతడు సుల్తానుబిరుద మొసగెను. సుల్తానే పరిపాలన చేయుచుండెను. క్రైస్తవమతవీరు లీ సెల్జూకు సుల్తానులతోను, వారి అనుచరులతోను పోరాడవలసివచ్చినది.

యూరోపులో మతయుద్ధములు కారణముగా క్రైస్తవప్రపంచ భావన అతిశయించెను. క్రైస్తవేతరులు, క్రైస్తవులు అను భేదభావన హెచ్చెను. యూరోపున కంతకును ఒకే భావన, ఒకే సంకల్పము కలిగెను. అది పవిత్రభూమిని క్రైస్తవమతవిశ్వాసము లేనివారి చేతుల నుండి మరల స్వాధీనముచేసికొనుట. ఈ సంకల్పము ప్రజలలో అవేశ మును కలిగించెను. ఇట్టి మహత్కార్యమును సాధించుటకై అనేకులు ఇండ్లను, ఆస్తులను వదలుకొనిరి. మహదాశయములతో పలువురు యుద్ధమునకు తరలివెళ్ళిరి. వెళ్ళినవారి పాపములు క్షమించబడు నని పోపు వాగ్దానము చేసియుండుటచే పలువురు ఆకర్షింపబడిరి. మతయుద

ములకు ఇతరకారణములుకూడ కలవు. కాన్‌స్టాంటినోపులు యాజమాన్య మును వహించవలె నని రోమ కోరెను. కాన్‌స్టాంటినోపులుచర్చి రోము చర్చికి భిన్నమని నీకు జ్ఞాపకమున్న దనుకొందును. రోముచర్చియనిన దాని కనిష్టము. తన చర్చికి ఆర్థొడాక్సుచర్చి అని పేరు పెట్టుకొనెను. పోపు నడుమంత్రపు సిరి పొందినవాడని దాని అభిప్రాయము. కాన్‌స్టాంటి నోపులుగర్వము నణచవలె ననియు, దానిని తన స్వాధీనములోనికి తెచ్చుకొనవలెననియు పోపు తలచెను. క్రైస్తవమతవిశ్వాసము లేని తురుష్కులపై మతయుద్ధ మని పేరుపెట్టి తన చిరాభీష్టము నెరవేర్చు కొనవలె నని పోపు తలచెను. రాజకీయవేత్త లనుకొనువారి పద్ధతు లిట్లే గదా యుండును! రోము, కాన్‌స్టాంటినోపులుల మధ్య నున్న ఈ వివాదమును మనము జ్ఞప్తియం దుంచుకొనవలెను. మతయుద్ధముల పొడుగునను ఈ వివాదము తలయెత్తుచునేఉండును.

మతయుద్ధములకు వేరొక కారణము వర్తకమునకు సంబంధించి నది. వృద్ధినందుచున్న రేవుపట్టణములగు వెనీసుజినోవాలలోని వర్తకులు ఈ యుద్ధములు కోరుకొనిరి. వారి వర్తకము సాగకపోవుట ఇందుకు కారణము. సెల్జూకుతురుష్కులు తూర్పునకు పోవు వర్తకమార్గములను పెక్కింటిని మూసివేసిరి.

ప్రజాసామాన్యమున కీ కారణము లేమియు తెలియవు. ఎవరును వారితో చెప్పలేదు. రాజ్యతంత్రజ్ఞులు సామాన్యముగా అసలు కారణములను కప్పిపుచ్చి, మతమనియు, ధర్మమనియు, సత్యమనియు మొదలుగా పెద్దమాటలు చెప్పుచుందురు. క్రైస్తవమతయుద్ధముల కాలమున అట్లుండెను. నేడును అట్లే ఉన్నది. ప్రజ లప్పు డామాటలు విని మోస పోయిరి. ఇప్పుడుకూడ ప్రజాబాహుళ్యము రాజ్యతంత్రజ్ఞుల ఇచ్చకపు మాట లాలించి మోసపోవుచున్నారు.

ఇట్లు మతయుద్ధములకై అనేకులు చేరిరి. అం దావేశపూరితులును, ఉత్తములును ఉండిరి. ఉత్తములని చెప్పుకొనుటకు వీలులేనివారును, కొల్లగొట్టి ధనము మూటగట్టుకొనవచ్చునని ఆసించినవారునుకూడ ఉండిరి. అది యొక వింతమూక' భక్తులును, మతావేశముకలవారును,

ఎట్టి నేరము చేయుటకైనను జంకని నీతమనుష్యులను అందుండిరి. నిజమున కీమతవీరులు (Crusaders) అందరు [illegible] ను పలువురు. ఉత్తమకార్యమును సాధించుటకు దొరకన్నవారు [illegible] ల దుర్మార్గమైనట్టియు, అసహ్యాకరమైనట్టియు నేరముల జేసియుండిరి. పలువురు మార్గమధ్యముననే దోపుళ్లు ప్రారంభించిరి; దుష్ప్రవర్తనకు లోనైరి. వారు పాలస్తీనాసమీపమునకైన పోలేదు. కొందరు త్రోవలో యూదులను హత్యచేయ ప్రారంభించిరి. కొందరు సాటిక్రైస్తవులను సైతము హత్యగావించిరి. వీరి దుష్ప్రవర్తనకు కోపించి త్రోవలో నున్న క్రైస్తవ దేశములలోని కృషికులు వారిపై తిరుగబడి అనేకులను చంపిరి. మిగత వారిని తరుమగొట్టిరి.

చిట్టచివరకు మతవీరులు గాడ్ఫ్రే ఆఫ్ బ్యూలాన్ నాయకత్వమున పాలస్తీనా చేరుకొనగలిగిరి. జెరూసెలము వారికి కరగతమయ్యెను. పిమ్మట "వారముదినములపాటు శత్రువధ జరిగెను." దారుణముగా హత్యలు చేయబడినవి. దీనిని చూచిన ఒక ఫ్రెంచి సాక్షి ఇట్లు చెప్పుచున్నాడు: "మశీదు ద్వారమంటపములో మోకాటిబంటి రక్తము నిలిచియుండెను. గుర్రముల కళ్ళెములకు ఆ రక్తము తగులుచుండెను." గాడ్ఫ్రే జెరూసెలముకు రాజయ్యెను.

డెబ్బదిసంవత్సరములు గడచినపిమ్మట క్రైస్తవులనుండి ఈజిప్టుకు సుల్తానైన సలాదీన్‌చే జెరూసెలం మరల స్వాధీనముచేసికోబడినది. ఇది చూచి యూరోపుప్రజ ఉద్రేకపూరితులైరి. అనేకదండయాత్రలు తరువాత నడచెను. ఈమారు యూరోపులోని రాజులును, చక్రవర్తులును కూడ స్వయముగా బయలుదేరిరి. కాని వారికి విజయము చేకూరలేదు. వారిలో ఒకరిని చూచిన ఒకరికి కిట్టకుండెను. మేము గొప్ప అనగా మేము గొప్ప అనుచు వారిలో వారు కలహించుకొనిరి. తరువాతి గాథ విషాదకరమైనది. భయంకరమగు క్రూరయుద్ధము, చిల్లరకుట్రలు, క్షుద్రనేరములు—వీటితో నిండిన దా గాథ. కాని ఒక్కొక్కప్పుడు మానవ స్వభావముయొక్క మేలిగుణములు ఈ బీభత్సమును మించి ప్రస్ఫుటమగుచుండెను. శత్రువు లొకరిపట్ల నొకరు సగౌరవముగా ఔదార్యముతో

ప్రవర్తించిన సందర్భములును ఉండెను. పాలస్తీనాలో నున్న విదేశ రాజులలో ఇంగ్లాండురాజగు రిచర్డు—సింహహృదయు డని పేరొందిన వాడు—ఉండెను. దేహబలమునకును, సాహసమునకును ప్రసిద్ధిగాంచినవా డతడు. సలాదీను కూడ గొప్ప రణవీరుడు. సాహసమునకు ప్రసిద్ధిగాంచిన వాడు. సలాదీనుతో యుద్ధముచేసిన మతవీరులుసైతము మితిసి సాహ సౌదార్యములను కొనియాడిరి. ఒకమారు రిచర్డు చాల జబ్బుపడినట్లును, వేడికి తాళలేక బాధపడినట్లును సలాదీను తెలిసికొని కొండలమీద పేరు కొన్న క్రొత్త మంచు తెప్పించి అతనికి పంపించినట్లును ఒక కథ చెప్పుదురు. ఇప్పుడు మనము చేసికొనునట్లు ఆ కాలములో నీటిని గడ్డ కట్టించి మంచును తయారుచేసికొనుట లేదు. కాన కొండలనుండి స్వభావ సిద్ధమగు మంచును శీఘ్రగాములగు చారులచే తెప్పించవలసియుండెను.

మతయుద్ధములకు సంబంధించిన కథ లనేకము గలవు. బహుశా నీవు వాల్టరుస్కాట్ వ్రాసిన 'టాలిస్‌మన్' చదివియుందువు.

మతవీరులలో ఒక భాగము కాన్‌స్టాంటినోపుల్ వెళ్లి దానిని స్వాధీనముచేసికొనిరి. తూర్పుసామ్రాజ్యము నేలు గ్రీకు చక్రవర్తిని వారు తరిమివేసిరి. అచ్చట లాటిన్‌రాజ్యమును, రోమనుచర్చిని స్థాపించిరి. కాన్‌స్టాంటినోపులు దారుణహత్యలకుకూడ పాల్పడెను. మతవీరు లా నగరమును కొంతభాగము తగులబెట్టిరి. కాని ఈ లాటినురాజ్యము చిరకాలము వర్ధిల్లలేదు. దుర్బలులై యుండియు తూర్పుసామ్రాజ్య మందలి గ్రీకులు తిరిగి వచ్చి ఏబది సంవత్సరములు దాటినతోడనే లాటి నులను తరిమివేసిరి. కాన్‌స్టాంటినోపులు రాజధానిగా తూర్పుసామ్రాజ్యము మరి 200 సంవత్సరములు—1453 వరకు వర్ధిల్లెను. పిమ్మట తురు ష్కులు దానిని తుదముట్టించిరి.

మతవీరులు కాన్‌స్టాంటినోపులును స్వాధీనముచేసికొనుట రోమనుచర్చియు, పోపును తమ యధికారములోనికి దానిని తెచ్చుకోవలె నను కోరికతో నున్నారను మాటను ధ్రువపరచును. ఈ నగరమందలి గ్రీకులు భయోత్పాతముతో, తురుష్కుల నెదిరించుటకు సహాయము పంపమని రోము నడిగినప్పటికిని మతవీరుల కది ఎట్టి సహాయమును

చేయలేదు. వారిని చూచిన వీరి కెంతమాత్రము కిట్టకుండెను.

ఈ దండయాత్ర లన్నింటిలోను మిక్కిలి విషాదకరమైనది పిల్లల దండయాత్ర. చిన్న బాలు రనేకులు, ముఖ్యముగా ఫ్రెంచి బాలురును, కొందరు జర్మను బాలురును, ఆవేశముతో ఇండ్లను విడిచివచ్చి పాలస్తీనా వెళ్లుటకు నిశ్చయించుకొనిరి. పలువురు త్రోవలో చనిపోయిరి. పలువురు తప్పిపోయిరి. వారిలో అధిక సంఖ్యాకులు మార్సెయిల్సు చేరుకొనిరి. అక్కడ దుర్మార్గులు కొందరు బాలుర యావేశమును చూచి వారిని మోసగించిరి. "పవిత్రభూమి"కి తీసికొని వెళ్లెదమని మభ్యపెట్టి బానిస వర్తకులు వారిని తమ ఓడలలో ఎక్కించి ఈజిప్టు తీసికొనిపోయి వారిని బానిసలుగా అమ్మివేసిరి.

పాలస్తీనానుండి తిరిగివచ్చుచుండగా ఇంగ్లాండురాజు రిచర్డును తూర్పుయూరోపులో శత్రువులు పట్టుకొనిరి. అతనిని విడిచిపెట్టుటకు పెద్ద ధనమొత్తము చెల్లించవలసియుండెను. ఫ్రాన్సురా జొకడు పాలస్తీనాలోనే పట్టుబడెను. అతనిని విడిపించుటకును ధనము చెల్లించబడెను. పవిత్ర రోమకసామ్రాజ్య చక్రవర్తి యొకడు, ఫ్రెడరిక్ బార్బరోస్సా అనువాడు పాలస్తీనాలోని ఒక నదిలో మునిగిపోయెను. కొంత కాలము గడచినపిమ్మట మతదండయాత్రలపై ప్రజల కున్న వ్యామోహము సన్నగిల్లెను. ప్రజలకు ముఖము మొత్తెను. జెరూసెలము మస్లిముల చేతులలోనే ఉండిపోయెను. యూరోపులోని రాజులును, ప్రజలును దానిని స్వాధీనము చేసికొనుటకు ధనప్రాణములను నష్టపెట్టుట కిష్టపడకుండిరి. నాటినుండి 700 సంవత్సరముల కాలము మస్లిముల క్రిందనే జెరూసెలం ఉండిపోయెను. ఈ మధ్యనే మహాయుద్ధకాలమున 1918 సంవత్సరమున ఒక ఇంగ్లీషు సేనాని తురుష్కులనుండి జెరూసెలమును వశపరచుకొనెను.

పిదపకాలములో జరిగిన ఒక మతదండయాత్ర అసామాన్యముగా నుండెను. పవిత్రరోమకసామ్రాజ్య చక్రవర్తియైన ఫ్రెడరిక్ II వచ్చి యుద్ధము చేయుటకు బదులు అప్పుడున్న ఈజిప్టుసుల్తానుతో సంప్రతించెను. దానికి ఫలితముగా వారు స్నేహభావముతో నుండ నిశ్చయించు

కొనిరి. ఫ్రెడరిక్కు అసాధారణ పురుషుడు. రాజులు సామాన్యముగా నిరక్షరాస్యులుగా నుండు కాలమున అతడు పలుభాషలలో పాండిత్యము సంపాదించెను. అరబిక్ కూడ అతనికి వచ్చును. "ప్రపంచమున అద్భుత పురుష" డను పేరు అతని కుండెను. పోపు నాతడు లెక్కచేయలేదు. అందుచే పోపు అతనిని బహిష్కరించెను. కాని దీనివల్ల అతనికి కలిగిన ఇబ్బంది ఏమియు లేకుండెను.

మతదండయాత్రలు సాధించిన ప్రయోజన మొక్కటియు లేదు. నిరంతర యుద్ధమువలన సెల్జూకుతురుష్కులు దుర్బలులైరి ఇంతకన్న అధికముగా ఫ్యూడల్ పద్ధతి సెల్జూకుసామ్రాజ్యసారమును పీల్చివేసి దానిని పిప్పిచేసెను. గొప్ప ఫ్యూడల్ ప్రభువులు తాము స్వతంత్రులమని భావించు కొనుచుండిరి. ఒకరితో నొకరు పోరాడుకొనుచుండిరి. ఒక్కొక్క పర్యాయము వారు క్రైస్తవసహాయము నపేక్షించుచుండిరికూడ. తురుష్కులయొక్క ఇట్టి అంతర్దుర్బలత్వమే వారు మతవీరుల చేతులలో అప్పుడప్పుడు పరాజయమందుటకు కారణమయ్యెను. అయినను, సలాదీన్ వంటి శక్తిమంతుడగు పాలకు డున్న కాలమున వారు కొంత ముందుకు పోసాగిరి.

మతదండయాత్రల విషయమై వేరొక యభిప్రాయము కలదు. నవీన కాలమున ఇంగ్లీషు చరిత్రకారుడైన జి. యం. ట్రెవెల్యాన్ అను వాడు (నీకు తెలిసిన గారిబాల్డీ గ్రంథముల కర్త) ఈ అభిప్రాయమును వెల్లడించెను. ఇది వినుట కింపుగా నున్నది. ట్రెవెల్యాన్ చెప్పుచున్నాడు: "యూరోపులో శక్తులు పునరుజ్జీవిత మగుచుండెను. తూర్పుదేశములకు పోవలెనని అవి ప్రేరించుచుండెను. అట్టి సామాన్యప్రేరణయొక్క సైనిక మతవిషయక ఆకృతులే ఈ మతదండయాత్రలు. మతదండ యాత్రల ఫలితముగా యూరోపుకు లభించిన లాభము పవిత్రమగు క్రీస్తు సమాధిని శాశ్వతముగా విడుదలచేయుట కాదు. క్రైస్తవప్రపంచమును ఏకముచేయుట కాదు. మతదండయాత్రల చరిత్ర చూచిన ఈ ఫలములు సిద్ధించలేదని స్పష్టమగుచున్నది. దానికి బదులు యూరోపు తెచ్చుకొన్నవి— లలితకళలు, వృత్తులు, భోగములు, శాస్త్రము, జ్ఞానతృష్ణ. ఇవి

యన్నియు వనవాసియగు పీటరు తృణీకరించియుండును."

సలాదీన్ 1193 సంవత్సరమున మరణించెను. క్రమేణ ప్రాత అరబ్బీసామ్రాజ్యశేషము కూలిపోయెను. పశ్చిమఆసియా అనేకభాగములలో చిన్న ఫ్యూడల్‌ప్రభువుల క్రింద అల్లరులు పుట్టెను. చిట్టచివర మత దండయాత్ర 1249 సంవత్సరమున జరిగెను. ఫ్రాన్సురాజైన లూయీ IX నాయకత్వము వహించెను. అతడు పరాజితుడై చెరబట్టబడెను.

ఈలోపుగా తూర్పుఆసియాలోను, మధ్యఆసియాలోను గొప్ప విశేషములు జరుగుచుండెను. మంగోలులు చెంగిజ్, లేదా జెంగిజ్‌ఖాన్ అను సమర్థుడగు నాయకుని నాయకత్వమున ముందుకు చొచ్చుకొనిపోయి కాలమేఘమువలె తూర్పుదిక్చక్రము (horizon) ను క్రమ్ముచుండిరి. తమమీదకు విరుచుకొనిపడుచున్న ఈ దండయాత్రను చూచి మత వీరులును, తత్ప్రతిపక్షులును, క్రైస్తవులును, మస్లిములును అందరును సమానముగా భయపడుచుండిరి. ముందుముందు వ్రాయు జాబులో చెంగిజ్‌నుగురించియు, మంగోలులనుగురించియు వ్రాయుదును.

ఈ జాబును ముగించుటకు పూర్వము ఒక్కవిషయము చెప్ప వలసియున్నది. మధ్యఆసియాలోని బొఖారాలో ఒక గొప్ప అరబ్బీవైద్యుడు నివసించియుండెను. అతనికి ఆసియాలోనేకాక యూరోపులోకూడ ప్రసిద్ధియుండెను. అతని పేరు ఇబిన్‌సీనా. కాని యూరోపులో "అవిసిన్నా" యను పేరనే అతని నందరు ఎరుగుదురు. అతనికి వైద్యరాజను ప్రసిద్ధియుండెను. అతడు మతదండయాత్రలు ప్రారంభించుటకు ముందు 1037 సంవత్సరమున మరణించెను.

ప్రసిద్ధుడుకాన ఇబిన్‌సిన్నాపేరు నేనుదాహరించితిని. కాని ఈ విషయమును జ్ఞాపకముంచుకొనుము. ఈ కాలభాగము పొడుగునను, అరబ్బీసామ్రాజ్యము క్షీణదశ నందుచున్నప్పటికిని అరబ్బీ నాగరికత పశ్చిమ ఆసియాలోను, మధ్యఆసియా కొంత భాగములోను వర్ధిల్లుచుండెను. మతవీరులతో పోరాటము సలుపుచున్నప్పటికిని సలాదిన్ అనేక కళాశాలలను, వైద్యశాలలను స్థాపించెను. కాని ఈ నాగరికత హఠాత్తుగా సంపూర్తిగా పతనముకానున్నది. తూర్పుదిశనుండి మంగోలులు వచ్చుచుండిరి.

# GLOSSARY

Abbasides-అబ్బాసీదులు
Abbots-మఠాధికారులు
Academy-పరిషత్తు
Algebra-బీజగణితము
Arches-ఆర్చిలు (విలుకంపులు)
Architecture-వాస్తుశాస్త్రము
Barbarians-అనాగరికులు, బర్బరులు
Baron-బ్యారను
Base-కార్యరంగము
Baths-స్నానతటాకములు
Bishop-బిషప్పు
Bourgeoisie-బూర్జువాజా; మధ్యతరగతులు
Buttress-అండగోడ
Calender-పంచాంగము
Caravans-బిడారులు
Cardinal-కార్డినలు
Cathedral-కతీడ్రలు
Central government-కేంద్ర ప్రభుత్వము
Challenge-సవాలు
Christendom-క్రైస్తవలోకము
Civil war-అంతఃకలహము
Clan-తెగ
Clergy-మతగురువర్గము
Cloistered emperor-మఠస్థ చక్రవర్తి
Colony-వలస, అధినివేశము
Commander of the faithful-మతభక్తుల నాయకుడు
Commons-కామన్సు
Crescent-చంద్రవంక
Crusades క్రూసేడులు, మతయుద్ధములు, మతదండయాత్రలు
Crusaders-మతవీరులు
Culture-సంస్కృతి, విజ్ఞానము
Curiosity-కౌతుకము
Democracy-ప్రజాస్వామికము
Defender of the faith-క్రైస్తవ మత రక్షకుడు
Dispensations-వ్యవర్తన పత్రములు
Divine right-దైవదత్తాధికారము
Division of labour-శ్రమవిభాగము
Dynasty-రాజవంశము
Elector princes-నియామక రాజకుమారులు
Electron-ఎలెక్ట్రాను

Estates-ఎస్టేటులు
Excavation-ఖననము
Experiment-ప్రయోగము
Family-కుటుంబము
Fatherland-పితృదేశము, జన్మభూమి
Feudal system-ఫ్యూడల్ పద్ధతి
Financial system-ఆర్థిక విధానము
Franks-ఫ్రాంకులు
Fugitives-కాందిశీకులు
Garden City-ఉద్యాన నగరము
Gothic-గాథిక్కు
Goths-గాథులు
Gothic style of architecture గాథిక్ వాస్తువైఖరి
Great wall-గొప్ప గోడ
Greek fire-గ్రీకుల అగ్ని
Guild-సంఘము (వర్తక) (వృత్తి)
Heathen-క్రైస్తవేతరుడు
Hermit-వనవాసి, తాపసి
Horizon-దిక్చక్రము
House of Commons-కామన్సుసభ
House of Lords-లార్డ్సు సభ
Huns-హూణులు
Imperialists-సామ్రాజ్య(తత్వ) వాదులు
Indulgences-క్షమాదాన పత్రములు
Inquisition-(క్రైస్తవుల) ధర్మ విచారణ సభ
Intaglio engraving-పోగరపని
Juryman-పంచాయతీదారుడు
Jury system-జ్యూరీ పద్ధతి
Knight-నైటు
Legislation-శాసననిర్మాణము
Logic-తర్కము
Lords-ప్రభువులు
Market-వ్యాపారరంగము
Mathematics-గణితశాస్త్రము
Matter-ద్రవ్యము
Mayor-మేయరు, అధ్యక్షుడు
Mediterranian Sea- మధ్యధరా సముద్రము
Middle ages-మధ్యయుగములు
Militia-సేన (సైన్యదళము)
Monastery-మఠము
National-జాతీయ
Nationality-జాతీయత
Nobility-కులీనత్వము
Nobles-కులీనులు
Nomad-త్రిమ్మరి, దేశద్రిమ్మరి

Ommeyades-ఒమ్మియాదీలు
Politics-రాజనీతి
Polo-పోలో
Pope-పోపు
Porcelain-పింగాణి
Priests-పురోహితులు
Prophet-ప్రవక్త
Proton-ప్రోటాను
Public works-పబ్లిక్ భవ
నాదులు
Purgatory-పాపవిముక్తిలోకము
Red Sea-ఎర్రసముద్రము
Republic-ప్రజాప్రభుత్వము
Saracens-సారసనులు
Sea-farers-సముద్రసంచారులు
Serfs-కమతగాండ్రు
Science-విజ్ఞానశాస్త్రము
Scientific method-శాస్త్రీయ
విధానము
Social revolution-సాంఘిక
విప్లవము
Stone age-శిలాయుగము
Stress-ఒత్తిడి
Supremacy-అధికత
Temperature in shade-
నీడలో ఉష్ణోగ్రత
Tournament-క్రీడాయుద్ధము
Town hall-పురభవనము
Tribes-తెగలు
Trinity-ట్రినిటీ
Turks-తురుష్కులు (టర్కులు)
University-విశ్వవిద్యాలయము
Vandals-వాండలులు
Vassals-సామంతులు
Vicar-వికారు
White Huns-శ్వేతహూణులు
Yellow Sea-పచ్చసముద్రము



# అపూర్వ గ్రంథములు

'అపూర్వ గ్రంథములు' అను పేర ముద్రితాముద్రిత గ్రంథములను, సామాన్యముగ లభింపని కొన్ని రచనలను మేము ప్రచురింప నున్నాము. ఈ ప్రచురణలు సభ్యులకు మాత్రమే అమ్మబడును, ఈ శీర్షికయందు కామశాస్త్రము, శృంగారము, బూతు, నీతి, సామ్యవాదము, కమ్యూనిజము, వైద్యము, జ్యోతిషము మొదలైన విషయములకు చెందిన గ్రంథరాజములను కొలది ప్రతులను మాత్రమే ముద్రింపించి, ప్రచురింప నుద్దేశించియున్నాము. సభ్యత్వపు రుసుము రూ. 2/- మేమెట్టి గ్రంథమును ఈ శీర్షికలో ప్రచురించినను సభ్యులు కొనితీరవలయును. వి.పి. లు నిరాకరించిన వారు సభ్యత్వమునుండి తొలగించబడుదురు. సభ్యత్వపు రుసుము వాపసు ఇవ్వబడదు.

లాభములేమియు పెట్టుకోక, పుస్తకముల ముద్రణాదుల కగు అసలు ఖర్చుల ప్రకారమే పుస్తకములధరలు నిర్ణయింప బడును. సభ్యులలో బహుసంఖ్యాకులు కోరినట్టి ఏ గ్రంథము నైనను 6 నెలల వ్యవధితో ప్రకటించుటకు యత్నింతుము.

సభ్యులు కాదలచినవారు తమ పూర్తి విలాసములను వెంటనే వ్రాయవలెను. సభ్యత్వపు రుసుము వెంటనే పంప నవసరములేదు. ప్రథమ 'అపూర్వ గ్రంథము' త్వరలోనే వెలువడును.

వివరములకు :

## కల్చరల్ బుక్స్ లిమిటెడ్

పెరంబూరు                                        మదరాసు 11

# బాలానందము

'బాలానందము' అను శీర్షికతో మేము బాలబాలికలకు విజ్ఞానమునకును, వినోదమునకును ఉపయోగపడు కథలు, పాటలు మొదలయిన సకలవిధ ప్రాచీన, నవీన బాలవాఙ్మయమునకును సంబంధించిన పుస్తకములను బాలబాలికలకు నచ్చుతీరులో, ముచ్చటగా, సచిత్రముగా ప్రకటింపబోవుచున్నాము. ఈ శీర్షికలో మొట్టమొదటిదిగా శ్రీ చింతా దీక్షితులుగారి 'లక్క పిడతలు' అన్న పాటల పుస్తకము సచిత్రముగా అతిత్వరలోనే వెలువడనున్నది.



వివరములకు :

## కల్చరల్ బుక్స్ లిమిటెడ్

పెరంబూరు :: మదరాసు 11

